శ్రీమతే రామానుజాయ నమః

# భాగవతసురభూజము



రచన

శ్రీ మొవ్వ వెంకటదాసు గారు

శ్రీమతే రామానుజాయ నమః

# భాగవతసురభూజము



రచన

శ్రీ మొవ్వ వెంకటదాసు గారు

ప్రతులు : 1000

వృషనామ సంవత్సరము, వైశాఖపూర్ణిమ-2001

మూల్యము : 30-00

ప్రతులకు :

1. శ్రీ రాజ్యలక్ష్మి వేణుగోపాల జ్యూయలరి షాప్
   ప్రొ॥ శ్రీ మొవ్వ కృష్ణ ప్రసాదు గారు
   (గురువుగారి అబ్బాయి)
   అవనిగడ్డ పోస్టు, కృష్ణాజిల్లా. ఫోన్ : 72027

2. శ్రీ వేణుగోపాల సేవాశ్రమము
   పద్యాల గోపీచంద్రస్వామి
   పూడివాడ, నగరం మండలం, గుంటూరు జిల్లా
   ఫోన్ : 56049

ముద్రణ :

**డి. ఎస్. డిజిటల్ గ్రాఫిక్స్**

1/2 అరండల్‌పేట, గుంటూరు-2. ఫోన్ : 353893

# శ్రీరామ

ఇన్దిరాసున్దరీవాస
మన్ది రధ్బున్దురోరసమ్
వన్దారు జనమన్దారం
వన్దే2హం యదునన్దనమ్ 1

అపాంగసంగతేఃపుష్ట
జంగమాజంగమస్థితమ్
అనంగమాతరం దేవీం
భజేమంగళ దేవతామ్ 2

శంకరాంశసముద్భూతం
లంకనాధ భయంకరమ్
కింకరం నౌమి రామస్య
భావి బ్రహ్మం కితంకపిమ్ 3

అఖిలభువన జన్మస్థేమభజ్గాది లీలే
వినత వివిధభూత వ్రాతరక్షైక దీక్షే
శ్రుతి శిరసి విదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే
భవతు మమపరస్మిన్ శేముషీ భక్తిరూపా 4

## శ్రీమతే రామానుజాయనమః

గోవిందసుందర పదాంబుజమగ్న చిత్తో
మందాకినీతులిత మంజుల వాక్ప్రవృత్త్యా
లోకం సమస్త మకరోదవధూత పాపం
తం వేంకటాఖ్య గురుమాత్మ నిభావయామః

సంసారతా పానలదగ్ధభావా
స్సమాగ తాయావవవలోక్య సద్యః
భవంతి బోధామృత సేక హృష్టా
స్తామేగతిర్వేంకటదేశి కాంఘ్రీ

నారాయణాంఘ్రి నవనీరజమత్తభృంగం
భక్తి ప్రపత్తి సరసీ చరరాజహంసమ్
పౌరాణిక ప్రథమముత్తమ తత్త్వబోధం
శ్రీశ్రీనివాస గురుపుంగవమా శ్రయే 2 హమ్

శ్రీ విష్ణుపాద సరసీజ చరన్మిళిందం
గండూషితస్మృతి ముఖాద్యఖిలైకశాస్త్రం
వేదాంతతత్త్వ విపులార్థరహస్య బోధం
శ్రీ విష్ణుదాసగురుశేఖర మా శ్రయే 2 హమ్



శ్రీ భాష్యకార సమాజ స్ధాపకులు :

**మహర్షి శ్రీ వేంకటదాస స్వామి** (గ్రంథకర్త)

## ఈ గ్రంథములోని విషయ క్రమము :

శ్రీమతే రామానుజాయనమః

# పీఠిక

భాగవతులారా।

శ్రీభూనీళామనోహరుండై, యుభయవిభూతి నాయకుండై, సర్వదేవతా సార్వభౌముండై, యవాప్త, సమస్తకాముండై, సర్వభూతాంతర్యామియై, తనరారుచుండు శ్రీమన్నారాయణుండు, ప్రళయకాలమందు నెట్టి పురుషార్థంబునకు నర్హులుగాక ఖద్యోతంబుల భంగి వెలయుచున్న జీవులంగని దయార్ద్రహృదయుండై వారికిఁ బురుషార్థమూలంబై, కరణ కళేబరంబులతోఁగూడిన మానవాకారంబొసంగెను, కాని దేహధారులు కలుపుదీయుటకిచ్చిన కత్తుతోఁగన్నులు పొడుచుకున్నట్లు అకృత్యకరణ, కృత్యాకరణ, భగవదపచార, భాగవతాపచారా సహ్యాపచారంబులచేఁ బూర్ణులై, నరకాగ్ని పాలగుచుండి, రయ్యవసరంబున నొక్కనాడు వైకుంఠ మందిరంబునఁ దిరుమామణి మంటపమునందు, నంతస్సౌధంబున శేషతల్పంబునందు శయనించియుండు నారాయణుని పాదసంవాహనం బొనర్చు లక్ష్మీదేవి కన్నీరుమున్నీరుగా దుఃఖించె నత్తటి రమాదేవింగని మధుసూదనుండు దేవీ యిట్టి సంతోష సమయంబున దుంఖించుటకు గతంబేమని ప్రశ్నిం, పగా నిందిరాదేవి యిట్లనియె, ప్రాణనాథా మదీయదుఃఖంబునకుఁ గారణం బెఱిఁగింతు నాకర్ణింపుము, ఉభయ విభూతి సంస్థితులగు నిత్యముక్తబద్ధ కేవల ముముక్షునామకులగు పంచవిధజీవులు మన బిడ్డలై యున్నారు. వారిలో నిత్యముక్తులు మాత్రమీ వైకుంఠంబున నిరవధికానంద మనుభవింపుచున్నారు. కేవలులు కైవ్యంబునఁజేరి ప్రకృతి బంధ విముక్తులయ్యును భగవదనుభవార్హులు

కానందున నచేతనంబుల భంగివ్యర్థులైయున్నారు. వారి నమాచార మట్లుండనిమ్ము బద్ధులు దేహాత్మభ్రమచే నానావిధ దుఃఖభాజనులై యేడ్చుచున్నారు, వారింగాంచి దుఃఖించితి నెట్టైననుఁదదీయ బాధలు నివారింప వలయుననుటయుఁ గేశవుండిట్లనియెఁ బ్రాణేశ్వరీ నీ వాక్యంబు సత్యంబైనను నేనింతకుమున్న తత్ప్రయత్నం బొనర్చితి నెట్లంటివేని జీవులకుఁ గరణకళేబరంబులొసంగి నన్నుఁబూజించుటకు హస్తంబులునాకుఁ బ్రదక్షిణం బొనర్చుటకుఁ బాదంబులు నాకథ లాలాకించుటకు వీనులు, నాదివ్య మంగళ విగ్రహం బీక్షించుటకుఁ గన్నులు మదీయ పాద పూజాద్రవ్యం బాఘ్రాణించుటకు ముక్కు మన్నా మోచ్చారణం బొనర్చుటకు మదీయ ధ్యానంబొనర్చుటకు మనస్సు మొదలగు జ్ఞానేంద్రియకర్మేంద్రియంబు లొసంగితినైనను శరీరులంగీకరింపరైరి. నేనంతటఁ దూష్ణీంభావమును వహింపక రామకృష్ణాద్యవతారంబులతో భూలోకంబున సంచరించి జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్యతేజఃప్రభృతి కళ్యాణగుణంబులచే మదీయ ప్రభావంబుఁ జూపించితి శ్రీరంగ కాంచీపుర వేంకటాచలాదులయందు నర్చావతారంబుతొ సాక్షాత్కరించితి వాల్మీకివ్యాసశుక పరాశర నారదాదిమునుల యందావేశించి రామాయణ భారత భాగవతాది దివ్య గ్రంథములను రచింపఁజేసితినైనను జీవులంగీకారము సూపరైరి. జీవోజ్జీవనార్థమునే నెన్ని యుపాయంబులు వన్నితినో. చేతనాజ్ఞానంబుచే నన్నియు నపాయకరంబుల య్యెనిఁక నేమిచేయవలయునని సర్వేశ్వరుఁ డునిర్వేదింపఁగా జగన్మాతయు నిరుత్తరమయ్యె నంతలో శేషుండు గరుడధ్వజునిఁగాంచి యిట్లనియె దేవా సర్వశక్తుండవగు నీకీ వ్యసనములతోఁబనియేమి నీవాజ్ఞాపించితివేని నేను భూలోకంబునకరిగి

బద్ధజేతనులకు నీ పాదభక్తిఁ గలిగించి స్వల్పకాలములో మోక్షార్హులఁ జేసెద,నుభయవిభూతుల యందును నీవు మామక ప్రపత్తి నంగీకరింపవలయునని వరంబుఁదీసుకుని యాదియుగంబున ననంతుఁడై త్రేతాయుగంబున లక్ష్మణుఁడై ద్వాపరంబున బలరాముఁడై యవతరించి విష్ణుమహాత్త్వంబు వెల్లడించిన శేషుండు భూలోకంబునకువచ్చి దక్షిణదేశంబున శ్రీపెరుంబూధూరిలోఁ గాంతిమతీదేవి కేశవాచార్యులను పుణ్యదంపతులకుజన్మించి జన్మప్రభృతి షోడశవర్షంబులవఱకు విద్యాభ్యాస గృహస్థధర్మాదుల నెరపి పిమ్మట సన్యాసముపుచ్చుకొని చేతనోద్ధరణం బొనర్చుచు మొత్తముమీఁద నూటయిరువది వర్షంబులు మర్త్యలోకంబున వసించిరి, వ్యాసనారదాదులు దేహధారుకటు మోక్షమార్గంబుపదేశించిరిగాని మోక్షమీయఁజాలరైరి శంకరాదిమతకర్తలు బ్రాహ్మణులకుమాత్రము ముక్తిమార్గముపదేశించిరి. రామానుజయోగీంద్రుడు బ్రాహ్మణాగ్రే సరుండయ్యును బ్రాహ్మణులతో దృప్తివహింపక స్త్రీ శూద్ర చండాల కువిందాభీర స్వర్ణకార మ్లేచ్ఛాదులకుఁ దన సిద్ధాంతము నిరాఘాటముగా నుపదేశించుటయేగాక స్వయముగాముక్తినొసంగె మనుష్యులకేకాక పశుపక్షిమృగాదులకును మోక్షంబొసంగె నవతారసమాప్తికాలంబున శ్రీరంగంబునకేగి రంగనాయకీ సహితుండగు రంగేశ్వరునిఁగాంచి సాష్టాంగనమస్కృతులాచరించి యద్దేవునితోఁ బ్రభూ మదీయ జీవితకాలంబున మనుజులదిద్ది మోక్షంమున కనిచితి, నిఁకఁ బరమపదంబున కేగుచున్నవాఁడ బద్ధసంసారులకు నీమహిమంబు పదేశించువారుండరు నామతస్థులకొఱకు నేనేప్రపత్తి చేయుచుండెద మామక ప్రపత్తి నంగీకరించి యాచంద్రార్కముగా రామానుజీయులకు నపవర్గంబిచ్చుచుండమని



వరంబుఁగైకొని రామానుజయోగీంద్రులు నిత్యవిభూతికరిగిరి కాని మాదృశదీన జనోద్ధరణార్థమై యీ లోకంబునఁ జరింపుచునేయున్నారు మఱియు నిమ్మహాత్ముని వేదాంతవిద్యాపాండిత్య నిర్దొష్ట్యంబునకు నాశ్చర్యమొంది బదరికాశ్రమవాసులగు మునులు స్తుతించిరి. నవద్వీపంబున కేగినప్పడీ సూరిశేఖరకృత బ్రహ్మసూత్రభాష్య గీతాభాష్యంబులకు భారతిమెచ్చి భాష్యకారులని శారదాశోకనాశనుఁడని బిరుదములొసంగె నీరహస్యం బెఱుఁగని పండితమ్మన్యులు పండితపుత్రులు కొందఱహంకారపూరితులై యజ్ఞానమోహితులై యీ యోగీంద్రుని మానవమాత్రునిగాఁ దలంచి భాష్యాదులపై సమరంబునకుపక్రమించి వహ్నిశిఖాపతితంబులగు శలభంబుల భంగి దగ్ధమగుచున్నారు వారి దౌర్భాగ్యంబునకుఁ జింతించి, వరవరముని వేదాంత దేశికపిళ్ల లోకాచార్యాది మహాత్ములకు నమస్కరించి యీ కీర్తనల గ్రంథము రామానుజ సిద్ధాంతానుసారముగా లిఖించితి ముప్పతి వర్షంబుల నుండి నాచే నార్జింపఁబడిన భాష్యకార సభ్యులు స్త్రీ పురుషాదులు నాలుకువందలమంది ప్రేరించగా భాగవతసుర భూజములో గొంతభాగమచ్చు వేయించితిని గాని పుస్తకములైపోయినందున నీ రెండవ కూర్పునందు నింకనుఁ గొన్ని విశేషంబులు సేర్చి ముద్రింపించితిని కావునఁబండితులు వేదాంతులు భాగవతులు కవులు మదీయసాహసంబును క్షమించి మన్నింతురుగాకయని నమస్కరించెదను

ఇట్లు

విజ్ఞప్త భాష్యకారసమాజ నిర్మాత, శ్రీ వైష్ణవపాదరేణువు

**మొవ్వ వేంకటదాసు**

శ్రీరామ

శ్రీమతే రామానుజాయ నమః   శ్రీ వేంకటగురుభ్యోనమః

శ్రీ శ్రీనివాస గురుభ్యోనమః   శ్రీ విష్ణుదాసగురుభ్యోనమః

# విన్నపము

ఈ భాగవతసురభూజము గ్రంధకర్త మహర్షి శ్రీ మొవ్వ వేంకటదాసస్వామిగారు. వీరు ఆజన్మవైష్ణవులు. పోతనగారివలె సహజపండితులు. శ్రీ ఉడ్డైవరులయపరావతారమనుట కనేకని దర్శనములు గలవు. వీరు దివిసీమలో తల్లిగారి జన్మస్థలమగు వక్కవట్లవారిపాలెంలో క్రీ.శ.1891 సం॥ లో జన్మించిరి. పురిటింటనూయలలో ఉండగా అనంతుడు పడగపట్టుటయు, 12 సం వయస్సులో స్వప్నమున శ్రీ మహావిష్ణువు సాక్షాత్కరించి నాలుకపై బీజాక్షరములుంచుటయు జరిగినది. తదాదిగావారికి చదివిన గ్రంధమేదైనను, గురువు అవసరములేకుండగనే అవగతముకాజొచ్చెను. ఇరువది సంవత్సరులకే మహామనోజ్ఞమైన కవిత్వము వ్రాయగడంగిరి. తన 35 వ సంవత్సరము పూడివాడలో శ్రీ రాజ్యలక్ష్మి హనుమత్సమేత శ్రీ వేణుగోపాలునికి కోవెల నిర్మించియందు ప్రతిష్ఠించిరి. తదుపరి భద్రాచలములో రామాజ్ఞచొప్పున శ్రీ మద్వాల్మీకి రామాయణమును 4 1/2 నెలల వ్యవధిలో 32 పర్యాయములు పారాయణగావించి వచ్చిరి. 1931 లో ఆచార్యపీఠముపై ముందుగా నడుగిడి శ్రీ భాష్యకార సమాజమును స్థాపించిరి. సమాజప్రారంభములో వారేర్పరచిన నిబంధనలు అమలు పరచిన కట్టుబాట్లు ఈ గ్రంధములో ప్రారంభమున

పొందుపరచితిమి. ఏ విధమైన సడలింపులేక వారా కట్టుబాట్లతో సమాజమును నడపిరి. షుమారు 5–6 వందలమంది స్త్రీ పురుషులు వారిపాదములనాశ్రయించి తరించిరి. యతీశ్వరజయంతి, శ్రీ వేణుగోపాలుని బ్రహ్మోత్సవములు వారు నెఱపి భక్తులను ముక్తులను గావించిరి.

ఆచార్యకత్వము వహించినది మొదలు ప్రతివర్షా కాలమునందును వీరు శిష్య గ్రామములలో రామాయణ, భారత, భాగవతాది పురాణములను, భగవద్గీత, ఆచార్య సూక్తిముక్తావళ్యాది సంప్రదాయ గ్రంథములను చదివి చెప్పెడివారు. వీరి పురాణశైలి విలక్షణమైనది. " నభూతో నభవిష్యతి " అన్నట్లుండెడిది. సర్వశాస్త్ర పరిపూర్ణులైన కుమారులలో ఒకరో లేక సమర్థులైన పండితులో ఎవరో ఒకరు సంస్కృతాంధ్రములలో పై గ్రంథములను చదువుచుండగా ఏ ఆధారములేకయే వారు వచన రూపమున సొంపుగా తర్జుమాచేసి మహా మనోహరముగా వినిపించెడివారు. అటుల 25 సం ॥ నిర్విరామముగా పురాణ ప్రవచనములు కావించి వారు 1956 లో పురాణము మధ్యలో దివ్యలోకముకు తరలిపోయిరి. మోదుమూడి గ్రామమునందు సిర్విసెట్టి వారి కుటుంబమున జన్మించిన శ్రీమతి రాధాంబగారు వీరి అర్ధాంగి. ఈమె జీవితమునందేగాక భగవత్కైంకర్యమునందును సహధర్మచారిణియే. ఈ పవిత్ర దంపతులకు నల్గురు కుమారులు ఇరువురు కుమార్తెలు కలిగిరి. వీరు తండ్రిగారి అనంతరము వారి మార్గమునే అనుసరించుచుదారులను విస్తరించి భక్తిబీజములను వెదజల్లుచూ వచ్చిరి.

పెద్దకుమారులు శ్రీ శ్రీనివాస పెరుమాళ్ళుగారు పురాణములన్న వ్యాఖ్యానముచేయుటలో తండ్రిగారివలెదిట్టలనిపించుకొనిరి. వీర్క శ్రీ వేంకటేశ్వరస్వామిపై ఒక పద్య గ్రంధమును వచనరూపమున ఆళ్వారుల ఆచార్యుల చరిత్రను మూడు భాగములుగా వ్రాసి భాగవతులకందించి 1990 లో తిరునాడలంకరించిరి. మూడవకుమారులైన శ్రీ దాశరధీసూరిగారు (కవిభట్టారక, విష్ణుదాసు గారు ) ద్రవిడ వేదమైన 'తిరుప్పావై ' వ్యాఖ్య గావించుటలో క్రొత్తవరవడి సృజించి షుమారు 30 సం ఏకధాటిగా బోధించి తండ్రిగారి జీవితచరిత్రను ఇంక మూడు కావ్యములను వ్రాసి శిష్యులకందించి 1998 లో అన్నగారిననుగమించి శ్రీ విష్ణుసాయుజ్యమును పొందినారు. రెండవకుమారులు శ్రీ వేంకటాచలపతిగారు పురాణమును చదువుటయందును శ్రీ దాశరధిసూరిగారు భగవద్గీత వ్యాఖ్యానము నందును మహోన్నతులై విలసిల్లిరి. ప్రస్తుతము శ్రీ వేంకటాచలపతి గారు, శ్రీరామ ప్రసాదుగారు, శ్రీమతి పద్యాల రామబాణమ్మ గారు శ్రీమతి తన్నరుకమలాదేవి గారు తండ్రిగారేర్పచిన సమాజమును నడపుచు శక్త్యనుసారముగా భగవత్సే వసల్పుచునేయున్నారు. ఇటీవల శ్రీమాన్ వేంకటాచలపతి గురుదేవులు శ్రీ మద్వాల్మీకి రామాయణమును నూరుపర్యాయములు చదువుట పూర్తిచేయ కుటుంబములోని వారు భాష్యకార సమాజసభ్యులు ' రామయణ శతావృత్త పారాయణ మహోత్సమును ' శ్రీ వేణుగోపాలుని సమక్షమున మహా వైభవముగా జరిపినారు. ఇక మూడవతరము నందునూ శ్రీ శ్రీనివాస పెరుమాళ్ళ

గురుదేవుల అనంతరము వారికుమారులు శ్రీ వృషాద్రిపతిగారు, శ్రీ కృష్ణప్రసాదుగారు పురాణభక్తిని తాతగారి నుండి తండ్రిగారినుండి వారసత్వముగానందుకొని అదేరీతిని శిష్యగ్రామములలో కొనసాగించుచున్నారు. శ్రీ వేణుగోపాలుని ప్రతిష్ఠతో ఈ వంశమునకు పూర్వమునుండియు అంటిపెట్టుకున్న కొన్నిగ్రహదోషములు తొలగిపోయి శ్రీ వేంకటదాసుగారి కుటుంబము తామరతంపరగా విస్తరిల్లినది.

భక్తిభరితమైన శ్రీ వేంకదాసుగారు రచించిన గ్రంథములు శతాధికముగానున్నను కొలది గ్రంథములు మాత్రమే ముద్రణరూపమున వెలుగులోనికి వచ్చినవి. అట్టివానిలో విపులమైనదియు విశేషమైనదియు 'జ్ఞాన సూర్యోదయము' అను 800 పేజీల వచన గ్రంథము ఒకటి. ఇది విశిష్టాద్వైతసర్వస్వము. రెండవది ఈ భాగవతసురభూజము. దీనిని వీరు శిష్యులకోరిక పై విష్ణుభక్తిప్రబోధకముగా వివిధనామములతో కొన్ని కీర్తనలు రచించి స్వల్పముగానొకమారచ్చొత్తించిరి. పిదప ఇంక కొన్ని కీర్తనలు చేర్చి 1950 లో రెండవమారు రెండాశ్వాసముల గ్రంథముగా ముద్రణగావించిరి. గ్రంథములన్నియు అయిపోయినవి. భాష్యకారసమాజసభ్యులైన భాగవతులు పదేపదే కోరగా గ్రంథమును ముద్రించి అందించవలసినబాధ్యత స్వామిపౌత్రదౌహిత్రులమైన మాయందు ఉండగా శ్రీ కృష్ణప్రసాదుగారును నేనును ఈ పనికి పూనుకొంటిమి. ఎందుచేతననగా శ్రీకృష్ణప్రసాదుగారు దివిసీమయందు మోదుమూడిలో వివాహముచేసికొనిన దగ్గరనుండి కొలది కాలమచ్చట కాపురముండి సమాజసభ్యుల మంచిచెడ్డలు విచారించుచూ,

పురాణములు, పుణ్యకథలు చెప్పుచు పూజాదివిషయములలో తోడ్పడుచుప్రస్తుతము అవనిగడ్డలో స్థిర నివాసమేర్పరచుకొనియున్నారు. దివిసీమవాసులే ఈ సమాజ సభ్యులలో హెచ్చుసంఖ్య కావున వారి అభ్యర్ధన వీరికి మిక్కుటమైనది. ఇక మేనమామ మేనత్త బిడ్డలమైన మాలో మాకు ( స్వామి వారి పౌత్రదౌహిత్రులయందు) శరీరసంబంధము ఆత్మసంబంధము సమానమేయైననూ " మరొక్కటదెక్కుడు " అన్నట్లు మేమిరువురము 3 సంవత్సములు కలసి బాపట్లలో ( 1968 - 71) కళాశాలయందు విద్యనభ్యసించితిమి. నాకన్న వారు వయస్సులో కొంత పెద్దయగుటచే నాయందు ఎక్కువ చనువుకలిగి ఒరే " గోపీ "ఈ పనికింకెవ్వరో పూనుకొనుటకాదు. మనమిరువురమే పూర్తి చేయవలెనని యాదేశించనట్లు మాట్లాడిరి. అందులకు నేనెంతయో సంతసించి య్యటులనేయని ఆమోదించితిని. ఎందువలనన శ్రీ యామునాచార్యుల వారు స్తోత్రరత్నములో చెప్పి యున్నట్లు " పితామహంనాధము నింవిలోక్య " అనగా వేంకటదాసస్వామివారి సంబంధమున గదా యీ భాగ్యమనియు శ్రీ యాళ్వందారే సాయించినట్లు "అమర్యాదః క్షుద్ర శ్చలమతి రసూయాప్రసవభూః " అనునట్లుగా అనేకదుర్గుణ భాజనుడనైన నేనీ కార్యముతో తరింపవచ్చుననియు ఆనందముతో నంగీకరించితిని. అప్పటినుండి శ్రీ వేంకటదాసస్వామివారు వ్రాసిన అనేక కీర్తనలు అచ్చుకానివి శిష్యుల కంఠపాఠమై నాలుకల మీద నర్తించుచున్నవాని కొఱకు గాలించితిమి. సంవత్సరకాలము దొరలిపోయినది. ఇప్పటికి కొన్నిక్రొత్తవి లభించినవి. ఇక కాలయాపన భావ్యము కాదని ఈ వృషనామ వత్సర (54 వ) వార్షిక బ్రహ్మోత్సవములకైనను గ్రంథమును అందించవలెనని కార్యరంగమున దిగితిమి.

స్వామి వ్రాసిన కీర్తనలవ్రాతపుస్తకములకు పెట్టిన పేరులనేకములు కలవు. ఒకటి భాగవతసురభూజము. ఇంకొకటి భాగవత పారిజాతము. వేఱొకటి భాగవత కల్పభూజము. మరొక్కటి వివేకనిధానము. ఇకనొక్కటి వివేకసేవధి. ఇట్లనేక నామములుంచినను ఈ గ్రంథమునకు భాగవతసురభూజమనియే సార్థకనామమై చలామణియగుచున్నది. ఇందు వారికీర్తనలు 3 ఆశ్వాసములుగా ఉండును. ఇక స్వామి రచలలో ప్రథమము ప్రకృష్టమునైనది ; పండరికీర్తనలు, పండరి రగడ . అదియు ఇందులో చేర్చబడుచున్నది. ఇవిగాక ఇంకనిందు కొన్ని అంశములు అదనముగా'అనుబంధములు' కూర్చబడుచున్నవి. అవి 1) శ్రీ దాశరధిసూరి గారి కృత భారతగానము. పెద్ద చెల్లెలైన శ్రీమతి పద్యాల రామబాణమ్మగారి ( శ్రీ వేంకటేశ్వర్లుగారి ధర్మపత్ని) కోరిక పై భారతమును సులభశైలిలో పట్టాభిషేకము వరకు పాడుటకు అనుకూలముగా (ద్విపదలో)లో గద వ్రాసియుండిరి. దానిని (రామబాణమ్మగారే) మా తల్లి గారే అచ్చు వేయించిరి. ఆ గ్రంథములన్నియు చెల్లిపోయినవి. అందుచే ఆ భాగము కూడా ఇందు జతజేయబడుచున్నది.

2) శ్రీ వేంకటదాసస్వామి వారి ప్రథమ పౌత్రుడు "ఉపన్యాస చతురానన" శ్రీ వృషాద్రిపతిగారు వ్రాసిన గ్రంథములు, చెప్పిన కీర్తనలు అనేకము గలవు. అందు ఏ గ్రంథములలోను అచ్చుపడక జారిపోయిన రెండు కీర్తనలు ఇందు కూర్చబడినవి. అవి " మురవైరి పదసేవ " " విష్ణునామం " అను కీర్తనలు.

3) స్వామికుమార్తెలు విదుషీమణులు, శృత పాండిత్యశోభితలు శ్రీమతి పద్యాల రామబాణమ్మగారు, శ్రీమతి తన్నీరు కమాలాదేవి గారును చెప్పిన

కీర్తనలు, వచనరూపమైన రెండు స్మృతినంఘటనలు ఇందుచేర్చబడుచున్నవి. అవికూడాయిందెందుకన్న వేంకటదాసుగారి కుటుంబములో వేణుగోపాలుని సమక్షములో జరుగు ఖేదమోదములు భాగవతులకు పాదేయములుగనుక వారి కోరికపై ఇందు నిక్షేపింపబడుచున్నవి.

4) ఇక చివరగా ఇందు శ్రీ వేణుగోపాల నామములు చేర్చబడినవి. అవి శ్రీ వేంకటేశ్వరుని గోవిందనామములు వంటివి.

ఒక మహాకవీశ్వరుడు చెప్పినట్లు " వనజాతోద్భవ సన్నిభుల్ పొడమిరీ వంశాబ్ధిగర్భంబునన్ " అనుటకు తార్కాణముగా కవులకు గాయకులకు, భావుకులకు ఈ వంశము నందు కొదువలేదు. అందుకు ఈ బాలకుని రచనయేనిదర్శనము. (కవిభట్టారక విష్ణుదాస గురుదేవుల మూడవ కుమారుడు ) చి ॥ దేవనాథసూరి ఈ వేణుగోపాల నామములు కూర్చినది. ఈ చిరంజీవి సాహసమును శ్రీ భాష్యకార సమాజము అభినందింప పాఠకలోకము మన్నించునుగాక.

ఈ కీర్తనలు ఒక చోటికి చేర్చుటలో స్వామివారికుటుంబ సభ్యులందరూ సమాన భాగ స్వాములేఐనను, విశేషశ్రమచేసి నాకుపకరించిన శ్రీమతి మత్తి ఇందిరాదేవిగారికి ( శ్రీ మాన్ వేంకటాచలపతి గారి రెండవకుమార్తె ) శ్రీ వక్కపట్ల వృషాద్రిపతిగారికి ( శ్రీమాన్ రామప్రసాదుగారి రెండవ అల్లుడు ) నా ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ ప్రూపులను నేను పరిశీలించు సమయమున నాకు తోడ్పడిన మా చిన్నకుమారుడు చి ॥ పవననందనరాయలుకు శ్రీ వేణుగోపాలుడు ఆయురారోగ్యఐశ్వర్య విద్యాబుద్ధులను ప్రసాదించి సదా రక్షించుగాక.

ఈ గ్రంథమును అచిరకాలములో సొంపుగాముద్రించి యిచ్చిన గుంటూరు శ్రీ షిరిడీసాయిప్రింటర్స్ అధినేత శ్రీ **పి.వి. శివరావుగారి** కి, వారి సిబ్బందికి నా మెచ్చుకోలు.

ఇక ఈ గ్రంథము ఈ రూపములో వచ్చుటకు గ్రంథ స్ఖాలిత్యములను సవరించుటయే గాక ప్రూపులు దిద్ది తగినరీతిలో సకాలములలో పూర్తిచేయుటకు ప్రధానకారకులైన శ్రీ మొవ్వ వృషాద్రిపతిగారికి నేనుగా కృతజ్ఞతాంజలిగావింపపనిలేదు. ఎందుచేతననగా శ్రీ భాష్యకారసమాజము వారి కుటుంబపుసొత్తు. దానిని స్థాపించినది వారి తాతగారు. వృద్ధిపరచినది వారి తండ్రిగారు పిన తండ్రులు. చేపట్టి నడుపుచున్నది ప్రస్తుతము వారే. సభ్యులకోర్కెతీర్చుట వారివిధి. అయిననూ గ్రంథముముద్రణ బాధ్యతలు వహించుటకు నేను ముందుకు వచ్చినాను గనుక, నేనునూ భాష్యకార సమాజసభ్యుడనుగాన కోరిన వెంటనే ఆమోదమునుతెల్పి అంగీకరించి అత్యధిక శ్రమ కోర్చి భాగవతకోటి వెూదమునకు పాత్రులైన శ్రీ **వృషాద్రిపతి**గారికి నాశతసహస్రప్రణామములు.

**చివరికొక్కమాట**

**కర్తాకారయితాచైవ ప్రేరకశ్చానుమోదక ః**

**సుకృతేదుష్కృతేచైవ చత్వారస్సమభాగిన ః**

చేసినవారు - చేయించినవారు - ప్రేరేపించినవారు - ఆమోదించినవారు.

ఈ నల్గురూ సుకృతదుష్కృత్యములందు సమానభాగస్థులని పెద్దలు చెప్పుచున్నారు. కావున

ఈ గ్రంథమునందెల్లెడల ( ప్రతిపాదింపబడిన ) కీర్తింపబడిన శ్రీ సీతాలక్ష్మణ భరతశత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మమును శ్రీ రాజ్యలక్ష్మీ రుక్మిణీ సత్యభామాంజనేయాళ్వారుల సహిత శ్రీ సంతాన వేణుగోపాల పరబ్రహ్మమును అనంత గరుడ విష్వక్సేన శ్రీ వేంకటదాసస్వామి, శ్రీ శ్రీనివాసస్వామి,శ్రీ విష్ణుదాసస్వామి సహిత శ్రీ మద్రామానుజ దేశికేంద్రులు ఏకీభవించి ఈ విజ్ఞప్తియందు పేరుపేరున పేర్కొనిన సభ్యులను, వారి కుటుంబములను, శ్రీ భాష్యకారసమాజసభ్యులను లీలావిభూతియందు నిలిచినంత కాలమును ఆయురారోగ్య ఐశ్వర్యములతో వర్ధిల్లునట్లుగా అనుగ్రహించి శరీర పతనానంతరము తమ దివ్యసామీప్య సారూప్య సాయుజ్యములను గ్రహింప జగద్రక్షణ కారణ భూతులను వేడుకొనుచు సెలవు దీసుకొనుచున్నాడను.

నగరం ( గుంటూరు జిల్లా ) ఇట్లు

ఫాల్గుణ శుద్ధ దశమి విజ్ఞప్త భక్తపరమాణువు

పద్యాలగోపీచంద్రస్వామి

5-3-2001.

## శ్రీరామ

> యత్పాదాంభోరుహధ్యాన విధ్వస్తా శేషకల్మషః
> వస్తుతాముపయాతోహం వేంకటాఖ్యం నమామితమ్

ఈ విధంగా నస్మత్పితామహులు పరమాచార్యులు పరమహంస శ్రేష్ఠులగు వేంకటదాస మహర్షి నిధ్యానించి, విన్నవించుకొనుచున్న విషయము.

కర్మభూమియగు నీ భరతఖండంబునందెన్ని జాతులు సముద్భవించినవో, ఎన్ని మతములు తలనెత్తినవో ఊహకందదు. ఈ మతములు కొన్ని నిరీశ్వరములు. కొన్ని సేశ్వరములు,

సాంఖ్యము - యోగము - నైయాయికము - వైశేషికము మీమాంసాదిశాస్త్రములెన్నో ఉద్భవించినవి. సాంఖ్యము ద్విముఖ వ్యాప్తి చెందినవి. సేశ్వరసాంఖ్యము - నిరీశ్వరసాంఖ్యము

అద్వైత-విశిష్టాద్వైత-ద్వైతాదివైదికమతములు - దైవస్థితి నంగీకరించిన వానిలో ప్రధాన మతములు.

ప్రకృతి-జీవులు భ్రాంతిమూలకములనియు - ఒక్క ఈశ్వరతత్త్వమే సత్యమనియు-జ్ఞానమే పరమాత్మ గమ్యమాన మార్గమనియు అద్వైతము ప్రబోధించినది. 'అహంబ్రహ్మాస్మి' 'తత్త్వమసి' "అయమాత్మా బ్రహ్మ "ప్రజ్ఞానం బ్రహ్మ" 'సర్వంఖల్విదంబ్రహ్మ' వంటి మహావాక్యములతో అభివృద్ధి గాంచినది. తద్వ్యాప్తికి హేతుభూతులు భగవానాదిశంకరులు.

ప్రకృతి - జీవుడు - ఈశ్వరుడు మూడును సత్యములనియు జీవుడు ప్రతిశరీరభిన్నుడనియు, స్థూలావస్థయందు ఈ మూడుతత్త్వములు

భిన్నములైయుండుననియు - సూక్ష్మావస్థయందు ఈ మూడు తత్త్వము లేకీభవించి యుండుననియు విశిష్టాద్వైతముద్ఘోషించుచున్నది. జీవునకు ప్రకృతిశరీరము. ఈ రెండింటికాలత్మసర్వేశ్వరుడు. ఆతడే విష్ణువు. నారాయణుడు. "ఏకోహవైనారాయణ ఆసీత్ ". అని మహోపనిషత్తు ద్ఘాటించుచున్నది. భక్తిప్రపత్తులచే, ఈ జీవితానంతరము జీవుడు మోక్షమునుపొందును. దీనినధికవ్యాప్తికావించనినవారనంతావతారులు, భవగద్రామాను జయతీంద్రులు.

సృష్టి - స్థితి - లయ కార్యభారుడగుభగవంతుడు సంకర్షణ,ప్రద్యుమ్న. అనిరుద్ధ రూపములు మూడింటిపొందును. మొదటి దానియందు జ్ఞానమును - రెండవదానియందు, వీర్యైశ్వర్యములును, మూడవ దానియందు శక్తి తేజస్సులను, సర్వకాలములధరించును.

భగవంతుడేల అవతారములెత్తవలె ? అనుప్రశ్నయుదయించును. పేడకుప్పలోలద్దెపురుగులవలె సృష్ట్యాదియందు సకలజీవరాసులు భ్రమించుటను చూచి, కారుణ్యస్వరూపిణియు, పురుషకార భూతురాలగు లక్ష్మీదేవి, వేదనచెంది, జీవులకు కరకళేబరాదుల నిచ్చి యుద్ధరింప వలసినదిగా నారాయణునర్థించెను. సంకల్పసిద్ధికాలేదు. కావున నామెయే స్వయముగా భూలోకమునకు రాతలంచినది. వైకుంఠద్వారపాలకులగు జయవిజయులను - హిరణ్యాక్ష - హిరణ్యకశిపులుగా- రావణ కుంభకర్ణులుగా - శిశుపాలదంతవక్త్రులుగాపుట్టించి, లక్ష్మీదేవితానుగా భూలోకమున నవతరించి, యాదుష్టులు కావించుచున్న మహాక్రూరకృత్యములనుసహింపలేక,నారాయణుడే రామకృష్ణా ద్యవతారములతో భూతలమునకు విచ్చేసి వారిని సంహరించునట్లు కావించినది. భక్తులను కాపాడినది. దుర్మార్గులచే సజ్జనులెట్లు బాధింపబడుచున్నారో ప్రత్యక్షముగా చూపించినది.

అదే భగవద్గీతయందు శ్రీ కృష్ణస్వామి " జన్మకర్మచమేదివ్యం " అనిచాటినారు. కావుననే, అవతారములయందుచేసినక్రీడలను కార్యములనుకవులు మనోహరముగా గానముకావించినారు. వానినిచదివినవారుముక్తి సామ్రాజ్యార్హమంది చాటించిరి, శంకరుడు పార్వతీదేవితో శ్రీకృష్ణునిబాల్యక్రీడలలోని రాసక్రీడలను గూర్చి

"అహంవేత్తి - శుకోవేత్తి - వ్యాసోవానవా " వచించెను.

ఈ క్రీడలనే పరమహంస - మహర్షి శ్రీ వేంకటదాసస్వామివారు విశిష్టాద్వైతమతమును గ్రహించి, శ్రీ భాష్యకారసమాజమునుస్థాపించి, రామకృష్ణాద్యవతారములయందు భగవంతుడొనరించిన దివ్యకర్మములను కీర్తనలరూపమున రచించి " భాగవతసురభూజ"మను పేరుతో ప్రచురించిరి. కీర్తనలతోపాటు - మేలుకొలుపులు - ఏలలు - మంగళహారతులు - భజనలుచేర్చిరి. భగవంతుని ప్రత్యవయవమును, వాని భాగములును పూజనీయములేఅనిచాటించుటకు " గోరుల గోరిభజింతున్ " వంటికీర్తనలు రచించిరి. రామావతారకాలమున, పక్షులు - మృగములు, తుదకు వృక్షములు సైతము ఆయనకు పరిచర్యలొనరించినట్లు ముగ్ధ మనోహర రసతుందిలములుగా రచించిరి.

తదనంతరము, తర్కవేదాంతపండితులు, అస్మత్పితృ పాదులు శ్రీ పరమహంస శ్రీ శ్రీనివాస పెరుమాళ్ళుగారును, తర్కవేదాంత భాష్యభగవద్విషయ గండూషిత మొనరించిన అస్మపితృవ్యులు కవిభట్టారక దాశరధిసూరిగారును ఆ మార్గమును సువిశాలసుసంపన్నముగావించి సులభశైలిలో భాగవత హృదయకేదారములో భక్తిసస్యములను పెంపొందిపజేసిరి.

మా అగ్రజులు, పరమహంస మహర్షి వేంకటదాసస్వామి వారి ప్రథమ పౌత్రుడును, 'సాహితీవాచస్పతి' ఉపన్యాసచతురాన' నాది బిరుదవిరాజితులునగు, శ్రీమాన్ మొవ్వవృషాద్రిపతిగారు, నన్ను గుంటూరునకు తీసికొనిపోయి, రామనామక్షేత్రమున, ఆనాటి C.E.O శ్రీ వేంకటేశ్వరరావుగారు, అసిస్టెంటు కలెక్టర్లవారి సమక్షమున, వేలకొలది ప్రేక్షకులు పరమానందపరవశులగునట్లు, మాపితామహులకీర్తనల నాలపింపచేసిరి దానిని సిటీకేబుల్ వారు మూడుసారులు పౌరుల కోరికమేరకు ప్రసారముకావించిరట.

భాగవతసురభూజముప్రతులు చెల్లిపోయినవి. ఎందరో అప్రతులు కావలెనని అడుగుచున్నారు. అపుడు మామేనత్తగారి జ్యేష్ఠపుత్రులు – స్వామివారి దౌహిత్రులు – నగరం కళాశాల ఆంధ్రోపన్యాసకులు, చి॥గోపీచంద్రస్వామి మనమిద్దరమునుకలిసి యీగ్రంథరాజమును ప్రకటింతుము" అని కోరినాడు. ఆనందించి అంగీకరించితిని. ఇని యా పరమహంస అభీష్టము. ఈ విధముగా నెరవేరినది.

మహర్షి కీర్తనలను మరల ప్రకటించుటకు, మాకవకాశము కలిగినందులకు, మాజన్మములు ధన్యములగా భావించుకొనుచు మాకుటుంబములను సర్వేశ్వరుడు – పరమాచార్యులు వేంకటదాసస్వామి నిరంతరము రక్షింతురుగాతమని వేడుకొనుచుంటిని.

పరమహంసపౌత్రుడు

శ్రీకృష్ణదాసనుమొవ్వకృష్ణప్రసాదు.





# ఉలుపా

సాహితీవాచస్పతి
మొవ్వ వృషాద్రిపతి
రేపల్లె

భక్తి ప్రపత్తులు పడసిన రూపమో ?
పాండిత్యరమయె రూపంబుగొనెనో?
కవితా సరస్వతి యవతార మందెనో?
జపతపో విభవ మీ వపువుగొనెనొ?
ఆచార్య కత్వమీయవతార మొందెనో?
ధర్మదేవత యిట్టి తనువుగొనెనొ?
ఆధ్యాత్మికత్వమీ యాకృతి నెనసెనో?
జ్ఞానమే యీయపఘనముగొనెనొ?
మహిత వైష్ణవ సిద్ధాంత మహిమ యిట్లు
పూరుషాకృతిగొనెనొ? నా పుడమి వెలసె
నలరు వేంకటదాసమహర్షి వరుడు
మొవ్వ కులవారి నిధి చంద్రముండువోలె 1

పూడివాడ గ్రామ పుణ్యమెట్టిదొ? పూర్ణ
పురుషుడును మహర్షి వరుడునైన
వేంకటార్యుచరణ పంకజ మృదురజో
వితతి చే పవిత్ర వినుతమయ్యె. 2

వేదమొ? ధర్మశాస్త్రమొ? కవిత్వమొ ? తత్త్వమొ? సత్కళానుస
మ్మోదమొ వీరి గ్రంథముల పొల్చు పదార్థ మటంచు విజ్ఞులున్
గాదిలి సిద్ధపూరుషుడొ? జ్ఞానియొ? భక్తుడొ? పూర్ణతత్త్వ సం
వేదియొ? పండితుండొ? సుకవి ప్రభుడో? యితడంచునెంచగన్ 3

జ్ఞాననిధానముల్ ప్రణుత సత్య నిరూపణముల్ ప్రమాణతా
స్థానములున్ విశిష్ట మృదుసత్త్వమయంబులు నైన గ్రంథసం
తానము నిత్యనూత్నరసధామ మనోజ్ఞములైన కావ్యముల్
జాను తెనుంగు నందు శత సంఖ్య రచించె జగత్తు మెచ్చగన్ 4

జ్ఞానసూర్యోదయ గ్రంథంబు వైష్ణవ
సిద్ధాంతలక్ష్మికి శీర్షమణిగ
పొలుపారు వరవరముని హృతయమ్ము నా
ధ్యాత్మిక తత్త్వసుధాశనముగ
తమి గోపికా విలాసము పరమేశ్వర
జీవసంబంధ సుస్థితిరహింప
వర సీతరామప్రభావము నవవిధ
భక్తితత్త్వ వివేకబంధురముగ
పొరిది లక్ష్మీసహస్రమ్ము సూక్ష్మమైన
ధర్మమర్మరహస్య తాత్పర్యమనగ
అఖిలభారత రామాయణాదివిషయ
మెల్ల హరికథా వాఙ్మయ వృద్ధి నెనసె 5

భాగవతసురభూజము నైగమాప్తి
భాష్యకార సమాజ సభ్యప్రపంచ
మునకు కరదీపికగను, ముముక్షువులకు
కొంగుబంగరుగను యశఃకోశమయ్యె

6

ఆప్రతులెల్ల చెల్లినను అందలి కీర్తన లెల్ల నాల్కలం
దప్రతి మానవృత్యముల నాడ, జనంబులు భక్తియుక్తి దీ
క్షా ప్రవణాతులై యడుగ సాగిరి దానిని, ముద్రణక్రియా
క్షి ప్రత నెన్ని యత్నములు చేసిన సాగదు నేటిదా కొగిన్ 7

పాత్రత వేంకటమౌనికి
పౌత్రుడు దౌహిత్రుడున్ విభాసురమతులై
మైత్రిని ఈ గ్రంథంబును
ధాత్రింబ్రచురింప దీక్ష దాల్చిరి తృప్తిన్ 8

రాధాంబా సతి ధర్మపత్ని సతమారాధింప శ్రీ వైష్ణవ
ప్రాధాన్యంబు ధరిత్రి నాల్గుచెఱగుల్ వ్యాపింపగా జేవి శ్రీ
ష్యాధారుండయి మోక్షరాజ్య పదవీ వ్యాసక్తులన్ సల్పెజ్ఞా
నాథానుండగు వేంకటాఖ్యముని, తద్వాసంగులీ యిద్దరున్ 9

సరస పౌరాణిక శ్రేష్ఠ బిరుదశాలి
స్వచ్ఛచరితుండు మొవ్వ కృష్ణప్రసాదు
సాహితీలోక సంచార సారకీర్తి
సౌమ్యగుణుడు గోపీచంద్రసామి ఘనుడు 10

వీరల నిద్దఱున్ ఘనుడు వేంకటదాస మహర్షినిత్య సం
సారసుఖంబులిచ్చి కడుసంపదలిచ్చి యనన్యసాధ్యవి
స్తార యశస్సునిచ్చి వితతంపు చిరాయువు నిచ్చి ప్రోచుతన్
సారసుధాప్రసారఘనసార పటీర కృపాభిషేకతన్ 11



**శ్రీమతే రామానుజాయ నమః**

**శ్రీ సీతాలక్ష్మణభరత శత్రుఘ్నహనుమత్సమేత**

**శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః**

**శ్రీ మద్భాష్యకారసమాజ సభ్యజనపరంపరాభ్యుదయము.**

**ఏతత్సమాజనిర్వాహకదక్షులు**

1 సంఘాధ్యక్షుడు : శ్రీరామానుజయోగి

2 బ్రహ్మానందప్రదాయకి : శ్రీ గోదాదేవి

3 జ్ఞానభక్తి ప్రదాత : శ్రీ వరవరముని<br>శ్రీ నమ్మాళ్వారు.

4 సాంప్రదాయార్థరహస్య ప్రదాయకుడు : శ్రీ వరవరముని

5 భూతప్రేతాదిసర్వభయ నివారకుండు : శ్రీ మదాంజనేయస్వామి

6 బ్రహ్మవిద్యాదాయకుండు : అనంతాళ్వారు

7 సర్వవిషభయనివారకుండు : గరుడాళ్వారు

8 సర్వవిఘ్నవిచ్ఛేదకుండు : సేనమొదలియారు

9 సర్వరోగశత్రువిచ్ఛేదనదక్షుండు : సుదర్శన భగవానులు

10 సర్వకిల్బిషనాశకుండు : పాంచజన్యస్వామి

11 దేవతాంతరసేవానిరసనోపాయము : నందకాదిదివ్యాయుధ త్రయము

12 సమస్తదుర్దశానిర్మూలిని : శ్రీ మహాలక్ష్మి

13 సమస్తాపరాధనివారిణి : భూదేవి

14 సమస్తానుగ్రహకారిణి : నీళాదేవి

15 చతుర్విధపురుషార్ధప్రదాయకుడు,
సర్వనిర్వాహకుఁడు : శ్రీమన్నారాయణుఁడు

16 సమాజస్థాపకులు : మహర్షి శ్రీవేంకటదాసస్వామి

17 స్థాపించినప్రదేశము : పూడివాడ గ్రామము
నగరం(మండలం)
రేపల్లె తాలూక,
గుంటూరు (జిల్లా) ఆంధ్రప్రదేశ్.

18. స్థాపించిన కాలము : 24-04-1931 సం ॥

## ఏతత్సమాజనియమములు

అనఁగా నీసమాజమునఁజేరువారు ఆచరింపవలసిన పద్ధతులు

1. అసత్యము పలుకరాదు
2. కల్లు c ద్రాగరాదు
3. జూదమాడరాదు
4. చీట్లపేక మొదలగు చెడుపనులచే కాలయాపన మొనర్పరాదు
5. జారచోరత్వములు పూర్తిగా మానవలయును.
6. సోమరితనముకూడదు
7. పరుషాలాపములుసదావర్జింపవలెను.
8. ప్రతిదినముచలినీళ్లచే స్నానముజేయవలయును.
9. నిర్మలవస్త్రములు ధరింపవలెను.
10. ఊర్ధ్వపుండ్రమును ధరింపవలెను.
11. దుస్సాంగత్యము c బరిత్యజింపవలెను.
12. పొగచుట్టలు బీడీలు మొదలైనవికాల్చరాదు.

13. క్రాపింగు సంబంధమైన జుట్టులు పనికిరావు.
14. బోడితలతోనుండరాదు
15. జుట్టు శాస్త్రసమ్మతముగా నుంపవలయును.
16. ఇతర దేవతారాధనములు తత్సంబంధమంత్రములు అవశ్య వర్జనీయములు
17. అసూయా పరులై తనపై యుద్ధమునకు వచ్చు వారిని దక్క తక్కిన బ్రాహ్మణులను తిరస్కరింపరాదు.
18. భక్తిహీనులు సంసారబద్ధులగు వారితో సరస సల్లాపములు వర్జించి యుదాసీనుఁడై తొలగవలయును.
19. సామాది వేదములును, మన్వాది స్మృతులును రామాయణాది ఇతిహాసములును, భాగవతాది పురాణములును అత్యంత ప్రమాణములుగా శిరసావహించవలెను.
20. శ్రీ భగవద్గీతాశాస్త్రమును శ్రీమద్రామాయణమును ముఖ్య నిధానములుగానెంచవలెను.
21. గురువునుమించినరక్షకుఁడు లేడని తలంపవలెను.
22. ఆచార్యుని దోషంబులెన్నరాదు. గుణంబులు కొనియాడవలయును.
23. మనోవాక్కాయ కర్మలచే గురునికపచారము సేయరాదు.
24. మత విరుద్ధములైనవాక్యంబులే గ్రంధంబుననున్నను నిరాకరింపవలెను.
25. హరిదాసులను జాతివిమర్శచేయరాదు.
26. భగవద్భక్తులేజాతివారైనను వారిని గౌరవించి పూజింపవలెను.
27. విష్ణుభక్తిలేని వారెంత గొప్పవారైనను వారిని ఆదరింపఁబనిలేదు.



28. విష్ణుమంత్రంబులన్నియును పాదేయంబులుగా నెంచవలెను.
29. చిత్రమునందైనను, గృహమునందైనను, దేవాలయము నందైనను విష్ణ్వాకారము cజూచిన తోడనే నమస్కరింపవలెను.
30. పర,వ్యూహ,విభవ, అంతర్యామిత్వ, అర్చావతారాది యైదు విధంబులగు భగవద్రూపంబులు ధ్యానింపవలెను.
31. దినమున కైదు వేలచొప్పున రామమంత్రంబును జపించవలయును.
32. త్రికరణంబులచే రాముని సర్వరక్షకునిగా నెన్నవలెను.
33. భోగమోక్షప్రదాత శ్రీ మన్నారాయణుడేయని తలంచవలెను.
34. సర్వకాలములయందును సర్వదేశములయందును శ్రియః పతియగు నారాయణుడు దక్క తనకు వేఱుగతిలేదని యెంచవలెను.
35. ఏతత్సమాజమున కధ్యక్షుండగు రామానుజయోగీంద్రు నత్యంతభక్తితో సేవింపవలెను.
36. శ్రీ మహాలక్ష్మి ని సర్వాపరాధ క్షమాపణమునకై ధ్యానింపవలెను.
37. మాంసాహారము వర్జింపవలెను.
38. మాంసాహారమనగా పంది, మేక, గొఱ్ఱె, కోడి మొదలగు జంతువుల యొక్కయు, ఎండ్రకాయలు, పచ్చిచేపలు, ఎండుచేపలు, రొయ్యపప్పు, పక్షుల గ్రుడ్లు, పక్షుల మాంసము, పుట్టగొడుగులు మొదలైనవి భక్షింపరాదు.
39. భగవదవతార రహస్య మెఱుంగక దూషించునట్టి దుష్టులతో సాంగత్య సల్లావములుచేయరాదు. అట్టిదుష్టులకు భోజనపానాదులొసంగరాదు.

40. భగవద్వేషులగు వారు తల్లిదండ్రి మొదలగు దేహ సంబంధులెవ్వరైనను వారి సంబంధము పరిత్యజింపవలెను. మీసములుంచరాదు.
41. ఈర్ష్యాద్వేషములు దంభాహంకారములువర్జింపవలెను.
42. దేహాభిమానలోకాభిమానములనువీడవలెను.
43. భగవద్భాగవత ఆచార్య కైంకర్యముల యందు న్యాయార్జితమైన తన ధనమును యథాశక్తిగా వినియోగించవలెను.
44. ఆచార్యగురు పరంపరాను సంధానముతో వేకువను మేల్కొనవలయును.
45. (ఇట్టి కట్టుబాట్లు స్త్రీ – పురుష వివక్షతో కలిగిన కొన్ని విషయము లందు తప్ప తక్కిన అన్నింటియందును ఇరువురు సమయముగా పాటించవలెను)

**ఏతత్సమాజంబున బ్రవేశించునపుడు సభ్యుడు సభ్యురాలు చేయవలసిన ప్రమాణంబులు.**

1. ఈ దినము నుండి యీ సమాజంబున బుద్ధిపూర్వకముగా బ్రవేశించినాను.
2. సమాజ నియమములన్నియు c జదువుకొన్నాను (లేక)విన్నాను.
3. సమాజ వ్యతిరిక్తములైన దుష్కార్యములెన్నటికిజేయను.
4. కేవల మోక్షాపేక్ష చేతనే యీ సమాజమున బ్రవేశించితిని, కాని యన్యోద్దేశ్యంబున cగాదు.
5. సమాజమునకపకీర్తికరములైన కార్యములొనర్చితినే నియే తత్సంఘమువారు విధించు దండనమునకు బాధ్యుడనై యుందును. కాని దీనికి వ్యతిరిక్తముగానడువను.



6. సమాజము వారి మీద యేవిధమైన నేరమును దొరతనము వారికిగాని మఱియే విధమైన లౌకికాధికారులకు గాని ఫిర్యాదు చేయు వాడనుగాను, అట్లుచేసినను చెల్లగూడదు.
7. దినదినము నిద్రాహారములతో పాటు తప్పక భగవద్ధ్యానము చేయుదును.
8. మనోవాక్కాయ కర్మంబులచే నసత్యమునాచరింపను.
9. ఇతరమతములవారితో సాంగత్యసల్లాపంబులజేయను.
10. సమాజవిరుద్ధంబులైన గ్రంథంబులేవియుజదువను వినను.
11. లక్ష్మీనారాయణులే తలిదండ్రులు గాదద్భక్తులే ఆత్మబంధువులుగా దలంతును.
12. లోకములో గల అన్నిపదార్థముల కంటె భగవంతు నెక్కువగా బ్రేమింతును.
13. సమాజము వారెచ్చట సమావేశమగుదురో అచ్చటికి సొంత ఖర్చులతో రాగలను.
14. దినమునకు వేయింటికి తక్కువ లేకుండ రామమంత్రము జేయుదురు.
15. నెలనెలకు జపము హెచ్చించుచుందును. ఇందుకు నాకు సర్వవిధములా ఆమోదము

xxxxx

సంతకము

శ్రీరామ

## శ్రీరామానుజాష్టోత్తర శతనామస్తోత్రము

శ్రీ రామానుజః పుష్కరాక్షో, యతీంద్ర ః కరుణాకర ః
కాంతిమత్యాత్మజః శ్రీమాన్, లీలామానుషవిగ్రహః 1

సర్వశాస్త్రార్థతత్వజ్ఞః సర్వజ్ఞః సజ్జన ప్రియః
నారాయణకృపాపాత్రః శ్రీ భూతపురనాయకః 2

అనఘో భక్త మందారః కేశవానందవర్ధనః
కాంచీపూర్ణప్రియసఖః ప్రణతార్తివినాశనః 3

పుణ్యసంకీర్తనఃపుణ్యో ; బ్రహ్మరాక్షసమోచకః
యాదవాపాదితాపార్థ వృక్షచ్ఛేదకుఠారకః 4

అనఘో లక్ష్మణ మునిః శారదా శోకనాశకః
నిరంతరజనాజ్ఞాననిర్మోచన విచక్షణ ః 5

వేదాంతద్వయసారజ్ఞో, వరదాంబుప్రదాయకః
పరాభిప్రాయ తత్త్వజ్ఞోయామునాంగుళిమోచకః 6

దేవరాజకృపాలబ్ధ ; షడ్వాక్యార్థమహోదధిః
పూర్ణార్యలబ్ధ సన్మిత్రః శౌరిపాదాబ్జషట్పదః 7

త్రిదండధారీ బ్రహ్మజ్ఞోబ్రహ్మధ్యానపరాయణః
రంగే శకైంకర్యరతోవిభూతిద్వయనాయకః 8

గోష్ఠీపూర్ణకృపాలబ్ధ మంత్రరాజ ప్రకాశకః
వరరంగానుకంపాత్త ద్రావిడామ్నాయపారగః 9

మాలాధరార్యసుజ్ఞాత, ద్రావిడామ్నాయతత్త్వధీః
చతుస్సప్తతి శిష్యాఢ్యః పంచాచార్యపదాశ్రయః 10

ప్రపీతవిషతీర్థాంభః, ప్రకటీకృతవైభవ :
ప్రణతార్తిహరాచార్య ; దత్తభిక్షైకభోజన : 11

పవిత్రీకృత కూరేశో భాగినేయత్రిదండక :
కూరేశదాశరధ్యాది, చరమార్థప్రదాయక : 12

రంగేశ వేంకటేశాది ప్రకటీకృతవైభవ :
దేవరాజార్చనరతో మూకముక్తి ప్రదాయక : 13

యజ్ఞమూర్తి ప్రతిష్ఠాతామన్నాథోధరణీధర :
యజ్ఞేశార్తి వినాశక :వరదాచార్య తత్త్వజ్ఞో 14

అనంతాభీష్టఫలదో విఠలేంద్రప్రపూజిత :
శ్రీశైలపూర్ణకరుణాలబ్ధరామాయణార్థకః 15

వ్యాససూత్రార్థతత్త్వజ్ఞోబోధాయనమతానుగ :
శ్రీ భాష్యాదిమహాగ్రంధ, సాధక : కలినాశన : 16

అద్వైతమతవిచ్ఛేత్తా విశిష్టాద్వైతపారగ :
కురంగనగరీపూర్ణమంత్రరత్నోపదేశిక : 17

వినాశితాఖిలమతశ్శేషీకృతరమాపతి :
పుత్రీకృత శఠారాతిశ్శఠజిద్రుణ మోచక : 18

భాషాదత్తహయగ్రీవో, భాష్యకారోమహాయశ ః
పవిత్రీకృతభూభాగ ః ; కూర్మనాథప్రకాశక ః 19

శ్రీ వేంకటాచలాధీశ, శంఖచక్రప్రదాయక ః
శ్రీ వేంకటేశశ్వశుర శ్రీరమాసఖదేశిక ః 20

కృపామాత్ర ప్రసన్నార్యో గోపికామోక్షదాయక ః
సమీచీనార్య సచ్ఛిష్య సత్కృతో వైష్ణవప్రియ ః 21

క్రిమికంఠనృపధ్వంసీ ; సర్వమంత్రమహోదధి ః
అంగీకృతాంధ్ర పూర్ణార్య ; సాలగ్రామప్రతిష్ఠిత ః 22

శ్రీ భక్తగ్రామ పూర్ణేశో విష్ణువర్ధన రక్షక ః
బౌద్ధ ధ్వాంతసహస్రాంశు, శ్శేషరూప ప్రదర్శక ః 23

నగరీకృతవేదాద్రి ఢిల్లీశ్వరసమర్చిత ః
నారాయణప్రతిష్ఠాతా,సంపత్పుత్ర విమోచక ః 24

సంపత్కు మారజనకస్సాధులోక శిఖామణి ః
సుప్రతిష్ఠితగోవింద, రాజపూర్ణమనోరథ ః 25

గోదాగ్రజోదిగ్విజేతా గోదాభీష్టప్రపూరకః
సర్వసంశయ విచ్ఛేత్తా విష్ణులోకప్రదాయకః 26

అవ్యాహతమహద్వర్త్మా యతిరాజోజగద్గురు ః
ఏవంరామానుజార్యస్యనామ్నామష్టోత్తరంశతం 27

యః పఠేచ్ఛృణు యాద్వాపి ; సర్వాన్ కామానవాప్నుయాత్
యథాంధ్రపూర్ణేన మహాత్మనేదం ;
స్తోత్రం కృతంసర్వజనావనాయ
తజ్జీవభూతంభువివైష్ణవానాం
బభూవ రామానుజమానసానామ్.

అస్మద్గురుభ్యోనమః

## శ్రీ రామానుజాష్టోత్తరశతనామావళి :

1. ఓం శ్రీ రామానుజాయనమ :
2. ఓం పుష్కరాక్షాయ నమ :
3. ఓం యతీంద్రాయ నమ :
4. ఓం కరుణాకరాయ నమ :
5. ఓం కాన్తిమత్యాత్మజాయ నమ :
6. ఓం శ్రీమతే నమ :
7. ఓం లీలామానుషవిగ్రహాయ నమ :
8. ఓం సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞాయ నమ :
9. ఓం సర్వజ్ఞాయ నమ :
10. ఓం సజ్జనప్రియాయ నమ :
11. ఓం నారాయణ కృపాపాత్రాయ నమ :
12. ఓం శ్రీ భూత పురనాయకాయ నమ :
13. ఓం అనఘాయ నమ :

14. ఓం భక్తమన్దారాయ నమః
15. ఓం కేశవానస్దపర్ధనాయ నమః
16. ఓం కాంచీపూర్ణ ప్రియసఖాయ నమః
17. ఓం ప్రణతార్తి వినాశకాయ నమః
18. ఓం పుణ్య సంకీర్తనాయ నమః
19. ఓం పుణ్యాయ నమః
20. ఓం బ్రహ్మరాక్షస మోచకాయ నమః
21. ఓం యాదవాపాదితాపార్థ వృక్షచ్ఛేదకుతారకాయ నమః
22. ఓం అమోఘాయ నమః
23. ఓం లక్ష్మణమునయే నమః
24. ఓం శారదాశోకనాశకాయ నమః
25. ఓం నిరంతర జనాజ్ఞాన నిర్మోచన విచక్షణాయ నమః
26. ఓం వేదాంతద్వయ సారజ్ఞాయ నమః
27. ఓం వరదా యాంబు దాయకాయ నమః
28. ఓం పరేంగి తజ్ఞాయ నమః
29. ఓం నీతిజ్ఞాయ నమః
30. ఓం యామునాంగులిమోచకాయ నమః
31. ఓం దేవరాజ కృపాలబ్ధషడ్వాక్యార్థ మహోదధయే
32. ఓం పూర్ణార్యలబ్ధసన్మంత్రాయ నమః
33. ఓం శౌరిపాదాబ్జషట్పదాయ నమః

34. ఓం త్రిదండ ధారిణే నమః

35. ఓం బ్రహ్మజ్ఞాయ నమః

36. ఓం బ్రహ్మధ్యాన పరాయణాయ నమః

37. ఓం రంగేశకైంకర్యరతాయ నమః

38. ఓం విభూతిద్వయనాయకాయ నమః

39. ఓం గోష్ఠీపూర్ణ కృపాలబ్ధమన్త్రరాజ ప్రకాశకాయ నమః

40. ఓం వరరంగానుకంపాత్తద్రావిడామ్నాయపారగాయ నమః

41. ఓం మాలాధరార్యసుజ్ఞాతద్రావిడామ్నాయతత్త్వధియే నమః

42. ఓం చతుస్సప్తతి శిష్యాద్యాయ నమః

43. ఓం పంచాచార్యసమాశ్రయాయ నమః

44. ఓం ప్రపీతవిషతీర్థాంభః ప్రకటీకృతవైభవాయ నమః

45. ఓం ప్రణతార్తిహరాచార్య దత్తభిక్షైకభోజనాయ నమః

46. ఓం పవిత్రీకృతకూరేశాయ నమః

47. ఓం భాగినేయత్రిదండకాయ నమః

48. ఓం కూరేశదాశరథ్యాది చరమార్థప్రదాయకాయ నమః

49. ఓం రంగేశవేంకటేశాదిప్రకటీకృతవైభవాయ నమః

50. ఓం దేవరాజార్చనరతాయ నమః

51. ఓం మూకముక్తిప్రదాయకాయ నమః

52. ఓం యజ్ఞమూర్తివినాశకాయ నమః

53. ఓం మన్నాథాయ నమః

54. ఓం ధరణీధరాయ నమః
55. ఓం వరదాచార్యసద్భక్తాయ నమః
56. ఓం యజ్ఞేశార్తి వినాశకాయ నమః
57. ఓం అనంతాభీష్ట ఫలదాయ నమః
58. ఓం విట్ఠలేంద్రప్రపూజితాయ నమః
59. ఓం శ్రీశైలపూర్ణకరుణాలబ్ధరామాయణార్థకాయ నమః
60. ఓం ప్రపత్తిధర్మైకరతాయ నమః
61. ఓం గోవిందార్యప్రియానుజాయ నమః
62. ఓం వ్యాససూత్రార్థతత్త్వజ్ఞాయ నమః
63. ఓం బోధాయనమతానుగాయ నమః
64. ఓం శ్రీ భాష్యాదిమహాగ్రంథకారకాయ నమః
65. ఓం కలినాశనాయ నమః
66. ఓం అద్వైతమతవిచ్ఛేత్రే నమః
67. ఓం విశిష్టాద్వైతపాలకాయ నమః
68. ఓం కురంగనగరీపూర్ణమంత్రరత్నోపదేశకాయ నమః
69. ఓం వినాశితాఖిలమతాయ నమః
70. ఓం శేషీకృతరమాపతయే నమః
71. ఓం పుత్రీకృతశఠారాతయే నమః
72. ఓం శఠజిద్ఋణమోచకాయ నమః
73. ఓం భాషాదత్త హయగ్రీవాయ నమః

74. ఓం భాష్యకారాయ నమః
75. ఓం మహాయశసే నమః
76. ఓం పవిత్రీకృత భూభాగాయ నమః
77. ఓం కూర్మనాథప్రకాశకాయ నమః
78. ఓం శ్రీ వేంకటాచలాధీశ శంఖచక్రప్రదాయకాయ నమః
79. ఓం శ్రీ వేంకటేశ్వరశ్వశురాయ నమః
80. ఓం శ్రీ రమాసఖదేశికాయ నమః
81. ఓం కృపామాత్రప్రసన్నార్యాయ నమః
82. ఓం గోపికామోక్షదాయకాయ నమః
83. ఓం సమీచీనార్యసచ్ఛిష్యసత్కృతాయ నమః
84. ఓం వైష్ణవప్రియాయాయ నమః
85. ఓం క్రిమికంఠనృపధ్వంసినే నమః
86. ఓం సర్వమంత్రమహోదధయే నమః
87. ఓం అంగీకృతాంధ్రపూర్ణాఖ్యాయ నమః
88. ఓం సాలగ్రామప్రతిష్ఠితాయ నమః
89. ఓం భక్తగ్రామపూర్ణేశాయ నమః
90. ఓం విష్ణువర్ధనరక్షకాయ నమః
91. ఓం బౌద్ధధ్వాంతసహస్రాంశవే నమః
92. ఓం శేషరూపప్రదర్శకాయ నమః

93. ఓం నగరీకృత వేదాద్రయే నమః
94. ఓం ఢిల్లీశ్వరసమర్చితాయ నమః
95. ఓం నారాయణప్రతిష్ఠాత్రే నమః
96. ఓం సంపత్పుత్ర విమోచకాయ నమః
97. ఓం సంపత్కుమారజనకాయ నమః
98. ఓం సాధులోక శిఖామణయే నమః
99. ఓం సుప్రతిష్ఠిత గోవిందరాజాయ నమః
100. ఓం పూర్ణమనోరథాయ నమః
101. ఓం గోదాగ్రజాయ నమః
102. ఓం దిగ్విజేత్రే నమః
103. ఓం గోదాభీష్టప్రపూరకాయ నమః
104. ఓం సర్వసంశయవిచ్ఛేత్రే నమః
105. ఓం విష్ణులోకప్రదాయకాయ నమః
106. ఓం అవ్యాహతమహద్వర్త్మనే నమః
107. ఓం యతిరాజాయ నమః
108. ఓం జగద్గురవే నమః

ఓం శ్రీమతే రామానుజాయ నమః
ఓం శ్రీవేంకటగురుభ్యోనమః



1. శ్రీమాన్ మొవ్వ శ్రీనివాస పెరుమాళ్ళుగారు ధర్మపత్ని శ్రీమతి బాలమ్మగారు.
2. శ్రీమాన్ మొవ్వ వేంకటాచలపతిగారు ధర్మపత్ని శ్రీమతి అమ్మన్నమ్మ గారు.
3. శ్రీమాన్ దాశరధిసూరిగారు ధర్మపత్ని శ్రీమతి సరోజాదేవి గారు
4. శ్రీమాన్ రామప్రసాదు గారు ధర్మపత్ని శ్రీమతి వెంకాయమ్మగారు
5. శ్రీమాన్ పద్యాల వెంకటేశ్వర్లు గారు ధర్మపత్ని శ్రీమతి రామబాణమ్మ గారు.
6. శ్రీమతి తన్నీరు కమలాదేవి గారు
7. చి॥ జగన్నాధరాణి (వెం. చ.ప్ర. పౌ.)

శ్రీమతే రామానుజాయనమః

శ్రీసీతా లక్ష్మణభరత శత్రుఘ్న హనుమత్సమేత శ్రీరామచంద్ర పరబ్రహ్మణేనమః

# భాగవతసుర భూజము

## ప్రథమ భాగము

శ్లో॥ శ్రీరామాహృదయేశ్వరం, ప్రవిమలానందాలయం కేశవం
పంకేజాసనవంది తాంఘ్రియుగళం, ఘోరాఘవిధ్వంసినం
వైకుంఠాధిపమంబు జాతనయనం శ్రేయఃప్రదం శ్రీహరిం
నీలాంభోధర సన్నిభామలతనుం వందేజగన్నాయకమ్ ॥

శ్లో॥ శ్రియంనీళాంధరాం దేవీం, విష్వక్సేనం ఖగేశ్వరమ్
పంచాయుధాన్యనంతంచ, వందేహం శ్రీహయాననమ్ ॥

### శ్రీభాష్యకారస్తుతి - జుల్వతాళము ౧

1 శ్రీభాష్యకార–చేతనోద్ధారా !
2 రామానుజార్యా ! – రమ్యగుణధుర్యా !
3 కాంతిమతిపుత్రా ! – కమనీయగాత్రా !
4 కేశవతనూజా ! – కీర్తివిభ్రాజ !
5 సరసగుణపూర్తి – సాధునుతకీర్తి
6 భూతపురవాసా – బుధజనోల్లాసా
7 శేషావతారా! – శ్రితజనాధారా !
8 వైష్ణవకులేంద్రా ! – వరసుగుణసాంద్రా
9 విబుధప్రధానా ! – విద్యానిధానా !

10 దుర్మతవినాశా ! – ద్యుమణిప్రకాశా !

11 వేదాంతనిర్ణయా ! – విధ్వస్తదుర్ణయా !

12 పాషండశోషణా ! – భక్తజనపోషణా !

13 సాధుజనపూజితా ! – సాధ్వీజనస్తుతా !

14 వైష్ణవోజ్జీవనా ! – వైదికమతావనా !

15 ఆస్తికశివంకరా ! – నాస్తికభయంకరా !

16 తిరుమణీ శ్రీ చూర్ణ – భరితాలికోదీర్ణ !

17 కాషాయచేలధర ! – కంజాక్షభక్తవర !

18 ఈషణ త్రయముఖా – శేషదోషవిముఖా !

19 వరదరాట్సేవకా ! – వరము క్తిదాయకా !

20 శ్రీరంగరాడ్డితా ! శీర్వాదవర్ధితా !

21 వేంకటాచలవరా ! – విష్టాశయోద్ధురా !

## ఆంజనేయస్తుతి - ఝల్వతాళము ౨

1 శ్రీరామదూతా ! – శ్రితపారిజాతా !

2 మారుతకుమారా ! – మేరునగధీరా !

3 దానవవినాశా ! – తరణిప్రకాశా !

4 లంకావిదారా ! – పంకాతిదూరా !

5 శ్రుతియుతమనీషా ! – సూరినుతవేషా !

6 వ్యాకృతినివేశా ! - వానరకులేశా !

7 పరమంత్రహారీ ! - పర్వతవిహారీ !

8 సాత్వికధ్యేయా ! - సంజీవిరాయా !

9 అక్షసమవర్తీ ! - అక్షయసుకీర్తీ !

10 అక్షీణగాత్రా ! - ఋక్షవరమిత్రా !

11 సంజీవిదాయకా ! - శైలచరనాయకా !

12 అంజనానందనా ! - యంభోధిలంఘనా !

13 రామసేవాస్పదా ! - రాజ్యభోగప్రదా !

14 సమరాతిభీషణా ! - సాధుజనపోషణా !

15 పాపినిర్వాసనా ! - భావికమలాసనా !

16 సన్ను తాఖిలసుధీ ! - శౌర్యసంపన్నిధీ !

17 విశ్వకవితాకరా ! - వేదాంతసాగరా !

18 సింహికామారణా ! - స్వీకృతమహాగుణా !

19 శుంభచ్ఛిఖరిధృతీ ! - శ్రుతిసమన్వితమతీ !

20 పరభీషణాకృతీ ! - బ్రహ్మచర్యోన్నతీ !

21 భవ్యతర భారతీ ! - దివ్యనుతమారుతీ !

22 కేసరిప్రియసుతా ! - కీర్తివిభ్రాజితా !

23 గ్రస్తరవిమండలా ! - కమ్రతరకుండలా !

24 ధూతకామోదయా ! – స్తుత్యపూతాశయా !

25 రామభక్త్యంబుధీ ! – రాజితకృపానిధీ !

## లక్ష్మీస్తుతి - చతురశ్రజాతి 3

1 శ్రీహరివిలాసినీ ! – సేవింతుజననీ !

2 భక్తజనస్వర్గవీ ! – పాలింపుభార్గవీ !

3 నీరజాతవాసినీ ! – నిఖిలలోక పావనీ !

4 పాలకుప్పకూతురా ! – నీపాదము లేకొల్చెదన్ !

5 లిబ్బిచానబ్రోవవే – లేములనెడబాపవే !

6 కలుములజవరాలవు – మముఁగన్న తల్లివేనీవు

7 తమ్మియింటిలేమరో – దాసులరక్షింపవే

8 ఇందిరావధూమణీ ! – యిడుములెల్లఁబాపవే

9 ధనములకు స్థానమై – తనరుదేవివీవెగా

10 ధాన్యములకు సౌఖ్యములకు – దల్లిప్రాపునీ వెగా

11 భూమిపుత్రి! హేయగాత్రి ! – బ్రోవవేనిన్వేడెదన్

12 రామురాణి! నీలవేణి ! – రక్షింపుసాధ్వీమణీ

13 రుక్మిణీవధూమణీ ! సరోజపాణిశ్రీమణీ !

14 సర్వలోకమోహినీ ! – సారసాక్షగేహినీ !

15 ఘోరపా పధ్వంసినీ – కూరిమితోఁబ్రోవుమా !

16 శ్రీకృష్ణసహధర్మిణీ ! – వ్యాకులములడంపుమా !

17 తల్లివీవేదైవమీవె ! – ధనమునీవెభార్గవీ !

18 దిక్కునీ వెరొక్కమీవె - పెక్కునీవె శ్రీమణీ !

19 దేశమీ వెకాలమీవె - తెలివి నీవెయిందిరా !

20 అన్నమీవెపున్నెమీవె - యా స్తినీవెజానకీ !

21 బంధువీ వెగురువునీవె - పరమునీవెరుక్మిణీ !

22 జనకవంశపావనీ! - జయముమాకొసంగవే !

23 శ్రీరంగ నాయకీ! నీ - శ్రీపాదములెకొల్చెదన్

24 విరించనునితల్లివై - వెలయుదేవివీవెగా

25 వేదములునీపాదముల - వినుతిఁజేయఁజాలవు

26 బ్రహ్మరుద్రేంద్రాదులునిను - బ్రస్తుతింపఁజాలరు

27 ఆదివిష్ణువక్షమే - నీకాలయంబుతల్లిరో

28 నీదయా ప్తిఁగన్న వాని - కే దిగుళ్లులేవుగా

29 రావణునిఁజంపించినట్లు - రాగాదులడఁగింపవే

30 అసురాంగనలఁబ్రోచినట్టు - లపరాధములెడఁబాపవే

31 ఆంజనేయునిఁగాచినట్టు - లంబ! మమ్ముబ్రోవవే

32 వానరకాంతలనేలినట్లు - దీనత్వమెడఁబాపవే

33 క్షీరవార్ధినుండినట్లు - చిత్తమునవసింపవే

34 శ్రీరంగము వెలయించినట్లు - దారిద్ర్యము లెడఁబాపవే

35 బీద బాపనిఁబ్రోచినట్లు - ఖేదములడగింపవే

36 లక్కుమానుమీదిదయ - లాభముమాకీయవే

37 కుశలవులయందుఁగల - కూర్మితోరక్షింపవే

38 దండకామునులందుఁగల - దయతోడబాలింపవే

39 కాకాసురునిఁగాఁచినట్టి - కారుణ్యమునఁబ్రోవుమా

40 శ్రీకాంత! శ్రీరుక్మి - ణీ కాంత ! ప్రోవవే

41 శ్రీజానకీదేవి! - పూజలంగొనుభార్గవీ !

## విష్ణుస్తుతి - త్రిశ్రజాతి ౪

1 శ్రీరామచంద్రా ! - స్థిరయశస్సాంద్రా !

2 జయజయరామా ! - జానకీరామా !

3 సాకేతరామా ! - సత్త్వగుణధామా !

4 దశరథకుమారా ! - దానవవిదారా !

5 నిర్జరశరణ్యా ! - నిరుపమసుపుణ్యా !

6 కాకుత్థ్స రామా ! - కల్యాణరామా !

7 భద్రాచలేశా ! -పాతకవినాశా !

8 సంసృతినివారా ! - సజ్జనధారా !

9 మేరునగధీరా ! - మేచకశరీరా !

10 సీతాసమేతా ! - శ్రితపారిజాతా !

11 సత్యాహృదీశా ! - సవితృప్రకాశా !

12 మణిమయవిభూషా ! - మంజుతరవేషా !

13 కాంచనదుకూలా ! - కరుణాలవాలా !

14 రుక్మిణీకాంతా - రుచిరగుణవంతా !

15 జాంబవత్తనుజా – శస్తపదవనజా !

16 రాధికోల్లాసా ! –రమ్యతరహాసా !

17 లక్షణాయోషా – లాలితవిశేషా !

18 భద్రాకళత్రా ! – పావనచరిత్రా !

19 శ్రీమిత్రవిందా –శ్రితపదరవిందా !

20 దినరాజతనయా – ధీనసద్ధృదయా !

21 శ్రీనగ్న జిత్సుతా – శీలాభినందితా !

22 గోపికాజారా ! – తాపసాధారా !

23 రూపజితమారా ! –కాపథవిదూరా !

24 దేవకీపుత్రా ! – దితిపుత్రజైత్రా !

25 కంససంహారా ! – కల్మషనివారా !

26 పావనశరీరా ! –భక్తమందారా !

27 నరకాసురారీ ! – నందసుతశౌరీ !

28 శిశుపాలహరణా ! – శిష్టసంత్రాణా !

29 మత్స్యావతారా ! – మహితప్రచారా !

30 కూర్మావతారా ! – కువలయోద్ధారా !

31 నరమృగాకారా ! – సురరిపువిదారా !

32 వామనాకారా ! – బలిగర్వహారా !

33 జమదగ్ని రామా ! – క్షత్రియవిరామా !

34 పంక్తిరథబాలా ! – పంక్తిముఖకాలా !

35 బలరామరూపా ! – బాహుబలదీపా !

36 కృష్ణావతారా ! – కీర్తివిస్తారా !

37 కల్కిశుభరూపా ! – ఖలజనదురాపా !

38 బౌద్ధావతారా ! – పాషండదూరా !

39 శ్రీపాండురంగా ! – గోపీభుజంగా !

40 కరుణాంతరంగా ! – ఖగరాట్తురంగా !

41 కస్తూరిరంగా ! – కావేటిరంగా !

42 తిరుపతిని వేశా ! – వరవేంకటేశా !

43 అలమేలుమంగా ! – హృదయాబ్జభృంగా !

44 శ్రీశ్రీనివాసా ! – చిత్రసువిలాసా !

45 హస్తిగిరివాసా ! – నిస్తులోల్లాసా !

46 శ్రీవరదరాజా ! – స్త్రీ జనమనోజా

47 విష్ణూ! ముకుందా ! – వినుతమునిబృందా !

48 దామోదరా ! హరీ – దైత్యకులవైరీ !

49 శ్రీవాసుదేవా ! – చింత్యప్రభావా !

50 నారాయణ అజా – నలినాప్తతేజా !

## విష్ణుస్తుతి - చతురశ్రజాతి

1 జయజయశ్రీరామ! – జయజయరఘురామ !

2 జయజయసీతారామ! – జయజయజానకిరామ !

3 గోవింద ! రామ ! రామ - గోపాల ! హరి ! హరి
4 దేవాదిదేవయో - శ్రీవరా ! కావరా
5 ఇందిరామనోహరా ! - సందియములువాపరా !
6 సీతామనోహరా - సేవకులను బ్రోవరా
7 జానకీమనోహరా ! - జయముమాకొసంగుమా!
8 రుక్మిణీమనోహరా ! - రూఢిగామమ్మేలరా !
9 లక్ష్మీమనోహరా ! - రక్షింపుదయాకరా !
10 తల్లివీవెతండ్రివీవె - దాతవీవెశ్రీధరా !
11 భ్రాతవీవెత్రాతవీవె - సీతామనోహరా !
12 ధనమునీవెధాన్యమీవె - ధరణిజామనోహరా !
13 చదువువీవెశాస్త్రమీవె - సత్యమునీవె శ్రీధరా !
14 అన్న మీవెపున్నె మీవె - యాస్తినీవెకేశవా !
15 చట్టమీవె పట్టునీవె - నట్టునీ వెరాఘవా
16 సూర్యుఁడవీవె చంద్రుఁడవీవె చుక్కలునీవె శ్రీహరీ !
17 వేదమునీవెమోదమునీవే - విశ్వలోకరక్షకా !
18 గాలివీవేనేలవీవే - గగనము నీవే మాధవా !
19 జలమునీవేకీలివీవే - జలజపత్రలోచనా !
20 ఇందునందుసందు లేక - యుందువుపరమేశ్వరా !
21 పంకజాక్షసంసార - బంధముఁదొలగింపరా !
22 జాంబూనదచేలచిత్త - శాంతిమాకొసంగుమా !

23 పద్మనాభ ! నీ శ్రీపాద - భక్తిమాకొసంగుమా !

24 చిన్నికృష్ణ వెన్నదొంగ ! - విన్నపమాలింపుమా !

25 వన్నెలాండ ! వెన్నుండా ! నన్గన్న తండ్రివినీవెరా !

26 రాసక్రీడంజేసిన - విలాసముంజూపింపరా !

27 అన్నుమిన్నలచీరెలుగ్గై - కొన్న ప్రోడవీవెరా !

28 చెట్టుమీదబట్టలిడి - రట్టుజేసినావురా !

29 కేల బెండుబోలెభూరి - శైలమెత్తినావురా !

30 గొల్లలలోగిండ్లంజొచ్చి - గోలంజేసినావురా !

31 వెన్నపాలు పెరుగుమీంగడ - జున్నులుదిన్నావురా

32 కన్నతండ్రి ! మమ్ముంబ్రోవం గాందలంపరా ! హరీ !

## విష్ణుస్తుతి - జుల్వతాళము ౬

1 శ్రీనిధీ ! ఘనసుధీ ! - సేవితకృపానిధీ !

2 నీరజదళేక్షణా ! - నిఖిలలోకావనా !

3 సంసృతినివారణా ! - సాధుజనపోషణా !

4 మందరాచలధరా ! - మంజులగుణాకరా !

5 జాంబూనదంబరా ! - సన్నుతదిగంబరా !

6 రవికులశివంకరా ! - రాక్షసభయంకరా !

7 సీతాహృదీశ్వరా ! - సేవితమునీశ్వరా !

8 గౌతమకులాంగనా - ఘౌఘనిర్మూలనా !

9 హరధనుర్భంజనా ! – ధరణిజారంజనా !

10 శిష్టపరిపాలనా ! – దుష్టజనమారణా !

11 దశముఖకులాంతకా ! – దాసజనకల్పకా !

12 శిశిరకిరణాననా ! – స్వీకృతాద్భుతగుణా !

13 వల్లవీపల్లవా ! – వందితఘనోద్ధవా !

14 వరయశస్సేవధీ ! – వర్ధితాఖిలసుధీ !

15 శౌరి ! గోవర్ధనా – చలధరశ్రితావనా !

16 చాణూరమర్దనా ! – చక్రీ జనార్దనా !

17 బాణకరనాశనా ! – స్థాణుబలశోషణా !

18 భక్తదైవతమణీ ! – బర్హచూడామణీ !

19 కైటభవిదారణా ! – కౌస్తుభవిభూషణా !

20 అపహృతనిలింపపా – దపయశోదీపితా !

21 భూభరనివారణా ! – పుణ్యచయకారణా !

22 నరకమురసంహరా ! – సురమునిశివంకరా !

23 రామాజనస్మరా ! – కామగుణభీకరా !

24 కల్యాణసాగరా ! – కాకుత్థ్సశేఖరా !

25 పతితజనపావనా ! – వరవశిమఖావనా !

26 రవిశశివిలోచనా ! – భువనజనమోహనా !

27 జ్ఞానవైరాగ్యదా ! – గాఢభక్తిప్రదా !

28 అప్రమేయ ప్రభావ – ప్రమోదాస్పదా !

29 భుక్తి సంధాయకా ! – ముక్తిప్రదాయకా !

30 శ్రీసరోజాసతీ - సేవితవరాకృతీ !

31 యోగిజనకల్పకా ! - భోగిరాట్తల్పకా !

32 పక్షిపతివాహనా ! - రక్షితమహాగుణా !

33 కౌమోదకీధరా ! - కావరాశ్రీధరా !

34 చక్రీ దయాకరా ! - జయముమాకొసఁగుమా !

35 శ్రీవత్సశోభితా ! - స్థిరభక్తినీయరా !

36 కౌస్తుభవిభూషణా ! -కడకంటఁజూడరా !

37 శార్ఙ్గ భాణాసనా ! - సత్యపదమీయరా !

38 వరపాంచ్యజన్యధర ! - వాంఛలీడేర్పుమా !

39 నందకధరా ! - మహానందంబొసంగుమా !

40 లక్ష్మీమనోహరా ! - రక్షింపరాహరీ !

## శ్రీరామస్తుతి, జుల్వతాళము ౭

1 శ్రీరామా ! జయరామా - శ్రీసీతారామా

2 నారాయణశ్రీశ ! - నలినాక్షరామా !

3 పారావారగర్వ - భంజనరామా !

4 మారారినుతభక్త మందారరామా ! ॥ శ్రీరామ ॥ 1

5 రవికులేశ్వరదశ - రథపుత్రరామా !

6 భవవినాశనగాధి - భవవంద్యరామా !

7 సవనావనాముని సతిరక్షరామా !

8 కవినుత ! తాటకా ఖండనరామా ! ॥ శ్రీరామ ॥ 2

9 గరళకంధరకార్ముక వినాశరామా

10 సరసిజాక్ష ! జనక – జామాతరామా !

11 ధరణీజాహృదయాబ్జ హరిదశ్వరామా !

12 పరశురామగర్వ – భంజనరామా ! ॥ శ్రీరామ ॥ 3

13 జనకాజ్ఞపాలకా ! – జయజయరామ

14 వనవాసదీక్షా ! భా – వనయుక్తరామా

15 ఘనచిత్రకూటని – కాయ్యశ్రీరామ !

16 మునిజనసముదాయ మోదితరామ ! ॥ శ్రీరామ ॥ 4

17 శరభంగపూజిత – చరణాబ్జరామా !

18 వరసుతీక్ష్ణముని – వందిత రామా !

19 పరమహంసవ్రజ ప్రార్థితరామా !

20 ఉరరీకృతాసురోత్కరనాశరామా ! ॥ శ్రీరామ ॥ 5

21 ఘటసంభవార్పితకార్ముకరామా !

22 పటుపంచవటితీరవాస శ్రీరామా !

23 చటులశూర్పనఖానాసాచ్ఛేద ! రామా !

24 కుటిలరాత్రించరకులనాశరామా ! ॥ శ్రీరామ ॥ 6

25 ఖరదూషణాదిసంహరణ శ్రీరామా !

26 పరిరంభితధాత్రీభవకుచరామా !

27 ధరణీజాసౌమిత్రి దర్శితరామా !

28 పరమానందపుణ్య భరిత శ్రీరామ ! ॥ శ్రీరామ ॥ 7

29 మారీచ ప్రాణా పహార శ్రీరామా !

30 సారాండజేంద్రమోక్ష ప్రదారామా !

31 ఘోరకబంధసంహారా ! శ్రీరామా !

32 భూరిపావనశబరి – పూజితరామా ! ॥ శ్రీరామ ॥ 8

33 సేవితపంపాస – రోవరరామా !

34 పావనివచనసం – భావితరామా !

35 ధీవరసుగ్రీవా – ర్తివినాశరామా !

36 భావితనిజజాయా భరణ శ్రీరామా || శ్రీరామ ||

37 సురరాజనందనా – సుధ్వంసిరామా !

38 హరిదశ్వతనయరా – జ్యప్రదరామా !

39 సురుచిరమాల్యవ – ద్గిరివాస రామా !

40 విరహానలజ్వాలా – పీడితరామా ! || శ్రీరామ || 1

41 దూషితసుగ్రీవ – దుర్గుణరామా !

42 భూషితాఖిలకీశ – పుంగవరామా !

43 ప్రేషితవానర – పృధుసైన్యరామా !

44 శోషితాఖిలవిధ – శోకశ్రీరామా ! || శ్రీరామ || 11

45 సకలవానరసేనాసంయుక్తరామా

46 ప్రకటీకృతబాహు – బలసంపద్రామా !

47 వికటవారిధిగర్వ – విదళనరామా !

48 అకలంకశౌర్యోల్లంఘితకంధిరామా ! || శ్రీరామ || 12

49 లంకాపురీవాస – లలితాంగరామా

50 లంకాలంకారవిలయ ! కాల రామా !

51 లంకానిశాటభయంకరరామా !

52 పంకేజభవముఖ – ప్రణుతశ్రీరామా ! || శ్రీరామ || 13

53 ఖలశక్రజిన్నాశ - కారణరామా !

54 కలుషాతికాయాంత - కముదాప్త రామా !

55 బలరాక్షసప్రాణా - నిలనాశరామా !

56 జలజాప్తతనయాది - సన్నుతరామా ॥ శ్రీరామ ॥ 14

57 ఘటకర్ణదశముఖ - ఖండనరామా !

58 పటుబాణసహితదో - ర్బలయుక్తరామా !

59 నిటలాక్షబ్రహ్మావ - ర్ణితగుణరామా !

60 అటవీచరాసుదా - యకసీతారామా ॥ శ్రీరామ ॥ 15

61 సీతాలక్ష్మణసము - పేతశ్రీరామా !

62 శ్వేతపుష్పకవిమా - నస్థిత రామా !

63 స్ఫీతవానరరక్షో - న్వీత శ్రీరామా !

64 పూతభరద్వాజ - పూజితరామా ॥ శ్రీరామ ॥ 16

65 భరతమనోరథ - ఫలరూపరామా !

66 పరిరంభితమాతృ - భాగ్యశ్రీరామా !

67 సరసిజభవపుత్ర - సంతోషరామా !

68 వరపౌరపూజిత - చరణాబ్జ రామా ॥ శ్రీరామ ॥ 17

69 పురనంది గ్రామవి - భూషణరామా !

70 భరతార్పితరాజ్య - భారశ్రీరామా !

71 ఉరరీకృతాయోధ్యా - పురధామరామా !

72 పరమానందసం - భరిత శ్రీరామా ॥ శ్రీరామ ॥ 18

73 భరతశత్రుఘ్నుల - క్ష్మణయుక్త రామా !

74 ధరణీపుత్రీయుక్త - పరమాత్మరామా !

75 వరరత్నహరిపీఠో - పరిదీప్తరామా !

76 చిరతరపట్టాభి - షేక శ్రీరామా ॥ శ్రీరామ ॥ 19

77 సురచిరమాణిక్య - శోభితరామా !

78 తరళ ంగదాదిర - త్నవిభూషరామా !

79 గురుతరనవరత్న - కోటీర రామా !

80 హరిదశ్వకోటిదు - ర్భరతేజరామా ॥ శ్రీరామ ॥ 20

81 సురపారికాంక్షిసంస్తుత సీతారామా !

82 తరుచరాధిపవిభీషణ - వంద్యరామా !

83 మరుదాత్మజస్తుత - చరణాబ్జరామా !

84 పరిపాలితాయోధ్యాపురలక్ష్మీ రామా ॥ శ్రీరామ ॥ 21

85 వరపూడివాడ నివాస శ్రీరామా !

86 దాసిమమ్ముల c బ్రోవు - దశరథరామా !

87 రాకేందువదన శ్రీకాకుత్థ్స రామా !

88 పాకారినుతరామా పట్టాభిరామా ॥ శ్రీరామ ॥ 22

89 భాసమానరామ కౌసల్యరామా !

90 కంజలోచనరామా కల్యాణరామా !

91 వందనంబులు నీకు వైదేహీరామా !

92 మొవ్వవేంకదాస పోషకరామా ॥ శ్రీరామ ॥ 23

శ్రీమతే రామానుజాయనమః

# కీర్తన కలాపప్రారంభము

## శ్రీరామస్తుతి

### హంసధ్వనిరాగము - ఆదితాళము

**శ్రీజాని కీవరం భజేహం ॥ శ్రీజా ॥**

రాజశేఖర శరాసభంజనం, రాజీవాప్తకులైకరంజనం, రాజిత రాకాచంద్రని భాస్యం, వాజిమేధముఖ సవనోపాస్యం, స్త్రీజనమదనం, తేజస్సదనం, రాజపూజితం, సౌజన్యయుతం ॥ శ్రీజా ॥

ఖరరావణ కుంభకర్ణహరణం,విరాధాదిరాక్షసవిదారణం, పరాక్రమార్జిత కీర్తిమందిరం, స్మరాతీత సంహనన సుందరం, పరమపావనం, హరికులావనం, దురితనివారం, కరుణాపూరం ॥ శ్రీజా ॥

న్యంకు రూపకాసుర నిశారణం, న్యంకుజనాభయ దానపూరణం, పంకపంకజ సమూహవారణం, వేంకటదాసోల్లాస కారణం, సంకటహరణం, సంసృతితరణం, శంకారహితం, శమదమకలితం ॥ శ్రీజా ॥ 1

### ఫేనద్యుతిరాగము - అటతాళము

జానకీలోకైక జనయిత్రీ ! నినుసన్నుతించెద ॥ జాన ॥ పూని నీవిభుఁడైన రామునితో నరణ్యమునకుఁజని సన్మౌనికాంతా మునిజనంబుల, చేనతులు గైకొంటివంబా ॥ జాన ॥

గాలికోరిచి వేసఁగుల వడగాలికోరిచి చలికి వానకు, జాలి ఁజెందక ముండ్లమీఁదను, రాలపై గమనించి భర్తకు రేలుబవ లుపచారమొనరుచు, లీలఁగనిఘటజాది ముఖమునిని, జాలములు సాలవినుతించిరి ॥ జాన ॥

గిరిచరులతో రవి సుతుండొక, గిరిపైన నివసించివగచెడు, తరుణమ్మున
మణిమండనములు వి, సరితివప్పుడె వాని గొనినీ, వరున కుపహారంబుగా
నిడి - హరికుమారుండరి భయము చెచ్చెరవిడిచి చెలఁదొలచి మిక్కిలి,
సిరులతో సుందరులతో హితపరులతో సౌఖ్యములుగాంచెను ॥జాన॥
దురితమతియగు రావణుని సంగరములోఁ జంపించి వైశ్వాన
ఖానిచయము హిమాంబువు, కరణిఁదెరలుచుకొని జగంబులు, కరము
విస్మయ మందసరమా, వరున కఖిలైశ్వర్యముల నిడి, పరమసాధ్వుల
భయము మానిచి, సిరివినీవని దాశరథిశ్రీ, హరియనుచు వేల్పులును
తింపఁగ వరునిఁ గూడియ యోధ్యకుంజని, నిరుపమాన సుఖంబులంగని
కరుణ వేంకటదాసుఁడడిగిన,వరములొసఁగెడు పద్మనిలయ॥ జానకీ ॥ 2

## కేదారగౌళ - తిశ్రజాతి

**మరున్నందనా, దేవా ॥ మరు ॥**

సురాసురారాధనీయ సూరిజనావళిధ్యేయ, పరిచితవనచరభూపా,
నిరతిశయసుగుణకలాప !॥ మరు ॥
సాహితీనిధానాశయ, సంగీతకలాప్రమేయ, బాహుశౌర్యమశకీకృత ,
పలలాశనకులవ్రాత ! ॥ మరు ॥
అక్షాఖ్యనిశాటశమన, రూక్షామయనిచయదమన, పక్షిరాజ పవనజవన,
శిక్షావ్యాకరణభవన ! ॥ మరు ॥
శరణుశరణు హనుమంతా, జయజయ జయ ధీమంతా, నిరతము
వేంకటదాసుని, దురితంబులడఁచి ప్రోవుము ! ॥ మరు ॥ 3

## హరిపరివారస్తుతి

### సామవరాళి - ఆదితాళము.

చిన్ని పూవులొనరింతున్ । వెన్నుని పరిచారకులకవశ్యము ॥ చిన్ని॥
సరోజాలయకు నీళకుందులసికి, ధరణీదేవికిఁ దత్పరిసరమున,
నిరతము భజించు తరుణీమణులకు ॥ జిన్ని ॥
హరితల్పంబగు పన్నగేంద్రునకు, హరివాహనమగు గరుడాళ్వారికి
హరిసచివుండగు శేషాశనునకుఁ, బరమభక్తితోఁ గరములు
మోడిచి ॥ చిన్ని ॥
పరమపదముునన, పరిమితసౌఖ్యో, త్కరముఁగనుచు వేంకటదాసుని
హరి, పరివారమునందుఁ జేర్పఁగరుణా, వరులై కోరెడు
నిత్యముక్తులకు, ॥ జిన్ని ॥ 4

## శఠగోపస్తుతి

### కనకాంబరిరాగము - జుల్వతాళము

పరాంకుశమునీంద్రా, నీ చరణాబ్జము లాశ్రయింతుఁ ॥ బరాం ॥
నిరంతరము తింత్రిణీకోటరమునందు యోగదశా,పరుండవై హరిపాదాం,
బురుహధ్యానమొనర్చిన ॥ పరాం ॥
ఘనసేనాపత్యంశంబునజనించిజననమాది, జననీస్తనదుగ్ధములైననుఁ
గ్రోలక ప్రాకృతవ స్తునికరములుగొనక మేను, బెనిచివేదంబులు
ద్రావిడ, మునరచించి కీర్తిఁగొన్న । ।పరాం ॥
పారికాంక్షివర్యులలో, నీరాహారులు వర్ణాహారులు
వాతాశనులున్నారుగాని హరిభక్తిసు, ధారసాధారులొకరైన, లేరు నీవలె,
వైష్ణవులకు । ధారకమై పోషకమై సారభోగ్యమైయుంటివి ॥ పరాం ॥

నానా హృషీకములు నన్ను, జ్ఞానేతరకృత్యంబుల, పై నటింపఁజేయఁ బరా, ధీనుఁడనై చెడుచుంటిం, గాన వాని దౌర్జన్యమడంచి, యజ్ఞాన విపరీత జ్ఞానములఁగుంచి,నా,మానసమున సత్వగుణంబుుంచి, సు,జ్ఞానభక్తి విరాగములఁ బెంచి, శ్రీ నారాయణపదములఁ జేర్పుము వేంకటదాసునిఁ ॥ బరాం ॥ 5

## యామున మునిస్తుతి

### శహనరాగము - జుల్పతాళము

యామునమునీంద్రా । కామాది దుర్గుణస్తోమ తిమిరాబ్జహిత ॥యాము॥

పామరజనోద్ధార, తామసరజోదూర, కోమలకృపాపూర, ధామవిమలాచార ॥ యాము ॥

పెక్కు శాస్త్రములు నేర్చి, పండితుల నొక్కడై జగతి నోర్చి నిక్కుచుండంగ నయ్యక్కి యాళ్వాను కడ, కొక్క సావింజని తటుక్కున జయించితివి ॥ యాము ॥

పుత్రవాత్సల్యముంచి, మాదృశచ్ఛాత్రులనుఁ గావనెంచి, చిత్ర నిగమాంతార్థ, ధాత్రియగునట్టులా, స్తోత్రరత్నంబునుఁ బవిత్రమతిఁ జేసితివి ॥ యాము ॥

కారుణ్యరసము నిన్ను, సారెకునుఁబ్రేరింపఁగవిసి మున్ను, మారనేరియను నొకమాలని మహాత్ముఁడగు తీరున నొనర్చితివి, ధీరులాశ్చర్యపడ ॥యాము॥

వంకములఁ దొలగించి, మామనస్సంకోచముల హరించి వేంకటాఖ్యునినిరా, తంక కృపతోడ నీ, కింకరునిగాఁగొనిశి వంకరుఁడవగుముశ్రీ ॥ యాము ॥ 6

# రామానుజస్తుతి

## చంద్రకాంతరాగము, అటతాళము

రాజపూజితపాద! శ్రీయతిరాజ ! రాజనిభాననా॥రాజ॥
॥భ్రాజమానశ్లోక ! దినకరతేజ ! వైష్ణవరాజరాజిబిడౌజ !
శ్రితసురభూజసద్గతి, బీజయనినినుఁదలఁచుభక్తసమాజమొందదు
పునర్జన్మము ॥ రాజ ॥

పరమపదమెడఁబాసి ధరణీ, సురకులంబునఁబుట్టిలక్ష్మీ, సరసిజాక్షుల
సుప్రభావము, నిరతమును భోధించి సంసృతి, శరధిమగ్నుల నుద్ధరించిన,
పరమయోగీంద్రుండవని నీ, చరణములు శరణముగ వేడితి ॥ రాజ ॥

గురులు మతకర్తలు మునులుమస్కరులుమును జన్మించిశిష్యోత్కరమునకు
సుజ్ఞానమార్గం, బరసి చూపిరిగాని నీ పరిసరముఁజేరిన జీవులకు
శ్రీహరిపదంబులు సూపి ముక్తికి, సరగుననుఁ జేర్చితివికాదే ॥ రాజ ॥

కులమదము విద్యామదంబును, గలిగి పొలిచెడు దేశికులు ద్విజ,
కులమునకుమాత్రమధికారము కలదనుచునధ్యాత్మ తత్త్వము,
దెలిపిరటువలెఁగాక నీవాగి, ఖలజనములకు శూద్రులకుఁ జెంచులకుఁ
జండాలుకుఁ జెప్పితి, వలఘు దయ వైష్ణవము మాదృశు, లలఁతులైనను
విష్ణుదాస్యము సలుపఁగలిగిరి దానిచే నిర్మలగుణాకర ! వేంకటాఖ్యుని
కొలలడంచిన పుణ్యశీలా ! ॥ రాజ ॥ 7

## మనోరంజని - ఝల్పతాళము

శరణు శరణు యతిరాజా । సరసిజబాంధవ సన్నిభతేజా ॥శర॥
దురతహరణ ! శుభచరితా ! కరుణానిరతా ! హరిభక్తిరతానందసుభరితా
తావక చరణాబ్జములకు ॥ శరణు ॥

నరకకూపములఁబడలేక మహత్తరసంసారము నీదలేకభవ, పరంపరలను భరింపలేకదు, స్తరేంద్రియ వ్యాపారంబులచేఁ, దిరుగుడువడి దుఃఖింపలేక నీ, దరిఁజేరితినే తెరువుఁజూపేదో ? ॥ శరణు ॥

జ్ఞానమందుఁ గర్మమందు భక్తి, ధ్యానయోగములయందు సమర్థుల, శ్రీనాయకుఁ డాదరించు మాదృశ, దీన జనుల మోముఁజూడనొల్లడు, గాన నీవుపూనికావవలయును ॥శరణు॥

పసులకుఁ గీటములకు మృగములకు, విసారంబులకు మోక్షమిచ్చి పే, రసుముఁ గన్న నీకు వేంకటాఖ్యునిఁ, బ్రసాదించుటొక భారంబగునే ॥ శరణు ॥ 8

## ముఖారిరాగము - జుల్వతాళము

**శ్రీరామానుజయోగివర్యా, సద్గుణధుర్యా ! ॥ శ్రీరా ॥**

శారదాపీఠముఁజేరినప్పుడు నీ వాగ్ధోరణి కానంద వారాశిలోఁ దేలి, భారతి శ్రీ భాష్యకారాహ్వయంబిచ్చి ధీరాగ్రేసరుఁడని సారెకు వినుతించె ॥ శ్రీరామా ॥

జైనమాయావాది చార్వాక పాషండా, మానబౌద్ధాది దుర్మత శాదమునఁ ద్రోవఁ గానకయున్న శ్రీకాంతునుద్ధరించి, మానిత వైదికమత వర్తిఁ జేసిన ॥ శ్రీరామా ॥

పాలిచ్చువారికిఁ బెరుగిచ్చువారికిఁ బూలొసంగి చిన్న పూలన్నవారికి, స్త్రీలకు నీచదాసీలకు మఱియుఁ గూలీలకు నుడిలేనియాలకు నీటిలోమీలకు మోక్షములీలనొసంగిన ॥ శ్రీరామా ॥

జననమొందినేను జనయిత్రి ప్రక్కలో మనుచుండఁబదియేనుదినములైన రేయిఁజనుదెంచి నీవుచయ్యన శేషాకృతితోనా, తనువుపైనీడఁబట్టిన వార్తనెందటో, జనులు గాంచితిమని విను వింతురట్టినీ, కనికరంబీనాడుగాని వేంకటాఖ్యదానునిఁబ్రోవుమయ్యపావనశీలయతిరాజా ! ॥ శ్రీరామా ॥ 9

# గోదాస్తుతి

## వాగీశ్వరిరాగము - అటతాళము

జననీ శ్రీగోదాదేవి పావనగాత్రి ! ॥ జననీ ॥

మును విష్ణుచిత్తునివనములోఁ దొళసిదాపునఁబుట్టి యమ్మహాత్ముని పుత్రివైనావు ॥ జననీ ॥

భోగించి విడిచిన పూలచేరంగేశు, రాగిల్లఁజేసి యాభోగితల్పకునితో, భోగంబులందినావు, పాకృత దోషత్యాగం బొనర్చినావు, తండ్రికిఁ గీర్తియోగంబమర్చినావు, భక్తులకుండు రోగంబులడఁ చినావు,ఆగసాత్ములమై సదాదోషౌఘముల కిక్కయుగు సంసృతి, వాగురానిఘ్నులగు మాదృశ, రాగుల రక్షింపుచుంటివి ॥ జననీ ॥

యతిరాజ చంద్రుఁడద్భుతభక్తితో నీ వసతికివచ్చి పెక్కునతులుగావింపఁ గా, మతిమంతుఁడనియోజించి, చెంతకుఁజీరియతిమోదమున లాలించి, శ్రీవైష్ణవ మతదేశికుఁడవైమంచి, కీరితిఁగాంచి క్షితిపైలోకులమేలెంచి, సతతమునుబోధించి దుస్సంసృతి బాధలడఁగించి లక్ష్మీ , పతిపదంబులఁ జేర్పుమని యీప్సితవరంబులొసంగితివిగద ॥ జననీ ॥

దరిలేనిపాతకోత్కరములోఁబడి కళేబరమే జీవుండని నిరతంబు భ్రమఁ జెంది గురుతరామయములొంది, కామాదిభీకరశత్రువులచేఁగుంది, బహిశ్శత్రుపరిభవంబులచేఁగంది, తాపత్రయభరముచే దిగులుజెంది, నిరతమును డీలుపడుమాదృశ, నరమృగములనుబునీతులుగా, నెరపి హరిపాదములఁఁజేర్చుట, కరసిపుట్టిన పుణ్యరాశివి ॥ జననీ ॥

యమ బాణ తుల్య తీక్ష్ణములై సర్వేంద్రియ, సముదాయములు మాకు శ్రమఁగల్గించెను వీని, తమక మెుక్కటవారించి, యరివర్గ

దుష్టోద్యమము లెల్లదగ్గించి సత్యశౌచ శమదమాదులుగల్గించి, కేశవు సామీప్యముఁజేరు భక్తిఁబెంచి, విమలకృపఁబ్రోతువని నీపద, కమలములు ధ్యానింతు నిదిభారమిని తలఁపక వేంకటాఖ్యు మనమున నిల్పుము విష్ణుపత్నీ ! ॥ జననీ ॥ 10

## నాదనామక్రియ - జుల్పతాళము

లోకాచార్యునిఁ గొల్చెదన్ సద్భక్తిఁబిల్ల ॥ లోకా ॥

శ్రీకృష్ణపాదదేశికునకు జన్మించి, లోకోజ్జీవన మార్గ సౌకర్యయుతుఁడైన ॥ లోకా ॥

తిరుమంత్రద్వయమంత్ర చరమ శ్లోకార్థంబు, లరసి గ్రంథాకృతి నవనిపైనిల్పిన ॥ లోకా ॥

కులమదంబునఁ బొంగుఖలుల గర్వమడంప, సలలిత వచన భూషణము నిర్మించిన ॥ లోకా ॥

అందఱు రామానుజార్యుని సిద్ధాంత, మందుఁజేరుటకర్హులని త్రోవఁజూపిన ॥ లోకా ॥

తమి నష్టాదశరహస్యములు నిర్మించి మోక్షముఁజెందునట్లు మార్గమును గల్పించిన ॥ లోకా ॥

వేంకటదాసుని వివిధ చాపలమూడ్చి, పంకజాక్షుని పాదభక్తి నొసంగెడు ॥ లోకా ॥ 11

## సురటరాగము - అటతాళము

వేదాంతగురునిసేవింతున్ । జేజేలొనర్చి ॥ వేదాంత ॥

భూదేవకులమునఁ బుట్టి బాల్యమునందే, వేద వేదాంగాది విద్యలునేర్చి దుర్వాదులౌజనుల నిర్జించి, శ్రీహరి దివ్యపాదుకాద్వయిని గుతించి,

శ్లోకసహస్రోత్పాదనమెలమిఁగావించి, వైష్ణవజనాహ్లాదంబునొగి సంపాదించి, వేదశాస్త్రవిరుద్ధమతములఁ, గాదనుచు ఖండించి సాత్త్విక, మోదదాయక గ్రంథశతముల, నాదరమున రచించి నిల్పిన ॥ వేదాం ॥

దనుజారి ఘంటావతార ప్రసిద్ధిఁగైకొని కవితార్కికసింహమనకీర్తినార్జించి వనజాతాక్షుని నాశ్రయించి, జ్ఞానభక్తులను వైరాగ్యమును గడించి, స్వీయ శిష్యజనుల ముక్తులనుఁ గావించి, నారదాదిముని తుల్యుడై ప్రకాశించి, కనక ధారాస్తవముచే శ్రీవనితనొగి మెచ్చించి భువిపైఁ గనక వర్షము గురియఁజేసి సుజనుల కాశ్చర్యంబొసంగిన ॥ వేదాం॥

సకలవిద్యలయందు సర్వజ్ఞుఁడని విద్వన్ని కరంబులెల్ల బానిసలై సేవింపఁగా, గుకవుల గర్వంబడంచి, వందనమన్న సుకవిపుంగవులదీవించి, నిగమంబుల కకలంకార్థము వచించి, వాగ్దేవికి సుకరమార్గమునుఁ గల్పించి, సకల లోకారాధ్యుఁడగు శ్రీజానిపాద ధ్యానరతిచే, నకుటిలుఁ డవగుమంచు వేంకటాఖ్యునకు నాశీస్సులొసఁగెడు ॥ వేదాంత ॥ 12

## ఆనందభైరవి - చతురశ్రజాతి

వరవర యోగిభజింతుం । గరములుమోడిచి ॥ వర ॥

పరమ భక్తిచే రామానుజముని, చరణాంబుజ ప్రవణుఁడై సంసృతి, శరధి మగ్నులగు నరులకు జ్ఞానము, హరిభక్తియు వైరాగ్యముఁ గఱపిన ॥ వర ॥

వేదవిరుద్ధ మతస్థులైన దుర్వారవాదములు ఖండనఁజేసి మహాదరమ్మున విశిష్టాద్వైతము, మేనిపైనిల్పి మేలొనర్చిన ॥ వర ॥

నిర్మలద్రావిడ వేదంబులకు మణిప్రవాళ వ్యాఖ్యానములొనర్చి, యర్మిలిదేవాయతనములెల్ల మహాస్థలములు సేసికీర్తినొందిన ॥ వర ॥

తిరువాయి మొళిప్పిళ్ల శిష్యుఁడై, దేశికవాంఛితములెల్లఁ దీరిచి, హరిపాదాంభోరుహధ్యానపరుఁ, డై వేంకటదాసుని రక్షించెడు ॥ వర ॥ 13

# సురటరాగము - అటతాళము

పాదపద్మములాశ్రయింతు । శ్రీరామా ! నీ ॥ పాద ॥

వేదములు నానావిధాగమవాదములు సకలేతిహాస నినాదముల్లు కొనియాడుచుండెడు ॥ పాద ॥

అరవిందభవునిచే, నభిషేకమును గంగాధరునిచే భూరిస్తోత్రములు గాంచి సర్వ, సుర కోటీరములవ్యాపించి, కాళియ శీర్షోత్కర లాస్యమున విజృంభించి, శరణన్న వారి, కురుతర దుఃఖంబడంచి । శకటాకారాసురు నొక్కతన్ను చేద్రుంచి, వరబలీంద్ర వ్యాజమున గురుతరాజాండముఁ గొలుచునప్పుడు చరాచర భూతోత్తమాంగము, లొరసి కల్మషముల నడంచిన ॥ పాద ॥

హలశంఖ ధ్వజ కులిశాంకుశ కోదండ, జలజాతచ్ఛత్రాది లలితరేఖానీక, మిళితమై పొలుపుఁగాంచి। రక్తాంభోజములతో స్నేహముఁ గావించి, శోణరత్నముల కాంతులను నిందించి । చిగురాకు మొత్తములకు నేలికలై మించి తొలుకారు మెఱుఁగుల విధంబునఁ, దలత్తల యను కళుకులీనుచుఁ, గొలలడఁచి కలుములిడి భక్తులనెలమితో రక్షించుతావక ॥ పాద ॥

దాసాలిక ములందుఁ దలఁపులందుననం భ్రూనాసా శీర్ష విలోచనములందు నిలిచి పూజాసమయమునఁదులసిచేఁ, బాటలిమల్లికా సౌగంధికములచే, మాఖ్యమాలతీ సారసంబులచే, సాహిత్యమొంది వాసించుబలుతావిచే, వ్యాసనారదశుక పారాశర, శ్రీసనందన శౌనకాది సుధీసమూహాశయము లందున, భాసమానములై వసించెడు ॥ పాద ॥

సరగునమునిజాయా, శాపంబుఁదొలఁగించి, పరమపావని గంగాప్రభవ కారణమైయా, సిరియంకమున వసించి, నీళాభూసుందిదరులచేఁబూజఁ గాంచి, సీతాదేవి పరిచర్య కానందించి, రుక్మిణీ పాణి, సరసిజంబులశోభించి ।నరకహృతరాట్కన్యకాష్టోత్తరశతప్రమదా వ్రజస్త్రీ, పరంపరచేఁ బూజితములై, కరుణ వేంకటదాసునేలెడు ॥ పాద ॥ 14

## సావేరిరాగము - అటతాళము

ఎన్నటికిc గనుcగొందునో । శ్రీరామ ! నినునే ॥ నెన్న ॥

పున్నెములకిరవగు కరంబులు, తిన్ననైనసన్ననగు మధ్యము, క్రొన్నెలకునీడగు నొసలు కరిసన్నిభంబగు గమనమునుcగల నిన్నుc గన్నులకఱవుదీఱcగ ॥ నెన్న ॥

భములనేలు మహానఖంబులు, సుమములకు బదులిచ్చు తావులు, కమలదళముల నేలునంగుళి, సముదయము సుమశరునిcగాంచిన, విమలవైఖరి నిత్యతారుణ్యము కరాంఘ్రితలంబులందున, నమరుకులిశధ్వజశరాస, ప్రముఖరేఖలు గలుగు నినునే ॥ నెన్న ॥

చారుతరశృంఖల సమేతక, టీరమునుc గాంగేయచేలాది । ధారమైనసువృత్త శ్రోణుల, పారగాంభీర్యంబు, కాంతిక్ర, పార సములావణ్యమును సుకు, మారతయు సర్వాంగసౌంద ర్యారూఢిచేc దనరు నినునే ॥ నెన్న ॥

సిరికి సిరియై పరిమళములకుc, బరిమళంబై శుచికి శుచియై । సరస్వతి కొగి సరస్వతియై, పరమశుభముల కురుశుభంబై, తరణికినిc దరణియై పూతో, త్క రమునకుcబూతమై జీవన,సరణులకు ఘనజీవనంబై ।సరవి వేంకటదాసునకు నుత్సవంబగు నీసుందరాంగం ॥ బెన్న ॥ 15

## నీలాంబరిరాగము - చతురశ్రజాతి

చూపింపుమా । నీరూపమురామా ! ॥ చూపిం ॥

తాపసులకు సురలకు నిర్జరప్రతీపదర్శి నీ సంఘములకు సుమ చాపవ్యథc గలిగించి భూరిమో, హాపాదకమై వెలయు సోయగము ॥ చూపిం ॥

మానవమాంసముcదిను శూర్పణఖబి, ఊనడాసి మోహించి రామనీ, దానసైతి వలపుదీర్పవేయని, దీనత్వమున నుతించిన రూపము ॥ చూపిం ॥

వానరకామిని నిజపతిఁగూర్చిన, వానిశపించెద నని కోపముతో నీ నికటముఁ
జేరి కేలు మోడిచి, బానిసయై వినుతించిన రూపము ॥ చూపిం ॥
మౌనిలోక దేవాభి మానవములం, మౌని దండకనుదవ
మొనరించెదు, మౌనివరులు పరిరంభసౌఖ్యమి మ్మా ! యని
యాచించిననీ రూపము ॥ చూపిం ॥
కంతు జయంత వసంతాదులకుని, రంతరంబు నాశ్చర్యముఁ
గూర్చుచు, సంతాపంబులు దొలగించునీ, సొంతరూపమును
వేంకటాఖ్యునకు ॥ చూపిం ॥ 16

## శ్రీరాగము - మిశ్రజాతి

**వలపుచొప్పడకుండునే ?జలజాక్ష ! నీరూపంబ ందలచిన ॥ వల॥**

కలికిమిన్నలఁజెపనేలది ? సకలపదార్థ నిచయములందునఁ దలంపు
లేదినయోగిసత్తము, లెలమితోఁగనఁగోరునీపై ॥ వల ॥
ఇల్లువాకిలిఁబాసిపిల్లలనెదరోసి, తల్లిదండ్రులనేది వల్లభులను వీడి,
వల్లవస్త్రీనికరములు జాబిల్లియల్లుని భల్లములచేఁ, దల్లడిల్లుచు నిన్నుఁ
జేరి మహోల్లాసమునఁ గ్రీడసల్పిరి ॥ వల ॥
చాలుగాఁ బదియాఱువేల భామినులు నీ పాలిటి కరుదెంచి మేలి
సోయగమెంచి, నీలమేఘశరీర ! మమ్ముల నేలుకొమ్మని భార్యలై
పరలాలసలు విడనాడి నిన్నే రేలుబవలు భజింపలేదా ? ॥ వల ॥
నారీపురుషులకుండు తారతమ్యమెఱుంగ । నేరనివైరాగ్యనిధియైన
శుకయోగి, నారదుండు సనకుండు వ్యాసుఁడు, హరీతముఖమహామౌనులు
।కోరిసన్నుతిఁజేయరేనీ, జారచోరత్వాదిచేష్టలు ॥ వల ॥
దారుణరోగికాహారము చేదైన, తీరునదైతేయ, వారములకు నెగ్గి। సారెకును
ధ్యానించువారి కపారసంపద్దాయకం బై ।
సూరినుతమై వేంకటాఖ్యాధారమగునీరూపుఁగాంచిన ॥ వల ॥ 17

# శంకరాభరణము - ఆదితాళము

ధ్యానించెదన్ । శ్రీరామచంద్ర! భవదీయాకారము ॥ ధ్యానిం ॥

దానవాన్వయంబుల కపాయమై, మౌనిసంఘముల కురుధ్యేయమై, దీనరక్షణంబున కుపాయమై, మానినీజనంబులకు గేయమై, సూనబాణకోటిసుందరతకు నిధానమైన భవదీయాకారము ॥ ధ్యానిం ॥

వరవిద్రుమసమ పదతలములతో, దరదరవింద విలోచనములతోఁ, గరుణాన్వీతా పాంగంబులతో, సురుచిరకౌస్తుభ మాణిక్యముతో, సిరికిరవై విలసిల్లునురముతోఁ, గరికరోపమానోరుయుగముతోఁ బరిఘోపమదీర్ఘ బాహువులతో, స్ఫురద్బింబ సుందరోష్ఠములతోఁ, బరగుచున్న తావకీనరూపము ॥ ధ్యానిం ॥

జలజభవాండము లోముబొజ్జతో, జలరుహాప్తకోటితేజస్సుతోఁ, గళుకులీను కనకాంబరంబుతో, బలరిపు నీలాభవాలములతోఁ, దిలపుష్పముఁబోలిన నాసికతోఁ, దులసీదళ మిళితాంఘ్రి యుగముతోఁ, దొలుపలుకుల కిరవగు రసజ్ఞతో, నలువనుఁగాంచిన బొడ్డుఁ దమ్మితో వెలయుచున్న తావక సంహననము ॥ ధ్యానిం ॥

సితకరబింబ సదృశవదనముతో, నుతముక్తాఫల నిభరదములతో, నతిస్నిగ్ధమృదు కపోలములతో, ధృతకస్తూరీలలాటంబుతోఁ, బ్రతిమారహిత శ్రుతియుగ్మముతోఁ, బ్రతియైశంఖము నేలు గళముతో, స్మితసంయుత మార్దవభాషలతో లతాంతములఁ గేరుకోమలతతో, సతతమొప్పు నీ సుందరదేహము ॥ ధ్యానిం ॥

తారహారకుండలములతోఁ గేయూర శృంఖలోర్మికాళితో మంజీర కంకణంబులతో మణికోటీరప్రాలంబికాళితో సకలారి మారణంబుచే వెలయు శార్ఙ్గ నందక ముఖాయుధములతో, భూరిసౌరభముతో యశస్సుతో, నీరదవర్ణముతో వేంకటదాసారాధ్యంబై వరములొసఁగి పొలుపారుచున్న నీ మనోజ్ఞాకృతిని ॥ ధ్యానిం ॥

## మోహనరాగము - ఆదితాళము

ఔదార్య మెన్నవశమా ? సరసీరుహాక్ష ! నీ ॥ యౌ ॥

బీదతనముచే ఖేదమొంది పరమాదర మొప్పఁగ నీ దరిఁజేరిన, భూదేవునకు ధనోదయ లాభముచే దారిద్ర్యముఁ బోదట్టిన నీ ॥ యౌదా ॥

సైరంధ్రికి సౌందర్యము పాండవదారకు వస్త్రంబులు కాళియాహ్వ యోరగంబునకుఁ, బ్రాణంబులుముని, నారికమోఘాకారం బొసఁగిన ॥ యౌదా ॥

తరణిపుత్రునకు బలిదానవునకు, సరమావిభునకు ధ్రువునకుఁ గుంతీ, వరనందనులకు రుక్మాంగదునకు, నరోత్తముండగు నంబరీషునకుఁ జిరతర రాజ్యైశ్వర్యము లొసఁగిన ॥ యౌదా ॥

దండకలోఁ గల మౌనులకభయము, నండజపతి కపవర్గము ప్రీతిన్, దండమన్న శబరికి మోక్షము దుష్టుండగు కబంధునకు సురూపమును, నిండుమోదమున నొసంగి సూరివరండములకు నుతిపాత్రమైన నీ ॥ యౌదా ॥

చింతామణి నదలించి కామగవి, చెంతఁ జేరి నిరసించి కల్పకము, వంతఁ గూరఁజేసి పాల్కడలితోఁ, బంతమాడి వేంకటాఖ్యదాసని, జాంతరంగమున వసించి నిరతము, సంతాపంబులఁ దొలంగించు నీ ॥ యౌదా ॥ 19

## ఆనందభైరవి - అటతాళము

నీనామమే నామము । భవరోగశాంతికి ॥ నీ ॥

శ్రీనిధీ ! వైకుంఠకేశవ ! సూనశరజనకా ! మురాంతక ! భానుకోటి సమానతేజ ! కృపానిధీ ! యని పలుకువారికి ॥ నీనా ॥

నారాయణా ! యని నందనునుడివిన, ధారుణీసురునకంతక బాధఁ దొలగించి, కౌరవసభయందున, విపత్తులోఁ గూరిద్రుపదనందన మానమునిల్పరారా ! యాదవనందనా, భక్తపాలనారూఢధృతచందనా !

సారసాక్షా ! యని సుతింపగఁ, జీరలొసఁగి సుయోధనాది
మహీరమణులకు సిగ్గు సజ్జనవారముల కాశ్చర్యమొసఁగిన ॥ నీనా ॥
పొలుపారు బ్రహ్మాండముల నోలి సృష్టించి, బలుతేవలగు భూతలములచేత
నిండించి, జలరాసులనుఁ గల్పించి, సూర్యచంద్రాదుల నాకాశమున
నుంచి, శక్రాది నిర్జరులననేకులఁ గావించి, కర్కశులైన పలలాశనుల
నిర్మించి, విలయమొందఁగజేసి బాలక, వేషమున వటభూమిజముపై,
నిలుచువానింబిలుతునని కరినేత వినుతింపంగఁ బ్రోచిన ॥ నీనా ॥
గరిమతోమును రెండుగ డెలుచ్చరించిన, వరఖట్వాంగున కపవర్గము
సమకూర్చి, మరమరయనుచుఁజాటి, పలికిన బోయదురితములను
బోమీటి, సర్వకవీ, శ్వరుల యందునను మేటి, యగునట్లుసుస్థిరునిఁ
జేసిననాటి, గురుతరాద్భుత మహిమచే భాస్వరమగుచు నిల వేంకటాఖ్యుని,
వరరసజ్ఞాభాగమందుఁ గవనమునకు నాధారమైతగు ॥ నీనా ॥ 20

## నాటరాగము - చతురశ్రజాతి

సంకల్పము వర్ణింపఁగఁదరమా । సరసీరుహదళలోచన ! తావక ॥ సంక ॥
పంకజభవ పాకవైరిబాల శశాంకమౌళి శేషాహీశ్వర వాక్పంక
జాక్షిగిరిజాదులకఖిల, న్యంకుపుంగవుల కైనను దావక ॥ సంక ॥
దోనెలేకపలకలేకలాకలు, పూనకుండఁదంతుసంచయముసుంతైన లేక
పడుగుపేక యనుమాటైన లేక నిర్మించిన వస్త్రము, లూనియాజ్ఞసేనికిచ్చి
సభలో, మానమునిల్పిన నీ నిరుపమాన ॥ సంక ॥
భారవాహులనుఁజీరక శతాంగవారముపై మోపక శకటములనుఁ,
గోరకగజహయ మహాంగములపైఁ జేరుపకుండ మహాధనధాన్యము,
లారూఢిగనిండించి కుచేలుని, దారిద్ర్యముఁబాపినట్టి తావక ॥ సంక ॥

ఖరస్వరము కోకిలస్వరముగాఁ, జరణ ద్వయమరుణాంబు జములుగాఁ బరుషాజినము శిరీషసుమముగా । విరహిత కుచములు గురుకుచములుగాఁ బొరిఁబిల్లికనులుహరిణాక్షులుగాఁ, గురూపమును భాస్వరరూపముగా నెరపి కుబ్జనొగి లోకోత్తరసుందరిగాఁజేసి సుఖంబులిచ్చినే, దరసి మెువ్వ వేంకటదాసున కుర్వ, తరైశ్వర్యభోగాయుస్సులొసఁగు ॥ సంక ॥ 21

## కనకాంబరిరాగము - ఆదితాళము

నీ సౌశీల్యం బెన్నఁగఁదరమా। నీరజాతదళలోచన ! రామా !॥ నీసౌ ॥

దోషకారులైనఁ గేలుమోడిచి, దాసులగుచు శరణన్న మాత్రమున గాసిదీసివేసి సన్నిధికిరాఁజేసి మేలుసేసి వాసిఁగూర్చెదు ॥ నీసౌ ॥

జాతివిచారమొనర్పక యెలుఁగులఁ గోతిగములఁ గొండమ్రుచ్చులను సం ప్రీతినలవరించి, గురుబలాన్వీతులఁగావించి, వార్ధిపై సేతువుగట్టించి, దానవవ్రాతముఁ జూపించి, చేతోముదమున వధింపించి విఖ్యాతిగూరిచి పునీతులఁజేసిన ॥ నీసౌ ॥

ధరణీదేవుడు తన్నుఁ గొట్టగాఁ,బరాభవంబోర్వలేక శునకము, పరిసరమునఁజేరి నీ పదాంబురుహములకుఁగోరి, మ్రొక్కులిడ ధరణిసురునిఁజీరి, దండనము జరిపి నిరాబారిపరులువొగడ సారమేయంబు నొక, పరినుడు తను గృధ్రంబును బ్రోచిన ॥ నీసౌ ॥

జున్నుపాలుదధిమిగడతక్రము, వెన్నమెక్కిగొల్లవారికదివఱ,కున్న పాపములడంచి వనంబుల, నెన్నికగ్రిడించి, గోవులను మన్ననఁబాలించి, ప్రజార్భకులన్నెటిలాలించి, వేణునాదోన్నతిఁ బ్రకటించి, విన్న మాత్రమునడాసినయన్నుల, మిన్నల కెన్నో సౌఖ్యములొసఁగిన ॥నీసౌ॥

మునుగుహుఁబరిరంభించి శకుంతంబునకుఁజరమసంస్కారముఁజేసి దన సౌఖ్యము కుబ్జకొసఁగి శబరియి, డిన ఫలముమనుఁదిని, ద్రౌపదీ, వనశాకంబుఁగొని, విదురభోజనమునఁదనివిగని, పార్థుకీర్తిని వెలయింపఁ జని, వినయమున రథముఁదోలి వేంకటా ఖ్యునకు నజస్రము వరములొసంగెడు ॥ నీసొ ॥

22

## సావేరిరాగము - ఆదితాళము

వారిజాక్షశ్రీలోలా ! ॥ నా ॥ కోరికలొసఁగదవదేలా ? ॥ వారి ॥

సారెకు నీపదసారసములు మది, నారసి యెన్నో తీరుల వేడిన ॥వారి॥

నలువ పోల్కి గోవత్సార్భకుల ఘనముగదాఁచి వంచించితినా నిలింపపతిగతి రాలవానచే నీ వారల వేధించితినా ? వలతేని గొంగవలె బాణునిఁగావఁబూని నిన్నెదిరించితినా, తెలిసియుఁ దెలియని దుర్వాసుని గతి దెగువతోఁబరీక్షించితినా, తలిదండ్రియు గురుదైవము లీవను, తలంపుతో సేవించితిఁ గాని ॥ వారి ॥

వల్లవాంగనలవలె నాలింగన, వైభవసౌఖ్యంబడిగతినా?, తల్లడమందక కుబ్జరీతి సౌందర్యాదుల నాసించితినా తల్లియైన యాయశోదవలె సూత్రంబుల ఱోటంగట్టితినా ? గొల్లయైన నందుని వలె వనముల గోవులగావంబనిచితినా? మొల్లము ధారకపోషకభోగ్యము, లెల్లనీవెయని నమ్మితిగాని ॥ వారి ॥

ఇనపుత్రుని వలె నీయాజ్ఞమఱచి, వనజాక్షుల గోష్ఠినుంటినా ? ధనంజయుని చందమున సారథిత్వము వహింపుమని యడిగితినా ? వనరాశి కరణి గర్వముతో నీ వాక్యంబు ల్లంఘించితినా ? మును పుదంకుఁ డను మునివలెఁ దత్త్వంబు నెఱుంగక దూషించితినా ? దినదినమును వేంకటాఖ్యు నేలెడు పని నీదని యాచించితిఁగాని ॥ వారి ॥ 23

## భైరవి - మిశ్రజాతి

బలమిట్టిదన శక్యమా ? । గోవింద ! తావక ॥ బల ॥

ఖలులై లోకములెల్లఁ గారించు రాక్షసావళినాయాసము లేక కలనిల్తోఁ
ద్రుంచిన ॥ బల ॥

గోవర్ధనంబొక్క గోటితోఁబైకెత్తి గోవర్గగోపీ గోపాళిరక్షించి దేవనాయక
మానసస్థ, మహావలేపముఁ బాపి బాలుఁడవై వినోదము సల్పి విస్మయ,
మావహిల్లఁగఁ జేసితివి నీ ॥ బల ॥

విరివిపదునొక్కండు వేలామడలుగల, ధరణీధరము క్షీరోదధిపైఁదేలునట్లు,
సురలు ముప్పదిమూడుకోటులసురులు నలువది యాఱుకోటులు
తరచుటకు వీలైనరీతిగఁ దాఁబేలువై క్రింద నిలిచిన ॥ బల ॥

ప్రళయకాలమునందుఁ బాతాళగతమైన, యిలనొంటికాఁడవై యెత్తి
యెంవ్వటిచోట, నిలిపియుంచి చరాచరంబులు, నిఖిల
సౌఖ్యములొందునట్టులు, సలిపి వేంకటదాస పరిపంధుల సమూలముగా
వధించెదు ॥ బల ॥ 24

## మధ్యమావతి - త్రిశ్రజాతి

**సామర్థ్యమెన్నంగవశమా? శ్రీమానినీ చిత్తచోర !తావకదివ్య ॥సామ ॥**

రామకృష్ణాద్యవతారములెత్తి భూమిపై, రామాయణాది సద్గ్రంథముల్
నిర్మించి, యీ మానవాళికి క్షేమార్గమిచ్చిన ॥ సామ ॥

నల్ల రా రూపొంది, యల్లాదుదాని నుత్తుల్లాబ్జాక్షినిఁజేసి, వల్లభుతోఁ గూర్చి
బల్లిదులగు వారలెల్ల నెత్తగలేని విల్లొక్క చేతితోఁ బెళ్ళునవిఱిచిన ॥ సామ ॥

లీలమర్కటులచే, శైలముల్ నీటిపైఁ దేలునట్లొనరించి, పాలసులగు దైత్య
జాలములను వానరాళిచే రణమందుఁ గూలిపించిన నీ ॥ సామ ॥

కారుచిచ్చు మ్రింగి వారాశిపై మున్ను, ద్వారక నిర్మించి, సౌరిఁజేరిన గురు కుమారుని బ్రతికించి, దూరలోకమునందుఁజేరిన విప్రకుమారులఁ దండ్రికి గారాబముననిచ్చి, ధారుణి వేంకటదాసు నోమిన నీ ॥ సామ ॥

25

## కమాచిరాగము - చతురశ్రజాతి

**మాయదాఁటఁదరమా ? సరసీరుహాక్ష ! నీ ॥ మాయ ॥**

వేయియుగంబులు తపమొనరించిన, వివిధ యోగసిద్ధులు సాధించిన, గాయకుఁడైనను వేదశాస్త్ర సముదాయము పూర్ణముగా వల్లించిన ॥మాయ॥

సుందరరూపముఁ జెంది నీవు తమ, ముందఱ నిలిచిన సుందరాంగివని, మందులగు నసురు, లందఱు విభ్రమఁ, జెంది సుధారస మొందరైరి ఖండేందు మౌళినీ, యందమునకు వెఱగంది కుంది తెలివొంది నీకు బహు, వందనములు గావించె నితరులకు ॥ మాయ ॥

జ్ఞానిననుచు గర్వించిన నారద, మౌనిచానయై సూనులఁగనెఁజతు రాననుండు గోవత్సవ్యాజము, చేనొందెఁగదా పరాభవము దుర్మానియైన పాకశాసనుఁడు దీనాననుఁడయ్యెనురాలవాననా, డీనరాధముల కేనాటికైన ॥ మాయ ॥

మేనకపై గాధిజునకుఁ దారాధీనస్వాంతము శశికి నహల్యా మానినిపై నింద్రునకుఁ బరాశర, మౌనికి విసారగంధి మీఁదఁబూర్ణానురాగ మొదవించి కలంచిన ॥ మాయ ॥

ప్రేమమీఱ వేంకటాఖ్య వరదుండై మెలంగు నినుభజింపనేరక, కామాతురులై భామాపరులై, క్షేమేతరులై శ్రీమదాంధులై, తామసమతులై స్థేమరహితులై, సోమరులై దేహాత్మాభిమాన, ధాములైన యిప్పామరజనులకు ॥ మాయ ॥

26

## నాటరాగము - ఆదితాళము

జయరామ ! శ్రీరామ ! జానికీరామా ! భయములెల్లఁ
బాపుమయ్య భద్రగిరిరామా ! ॥ జయ ॥

పాపముల రూపుమాపు పట్టాభిరామా ! కాపాడఁదలఁపుమయ్య
కల్యాణరామా! ॥ జయ ॥

తల్లిదండ్రులు నీవే దశరథరామా ! మొల్లము నీవే సీతావల్లభరామా! ॥ జయ ॥

వందనంబులు నీకు వైదేహీరామా ! సందియములడంపుయ్య
సాకేతరామా ! ॥ జయ ॥

పాకశాసనాది వినుతలోకాభిరామా ! కాకాసుర గర్వహరణ !
కౌసల్యారామా ॥ జయ ॥

పూడివాడవాస రఘుపుంగవ రామా ! నేడు వేంకటాఖ్యుని
మన్నింపవేరామా ॥ జయ ॥ 27

## ముక్తాంబరిరాగము - ఆదితాళము

వరదరాజకావరారా ! శ్రీ ॥ వరద ॥

కరుణాపారీణ ! పాపహరణా ! సంసారాబ్ధితరణా ! మమ్ముద్ధరింప
రారా ! ॥ వరద ॥

పారావార గంభీర ! భూభార సంహార ! నిన్ను నమ్మి యుంటిరారా !॥ వరద॥

నీదివ్య పాదములు, మోదంబు తోడ మదిలోఁ దలంపుచున్న వాఁడ
రారా ॥ వరద ॥

కరిశైలభాగమున,సరసీజాసనయాగ,మరసిప్రోచినట్టిదేవరారా!॥వరద ॥

వారి దాభదేహ పార్థసారథీరాత్మ ఘన సమీర మేరుధీరశౌరి ! రారా !॥ వరద॥

నేడు పూడివాడనిల్చి, వేడుకతో వేంకటాఖ్యు, నోడక కాపాడుటకు
రారా ! ॥ వరద ॥ 28

## కల్యాణిరాగము - అటతాళము

పరిచర్యలొనరించెను, శ్రీరామా ! నీ పరతత్త్వమెటిఁగిమున్ను॥పరి॥
ధరణీజాసౌమిత్రు లిరువంకలనుగొల్వ, వరదండకాటవికరిగినప్పుడు నీవు, పరమపురుషుండనెడు జ్ఞానము ప్రజ్వలింపఁగ వనమునంగల, గిరులు తరువులు ఖగమృగంబులు, నిరుపమాన ప్రేమతోనీ ॥ పరి ॥
ఎండలో నీవేగుచుండఁగా నాకాశ, మండలంబున వివిధాండజమ్ములు నిల్చి, యెండదగలక యుండఁ బక్షవరండములు విప్పుకొనిపైఁజను, చుండునని వేదాంతవిదులగు పండితులు నుడివినకతంబునఁ ॥ బరి ॥
గమనింపు తటిశయ్యా కాలమందున గాలి, విమల కోరక పల్లవములు రాలిచి యిచ్చి, తమిఫలంబులు విస్తరాకులు, సుమ సముదయంబులును మకరం, దములు సమిధలు దర్భలవనీజములు నిత్యము నీకొసంగుచుఁ ॥ బరి ॥
మృగరాజముఖఘోరమృగములు దుర్గమ, మగుచోట మార్గముల్ తగినట్లుసూపించి, మృగమదంబుకురంగములు సొం, పగుపునుఁ గుజవ్వాది పిల్లుల తెగలొసంగి మదసింధురంబులు, తగువిధంబున వాహనములై ॥ పరి ॥
కూరిమి రామావతారకాలముననని, స్వైరిభజించిన చెట్లకబ్బిన పాటి, పారమార్థికబుద్ధికలిలో, ధారుణిన్ జన్మించుమానవవారములకు లభింపదాయె మురారి ! వేంకటదాసవరదా ! ॥ పరి ॥ 29

## కన్నడరాగము - ఆదితాళము

**అన్యులెఱుఁగఁదరమా ? నీ మహిమమురామా ! ధన్యులు !**
జనకునిఁబోలినట్టి రాజన్యులు బలిచక్రవర్తి వంటివదాన్యులు తపమొనరించిన త్రిలోక, మాన్యులెటింగి భజించెదరేకా ॥ కన్యు ॥

జనస్థానమున మందాకినియందుసఁజిత్రకూటమునఁ గ్రౌంచవనం, బునవసించువేళ నీ దివ్యసంహననముఁగని కౌఁగిలింపనీవే, యని మోహించిన మునివర్యులుగా ॥ కన్య ॥

సురపతి తెచ్చిన విమానము తిరస్కరించి వేలసమలు గావించి న, గరిష్ఠ తపోధనము నీకర్పణము రహింజేసి పరమపదమొందిన, శరభంగాది విరాగివరులుగా ॥ కన్య ॥

ఇమ్ములఁబంపాతటముఁ జేరు సమయమ్మున నీ మహిమమ్ముఁ గాంచి యితరమ్ము దూటి నిరతమ్ము భవత్పాదమ్ములందు హృదయమ్ము నిల్పి సౌ, ఖ్యమ్ముఁ గాంచి వేంకటాఖ్యునకు పాయువ్మై చరించు హనుమంతుఁడు కా ॥ కన్య ॥ 30

## కమాచిరాగము - ఆదితాళము

నీ పరతత్త్వంబెఱుగక భూమి ననేకులార్తులైరి ॥ నీ ॥

పాపులైన మాదృశులఁ గావ సీతాపతివై జనియించు నాడు శ్రీ గోపాలుఁ డవై వర్ధిల్లినతటి, నేపునదుష్టాలాపములాడుచు ॥ నీప ॥

శ్రీకరముగ మజ్జన్మకర్మములు ప్రాకృతములుగావని దివ్యములని, యాకళించు మానవులు పునర్భవ, మేకాలమునందు లేక మోక్షముఁ గైకొందురంచు గీతలలోనీ వూకొనిపలికిన శ్లోకమారయక ॥ నీ ॥

మారీచుఁడు రావణుఁడు వి రాధుఁడు, క్రూరుడగు జరాసంధుఁడు పౌండ్రక, ధారుణిపతి కంసుఁడు సాళ్వుఁడుగాం, ధారీసుతప్రముఖ దుష్టులు నిను, సారెదూటి దుఃఖంబుల పాలైనారని వినియు విచారము సేయక ॥ నీప ॥

భారతరణమందుఁ గోట్లకొలఁది, మహారథులు సమావేశమై నిరాధారలు పాండుకుమారులనియు మురవైరి మాకు లెక్కాయని పలుకుచు, వైరమూని మదవారణములతో, భూరిసైన్యములతో రథములతో, వారువములతోఁ బేరు మాసి జముఁజేరినారు, వేంకటదాసునేలు ॥ నీప ॥ 31

## రిషభాంగిరాగము - చతురశ్రజాతి

ఫణిరాజశయనా ! పంకేరుహాలోచన ! ॥ ఫణి ॥

గుణివని కొందఱు కొందటీవు నిర్గుణుఁడవని వచింతురుగదా సదా, గుణియనఁగాఁ గల్యాణగుణుఁడు నిర్గుణుడనఁగా హేయరహితుఁ డని, గణనసేయుటొప్పు శూన్యుఁడనియెడు, ఫణితి సత్యమని తోపదెన్నటికి

ధునీసుతుండు ధ్రువుఁడు ప్రహ్లాదుఁడు, ఘనులగు నారద వాల్మీకులవ్యా, సనందన పరాశరవ్యాసవిధి, సనకశివాదులమోఘ వాక్యముల, నినుఁబొగడిరి కల్యాణగుణాస్పదుఁ, డని యనేక సమయములందు శేష ॥ ఫణి ॥

అనిష్టములు వాపి వాంఛితార్థము, లనిశమిచ్చి భక్తులఁ బోషించుట, వనజ భవాండములను నిర్మించుటయును భూతంబులచే నిండించుట, ఘనస్థితి ప్రళయంబులొనర్చుట, మునినిలింపగణములఁ గాపాడుట, దనుజులఁ ద్రుంచుట కల్యాణగుణం, దను దానికి దార్కాణముగాదే ॥ ఫణి ॥

రామయాదవాది నామములచే, భూమియందు నవతరించటయు లీలా మహిమంబులు సూపుట గీతా, నామకశాస్త్రమొనర్చుట ధర్మము, నోముటధర్మేతరధ్వంసియై, ప్రేమతోడ వేంకటాఖ్యునేలుట, నీమహనీయ గుణంబులుగావే ॥ ఫణి ॥ 32

## ఫేనద్యుతిరాగము - ఆదితాళము

బాల్యమహిమవర్ణింతున్ ॥ సరసీరుహాక్ష ! నీ ॥ బాల్య ॥

కుల్యులైన వారిగర్భమున గురు, లౌల్యముతో వాత్సల్యముతో సౌశీల్యముతో జన్మించివెలయునీ ॥ బాల్య ॥

వారిజగంధీసమూహములు పరివారములై మించి, సారెగొల్వ పన్నీటిజలముచే స్నాతునిగావించి, చారుతర లలాటంబునందుఁగస్తూరి

తిలకముంచి, చేరి రత్నభూషణములచేఁ గైసేతలాచరించి, హారతులిడి సాంబ్రాణివైచిబం గారుతొట్లనుంచి కౌసల్యసాం, పారునుడుల లాలింపుచుముద్దిడి, గారాబముతోఁ బాడినట్టినీ ॥ బాల్య ॥

జున్నుపాలు దధిమీఁగఁడ గృహమున నున్నది యోజించి, వెన్నపాయసము చక్కెరలట్టములున్న తీరుఁగాంచి, చెన్నగు పూరీలు,బొబ్బట్లు నరిసెలుండుటెద నెంచి, మన్నుఁదింటి వేల చెప్పరా ! యను మాట లాలకించి, తిన లే దీక్షింపుమని నోరు, దెఱచి మహత్తర జఠర స్థలమం, దున్న యజాండమునంద జాయకుఁ బ్రసన్నమ తింజూపినట్టి నీ ॥ బాల్య ॥

పెక్కుగీములందొక్కసారి కనిపించి చెలురడాసి, వెక్కిరించి దధిబాండంబుల నుట్లెక్కి పగులఁజేసి, యెక్కడికేగెనొ పట్టవలయునని యింతులెల్లరోసి చిక్కనికతమునఁ బొక్కుచుండనలు, దిక్కులఁదోఁచియు నొక్కరికందక, ధిక్కరించి యంతర్హితమైనుతి, కెక్కిత్రిలోకంబుల వ్యాపించిన ॥ బాల్య ॥

స్తనంధయుండని గరళమిడిన రాక్షసిని సంహరించి, కినుక బూనివచ్చిన బండిరక్కసునిఁబట్టి వధించి, మొనసిరేఁగుపండ్లిడిన కాంతకు రతనంబులర్పించి, పనివడిడాసిన తృణావర్తుఁడను పలలాశినిఁద్రుంచి, జననియెదుట గజ్జెలందియలు ఘల్లనిమ్రోయఁ గలాస్యముఁ జేయుచుఁదీరని కౌతూహలమున వేంకటదాసునకు వరంబులొసంగి ప్రోచునీ ॥ బాల్య ॥ 33

## మనోరంజని - చతురశ్రజాతి

**తావకనామజపంబురసజ్ఞా పావనకారణము,కృష్ణా !॥ తావ ॥**

సేవక జనులకు జీవనమై నానావిధ వేదాంతవేద్యమై నానావి పద్వనంబులకు నగ్నియై, భావజపీడానివారణంబగు ॥ తావ ॥

పొంచి గోస్త నీరసాలములఁ బాలించి, సముదంచిత కదళీ కర్జూరముల హసించి, ప్రభవించు కపిత్థేక్షు ఖండములను జయించి, గాలించి దాడి

మీ బీజములను వంచించి, పంచదార నిరసించి గుడమురుచిఁగుంచి తేనె నదలించి వెలింగెడు ॥ తావక ॥

వెన్నమీఁగడల చెన్నుదూఱి దుగ్ధాన్నలడ్డుకంబులను గేరి మేల్, జున్ను పెరుగుసూపములమీఱి తగ, వెన్నియపూపంబులను జీరివాకొన్నవారి వినుచున్నవారిఁ జవిగొన్న వారి విద్వన్నుతులఁజేసి మన్నీంద్రఁజేసి, బన్నములు వాపి, ఎన్నో సుఖములిడు ॥ తావ ॥

జోగులకనుపమ భోగప్రదమై రోగాతురులకు దివ్యౌషధమై, యోగీశ్వరులకుఁ గీర్తనీయమై, భూగీర్వాణాద్యనుష్ఠానమై, వాగీశ్వరులకు, యాగకర్తలకు, రాగరహితులకుఁ ద్యాగశీలురకు మూఁగిన సేగులడంచి మహాకృప, తోఁగని వేంకటదాసునిఁ బ్రోచెడు ॥ తావ ॥ 34

## జయసింధురాగము - జుల్వతాళము

**నన్నుతించెదను రామా ! ॥ జోతలిడి ॥ సన్ను ॥**

మన్నియలమిన్నయని పున్నెముల తిట్టయని, వెన్నుఁడని రక్షితవిపన్నుఁడని మౌనిప్రసన్నుఁడని నిన్ను బుధులెన్నుకొనుచున్నవిని ॥ సన్ను ॥

విరమల్లెవిరులతో వెలయు సంపెగలతో, సరసిజాతములతో సౌగంధికములతో, విరజాజిననలతో విమలకస్తూరితో, వరపటీరములతోఁ బాటలిసుమములతో, సరిదూగి తరుణీనికరముల విరాగిహృ, త్సరసీజముల నిరంతరమును గరంచు భాస్వర తనూసౌరభము ॥ సన్ను ॥

దాంతులైనట్టి ముని తల్లజాశయములకు, నంతక కటాక్షనిభయైన శూర్పనఖకుదు రంతకోపముగల వనాటకామినికి బలవంతుడగు కాళియుని వామలకు నెంతయో, సంతసముగూర్చి ధనవంతులకు మేదినీ, కాంతులకునిర్మల, స్వాంతులకు సుమశరజయంతులకు ధనదజ వసంతులకు సంతతము, వింతగలిగించునీ, సొంత సోయగమునే ॥ సన్ను ॥

శారదఘంనవములతో, శశిమరాళవములతో, క్షీరవారాశితో
శేషసింహములతో, శారదాదేవితో జాహ్నవీజలముతో సౌరభూమిజముతో
జందనగిరిశులతో, జారుతరహీరనీహారశైలములతో, క్షీర కర్పూర ఖర్జూర
చంద్రికలతోఁదారాసమూహ రజతక్షితిధరములతో, హారఫేనములతో,
నైరావతంబుతో, సారెకుసమానమై తోరపుజగముల దీపారుతావక
యశోనారీవిభవమునే ॥ సన్ను ॥

కరివర సమానమగు గమనమును గోటిభాస్కరులతో నీడై ప్రకాశించు కాంతి
మందరన గాభంబైన ధైర్యమున పారమై, పరఁగెడు వదాన్యతా భావము తరంగిణీ
వరసదృక్షంబగు నవార్యగాంభీర్యమును, ధరనుద్ధరించిన నితాంత బలమును
నిశాచర భయంకరమగు విశాల విక్రమముము డింగరు వేంకటాఖ్యునొగిగాచు
కారుణ్యమును ॥ సన్ను ॥ 35

## మలహరిరాగము - త్రిశ్రజాతి

**కనుల కఱవుతీర్పుమయ్య ! కౌసల్యాసుత ! రామా ! ॥ కను ॥**

అనిశము తొలు మినుకులచే, వినుతిగాంచు తనువుజూపి ॥ కను ॥
కవిసిగాధిజాధ్వరంబుఁగాచినట్టి పుణ్యముతో, శివచాపముఁ ద్రుంచి సీతఁ
జేపట్టిన విభవముతోఁ, దొవకంటి శిలారూపముఁ దొలఁగించిన
మహిమముతోఁబవరమునఁ బరశురాముని బలమడఁ చినతేజముతోఁ
, బవినిభ బాణంబులతో, ఛ్ఛవీద్ధ కోదండముతోఁ, గవదొనలిదుకక్షలతో,
సవిధంబున కరుగు దెంచి ॥ కను ॥

మునుశబరి ఫలములు భుజించిన ఘనవాత్సల్యముతో, మొనసి గుహున
కుపగూహనమునొసఁగు సౌశీల్యముతో మునులకు సంతోషమిడిన
ముఖ్యాభయందానముతో, ననుకూలుండగు వనధింగనిన
క్షమాగుణంబుతో, దనుజహరణ సమాఖ్యతో ననిమిష నుతవైఖరితో,
వనచరపాలనవిథితోఁ బనివడి సాక్షాత్కరించి ॥ కను ॥

అరుంధతీ ప్రాణేశ కృతాభిషేక విభవముతో, ధరణిసుతా లక్ష్మణ వాతజాది పరివారముతో, నరసురవానర దిగధీశ్వరాది స్తవంబులతోఁ బరమ పవిత్రాయోధ్యా పరిపాలన నైపుణితోఁ, బరి పరి విధ రుజడలంచి, దురితంబులఁ దొలగించి, వరదుఁడవై వేంకటాఖ్యు పరిసరమునఁ దోఁచి నిలిచి ॥ కను ॥ 36

## హంసధ్వనిరాగము, ఆదితాళము.

సాక్షాత్కరింపుమయ్య ! కృష్ణ దేవ ! ॥ సాక్షా॥

రక్షాపేక్ష దీక్షితులైన ముముక్షు జనములకు నక్షయ సుఖమిడు దక్షుఁడవని కమలాక్షుండవని యధోక్షజుండవని నమ్మినందులకు ॥ సాక్షా ॥

వెన్నఁదిన్న చిన్ననాటివగతో, మిన్ను వెన్నుఁదన్ను లేఁ గౌనుతో, నన్నుమిన్న లెన్ను సోయగముతో, వన్నెఁగన్న తిన్నని వేణువుతోఁ, జెన్నగు గుంజాహారంబులతో, సన్నుతిఁ, గాంచిన శిఖిబర్హముతో, నెన్నరాని బంగరు గజ్జెలతోఁ, గన్న వారు మెచ్చులాస్యంబుతో ॥ సాక్షా ॥

లీలఁ గేలఁ గోలఁ దాల్చు పనితో, వేల యాలఁదోలు నైపుణ్యముతో, బాల కాళినేలు పెత్తనముతో, గోలచాలుమేలమాడుతమితోఁ, గాలమేఘ సుందరవర్ణముతో, నీలోత్పలయుత కర్ణంబులతో, శైలోద్భవధాతు వర్గంబుతో, మ్రోల నిల్చి మందహాసంబుతో ॥ సాక్షా ॥

శ్రీసంయుత బృందావనంబుతో, భాసమానయమునాస్రవంతితో, వాసిఁ గన్న మధురగానంబుతో డాసికొల్చువల్ల వాంగలతో, రాసక్రీడా మహోత్సవముతోఁ, బూసోనఁ గుటియు వేల్పుబారుతో, దోసిలొగ్గి కనునప్సరసలతో దాసు వేంకటాఖ్యు నేలుకృపతో ॥ సాక్షా ॥ 37

## మోహనరాగము -అటతాళము

నీ ప్రభావం బెన్నఁగావశమా? జానకీరామా ॥ నీప్ర॥

సుప్రసిద్ధములైవెలయు, వేద ప్రకరమునకైన నాదిముని ప్రవరులకు నైన సర్వసుర ప్రభూత్తంసులకు నైనను ॥ నీ ॥

ధరాధరములు శల్యములుగా, సరిత్తతిరోమ కూపములుగ, శరధులేడును
పిచండముగా, శరధరములు శిరోజములుగాఁదరణి చంద్రులు
నేత్రములుగాఁ దరుచయంబులు రోమములుగా, ఖరతరానల
మురుక్రుధగా మరుద్దేవుండూరుపులుగా, నిరంతరమును
బరగుచుండెడు ॥ నీప్ర ॥

నలువతొలు కొమరుండుగా, నన విలుకాఁడు పినపట్టిగానుడి చెలువ
కోడలుగాఁ గలుములిడు, పొలఁతి నిజభార్యగాఁ బంటల, వెలఁదియొక
జాయగా మిన్నే, రలఘుపుత్రికగా శ్రుతులు నుతిఁజలుపు వందులుగా,ని
లింపులు, కొలుచుభృత్యులుగా సత్వగుణనిలయుడై యలరారుచుండెడు
॥నీప్ర॥ ఘనాసారం బింద్రియముగాఁ బొనరు దిక్కులు కర్ణములు గాఁ
బెను, రసాతల మజ్జకవగా, మనుజలోకముకటి స్థలిగా, ననిమిషావాసము
గళముగా, వనజభవలోకము శిరముగాఁగనక మురుచేలంబుగాఁ గైకొని
జగత్పాలన మొనర్చెడు ॥ నీప్ర ॥

క్షీరవారిధి మందిరముగా, ఘోరసర్పము శయ్యగా నాగారి వాహనముగా
సహస్రార చక్రంబాయుధముగాఁ, జారుశంఖము బూరగా
విస్తారమాయాబలము సంసృతి, గా రమ్యకృపముక్తిగాఁగొని
కోరివేంకటదాసునేలెడు ॥ నీప్ర ॥ 38

## ముఖారిరాగము - ఆదితాళము.

**గోరులఁగోరిభజింతున్గోపాలకృష్ణ ! నీ ॥ గోరు ॥**

వారిజగంధు లపారమన్మథవికారముతోదరిజేరినపుడు శృం
గారరసామృతపూరములై తద్బారమడంచెడు ॥ గో ॥

కరవాలంబులఁ గాకునేని దుర్ధరశూలముఁబరిహసించి
దుర్భరకుంతంబులఁ బాఱంద్రోలి భిదురాయుధంబును ధూలిచి
కఠోరతరమై వెలయు హిరణ్యకశిపు గురు, తరోరస్సుభీకర శిరస్సు
విస్తరతరస్సు, భాసురమహస్సుగల, శరీరంబుఁ జీల్చి రక్తధారా,
పరంపరలచే విరాజిల్లు నీ ॥ గోరు ॥

భూరిమాధురీ వేణురవశ్రవణారంభముచే స్మరశరతాడితలై రహిడాసిన వల్లవాంగనో దారభావయోగ్యముగఁ గుచంబులఁజేరి సంచరించి, గండములపైరక్తినటించి, కుంతలములారసి ప్రాపించి, కక్షలం, దారూఢివసించి, కూరిన సంతాపముఁ దొలంచి విస్తారానందముఁ గల్పించిన నీ ॥ గోరు ॥

పోటయైన మువ్వంకల చెల్వకు, సాటిలేని సౌందర్యమిచ్చి యే పూటవచ్చునో కృష్ణుండని యారాటమొందుచుండ నొక్క నాడా, బోటి యిల్లుసొచ్చి, సొంపగు మాటలఁ జనువిచ్చి, సురతమిడు నీ టెక్కును మెచ్చి, పుష్పశరపాటవమున హెచ్చి జోటికురులు సిక్కుదీసి చెక్కులనాటి యాటలాడి మేటిచాచులగాటపుఁ జందురు కూనలుంచు నీ ॥ గోరు ॥

మొగలిరేకులనునగినగిరిక్కల, సొగసెంతని నిరసించి మించి యా, మగటా పలుకుల జిగిదూటి నిగన్నిగ యను కాంతులక గారంబులై, నిగమ స్తుత్యములైవేంకటాఖ్యు నిజహృ త్తిమిరమడంచి వెలింగెదు॥గోరు॥ 39

## కాంభోజిరాగము - అటతాళము

**కనంబడవేలా ॥ వేణుగోపాలా ॥ కనం ॥**

కనులుమూసిన విచ్చిననునా, మనము నీ యౌవనము చక్కందనము ప్రాభవ ఘనవము కనకవననము వాంఛించును గదా లోచనయుగమునకుఁ ॥ గనం ॥

వరత్రి విక్రమరూపమొందియు, విరించాండముఁ గొలుచుతఱినీ, చరణసరసిజ విభవమెంచక, నరశరీరములందుఁ బశువానర ఖగంబులయందుఁ గీటకతరు సమూహమునందుఁ బన్నగ గిరి వనంబులయందు మోపి స,కరముగా దురితములఁ దూలిచి, పరమపద మొనఁగూర్చినట్టివితరణఖనివని సన్నుతించినఁ ॥ గనం ॥

శ్రీరఘూత్తముఁ డైనపుడు యదువీరుఁడై జన్మించినప్పుడు కోరువారికిఁ గోరఁజాలని జారులకుఁ జోరులకు మనుజా,హోరులకు బోయలకు

వివి,ధా,హారులకు మెయిదాల్చి పొలిచెదు, వారలకు నగపడిన తావక,
నీరదాంగముతోడనిప్పుడు ॥ కనం ॥
సారమేయుము గారవించి యు,పారకృపతో నుడుతనేలి వి,
చారమొందిన గ్రద్దనేలి వికారతనులగు వానరుల కుపకారములు
గావించి మందకుఁ జేరి గోపార్భకులతో నొయ్యారమునఁ గ్రీడించి
మాహో,భూరుహములకు వనచరములకు, దార రూపముజూపి
వేంకటదాసుఁడెన్నోగతుల వేడినఁ ॥ గనం ॥ 40

## శంకరాభరణము - ఆదితాళము

కొనియాడెదరామా, రఘుకులవారధిసోమా నినునేఁ ॥గొని॥
గొనబగు నీపదవనజంబులు పా,వన ప్రపదములు మడమలు నంగుళు,
లునఖంబులు ఘుటికాజంఘము చ, క్కనిజానువులూరు శ్రోణులు కటి,
వనజాసనుఁ గన్న నాభి వివరము, వనజభవాండములో ముపిచందము,
స్తనములు స్తనచూచుకము లనిశమునుఁ ॥ గొని ॥
కరము మణిసరోత్కరము సిరి నిరంతరము గల భుజాంతరము
కంబుకంధరము రసజ్ఞాధరము లాస్యగహ్వరము నాసావివరమును
నురదప్రకరము మధ్యతనుతరము పాణులాదరమునమోడిచి శిరము
వంచి నేఁ ॥ గొని ॥
పీలు తుండమునుఁ బోలు బాహులు విశాలనేత్రములు తామరరేకుల,
నేలు వ్రేళ్లు తారాసన్నిభ నఖజాలము ముకురాభక పోలంబులు,
భ్రూలతాద్వయము వీనులు మూర్ధము, నీల వాలములు
వేంకటదాసుని, పాలఁగలిగి ప్రోచు వాత్సల్యమును ఫాలము పదతల
కరతలంబులుఁ ॥ గొని ॥ 41

## కమాచిరాగము - ఆదితాళము.

నీకల్యాణగుణంబులెన్నఁదరమా? నీరజాతదళలోచన రావ॥ నీక ॥
శ్రీకరంబులై భవబంధ వినాశాకరంబులై మహాపండిత, స్వీకృతంబులై శుద్ధస్ఫటిక సమాకారములై వెలుంగుచుండెడు ॥ నీక ॥ శౌర్యముచే దుష్టులవధించి యౌదార్యముచే మార్గణులనేలి గాంభీర్యముచే వార్ధుల జయించి గురు, ధైర్యముచేత హృషీకేశుఁడవై, స్థైర్యముచేఁ జాపలముఁ గెల్చి చాతుర్యముచేఁ గామినులనేలి యనివార్యమహిమచేఁ దనరారుచుండు ॥ నీక ॥
కారుణ్యముచే నార్తులశక్తి సమారోపముచే నశక్తులను విస్తారక్షమచే సాపరాధుల నవారిత వాత్సల్యముచే దోషులఁ బూరితసౌశీల్యముచే నీచుల భూరితరార్జముచే గుటిలులనుఁ జేరఁదీసి సారెకు రక్షించెడు ॥ నీక ॥
బలముచేత దుర్బలులను సంవిద్బలము చేత నజ్ఞానులనైశ్వర్యలబ్ధిచే బ్రహ్మాదుల సౌలభ్యలాభమున దర్శనలాలసులను లలిసామ్యముచే సర్వ శరీరుల, విలసన్మార్దవ వృద్ధిచే సదా కలిసియుండు విశ్లేషభీరువుల, లలితమాధురీ ప్రసారంబుచేఁ, దొలగక సేవింపుచుండు పుణ్యుల, నెలమిం బ్రోచుచు వేంకటదాసుని, కొలల దంచి వాంఛితార్థంబు లిడు ॥ నీక ॥

42

## సురటరాగము - మిశ్రజాతి.

దేవదేవ జగన్నివాసహరీ ! ॥ సరసీజలోచన ! ॥ దేవ ॥
కేవలము నిన్నే విమలమగు, భావమున సేవించువారల, కే వరంబులనైననిత్తువు, పావనాకారా ! నిర్మల సేవకోద్ధారా ! సద్గుణసేవధీ రారా ! ముక్తికిఁద్రోవ నీవేరా ! జగద్ధిత ! ॥ దేవ ॥
కలుములకుఁ దొలునిలయమ్మైలలి వెలయు నిందిర కొలుచు నీపద, జలజలములు ప్రాఁబలుకులకు మునితిలకులకు సురకులములకుమా, తలఁపులకు లిబ్బులై యున్నవి, జరధరాభాంగాఁ కరుణా విలసితాపాంగా !దుష్కృత జలజమాతంగా ! పరాత్పర ! ॥ దేవ ॥

ధారుణికి వాతానలములకు, నీరములకు నభంబునకు నక్షత్రాలకు
నాధారమీవేరా, సంసారవారిధిఁ, జేరువారల కోడయగు ధీరా ! నీదు
ప్రభావములారయంగల వారలున్నారా ? వరవేంకటాఖ్యుని కోరికలు
నెఱవేర్చురఘువీరా ! భూభార సంహార ! ॥ దేవ ॥ 43

# గద్యము

ఇది శ్రీ సీతావల్లభ ప్రసాద సమాసాదిత కవితాప్రవీణ వేదాల
సీతారామాచార్యకృపాలబ్ధమంత్ర రత్నాను సంధాన పవి
త్రాంతరంగ నిఖిలదుర్మత శిలోచ్చయ దంభోళీభూత
సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహబోధిత విశిష్టా
ద్వైతరహస్యార్థ ధురంధర శఠగోపయతిరాడ్వ
రవరయోగిప్రభృతి పూర్వాచార్య చరణ
సరోజ భ్రమరాయమాన మొవ్వ వంశ
తిలక కృష్ణాంబాకృష్ణమార్య తనూజ
శ్రీ వైష్ణవ విధేయ వేంకటదాస
నామధేయ ప్రణీతంబైన
భాగవత సురభూజము
నందు ప్రథమా
శ్వాసము
సంపూర్ణము.





1. శ్రీ మొవ్వ కృష్ణప్రసాదుగారు
2. శ్రీ మొవ్వ అలమేలు మంగతాయారు
3. మొవ్వ మనోహరు
4. మొవ్వ కంజాసని
5. శ్రీమతి నీళాదేవి
6. పూషడపు శ్రీనివాసరావు (జామాత)

శ్రీమతే రామానుజాయనమః

# భాగవతసురభూజము

## ద్వితీయ భాగము

## నవరోజురాగము - ఆదితాళము

శ్రీరామా ! యనఁదీరిక లేదట చిత్రమునూడండి ॥ శ్రీరా ॥

సారాయి దుకాణముల కేగుటకు, సజ్జనాళి నెగతాళి చేయుటకుఁ, బోరాటములకుఁ గాలు ద్రవ్వుటకు, బొరుగిరుగిండ్లకు బోయి తిరుగుటకు జార చోర కృత్యము లొనర్చుటకుఁ దీరుచుండుఁగాని క్రూరాత్ములకు ॥ శ్రీరా ॥

పరస్త్రీల వర్ణనము సేయుటకు, బచ్చీసులు జూదంబు లాడుటకుఁ బెరవారల దోషంబు లెన్నుటకు, హరిదాసులఁ గని పరిహసించుటకు, నిరుపేదల నిలువెడలఁ గొట్టుటకుఁ బరలోకము లేదని వచించుటకుఁదెరువులలో ముంద్లుగొట్టుటకు బలు, తీరిక సమకూరుచుండునకటా ! ॥ శ్రీరా ॥

పోతురాజు కెను బోతు లిచ్చుటకుఁ, బోలేరమ్మకు ముడుపుఁగట్టుటకు జాతరలో గంతులు వేయుటకుఁ గిరాతుల గతి జంతువులఁ జంపుటకు మాతాపితలను గాఱులాడుటకుఁ,గోతులగతి నిటునటులు దిరుగుటకు, లాతివారి యైశ్వర్యముఁ గని యెన్నో తీరుల నేడ్చుటకునుఁ బౌత్రుల, మూతులు ముక్కులు చేతులు గడుగుట కై తీరుఁగాని పాతక జనులకు ॥ శ్రీరా ॥

నాటకములు కంపెనీల్చూచుటకుఁ బాటిదప్పి చెడుమాటలాడుటకుఁ, బసిపిల్ల నెత్తి లాలించుటకుఁ బూట పూట దీరుఁగానియఘములు, గోటమీటి వేంకటాఖ్యునేలిన, కైటభారి భక్తులు బోధించెడు, మాటలెల్లఁ జెవినాటునట్లువిని ॥ శ్రీరా ॥

## ఆనందభైరవి - అటతాళము

వింతవింత గఁదోఁచునోయన్నా ॥ యీ నరశరీరము ॥ సొంతమెవ్వరికైన లేదన్నా ॥ యింతగాఁబ్రేమించు దేహము సొంతమెవ్వరికైనలేదు సుఖింతమని జీవింపఁగోరెడు నంతలో గండములు పెక్కులు, దంతి తొండము తోడఁ జీల్చును, దుంత కొమ్ములతోఁ బొడచు రవ్వంతలోఁ బులిపట్టి తిను గోరంత చీమలు గఱచునోయన్నా !పాములు తేళ్లు బల,వంతముగఁగా టందునోయన్నా !తలలోని పేలు దురంత బాధలుపరచునోయన్నా ! జలమందు జలగలు, కొంతరక్తము పీల్చునోయన్నా ! యింత మాత్రమె కాదు తొమ్మిది కంతలకు ద్వాదశమలములకుఁ గుంతయై పుర్వులకు నెల్లని శాంతమైయున్నదీదేహం బెంత గడిగిన ముఱికికంపె ॥ నొక్కి వక్కాణించెదను వేఱొక్కమాట వినుండు దేహము, సిక్కుచుండును బలియుచుండును, కుక్కకందిన గఱచునోయన్నా, యెలుకలును బందికొక్కులును పైఁబడిపీఁకుననన్నా, సింహమున కందిన నొక్కత్రుటిలోఁ జంపునిజమన్నా ! దొంగలకుఁ జిక్కినఁ గక్కసముఁ గలిగింతురోయన్నా ! కోఁతులు నెలుంగులు మొక్కలముఁ గలిగించునోయన్నా ! మఱపొంది నిప్పులు ద్రొక్కినంతటఁ గాల్చు నోయన్నా ! పెక్కు రోగములంటుకొని దిగఁద్రొక్కుచుండును పుట్టువ్రణముల, లెక్క పెట్టుట కెవ్వడోపును రొక్కముండినసేమి లాభము ? ॥ వింత ॥

కొందఱీజగమందు మిక్కిలి సౌందర్యవంతుల మటంచును, మందమతులై దేహమున కానందమునఁ బూసరులు జుట్టి, చందనాదులు బూతురోయన్నా ! సంపెంగ నూనెలలందుటకు యత్నింతురోయన్నా

వెలగలుగు వస్త్రములందుకొని ధరియింతురోయన్నా ! మేలైన తిండికి విందులకుఁ గాంక్షింతురోయన్నా ! నాసాటివారొకరుందురా ? యనుచుందురోయన్నా ! ముందు వెనుకలు పాఱఁజూడక సుందరాంగుల మనెడు వారల, యందు నెత్తురు మలము మూత్రము చిందుచున్నది చీము చీమిడి ॥ వింత ॥

పూనిబ్రతికిన యంతకాలంబైన భోగములందుటకు వీలౌననుచుఁ దలపోయరాదు సుమా ! నరుల కెన్నెన్ని బాధ లనూనమై పడఁ ద్రోయునో యన్నా ! దొరతనము వారలచే నలఁగుఁడదండగవలె నన్నా ! అప్పిచ్చువారలు, పైనఁ బడి గద్దింతురో యన్నా ! వార్ధక్యదశ దాపైనచో బలు రోఁత సుమ్మన్నా, దార్ఢ్యంబు దప్పినచో నీకు నెవ్వారు గారన్నా ! కాఁపురములో ధనహీనమై తే బ్రతుకులేదన్నా ! కాన వేంకట దాస హృదయాధీనుడై వెలుగొందు రాముని, మానసంబున నమ్మికొల్చి, ప్రధానసౌఖ్యము జెందుటొప్పును ॥ వింత ॥ 45

## ఆనందభైరవి - అటతాళము

ఎన్నటికి సౌఖ్యంబు లేదయ్యా ! సంసారవారిధి నీదుటకు శక్యంబుగాదయ్యా ! ॥ పున్నెమును పాపంబుఁ జేయుచు, నెన్నరాని భవంబు లొందుచు, ఖిన్నులై నరకమున కేగుచుఁ, గొన్నినాళ్ళకు స్వర్గమేగుదు ॥ రెన్న ॥

చండబాణములేయు సుమకోదండు దాడికిఁ దాళలేక మగండు పెండ్లము గలియఁగోమలి, నిండు బ్రేఁకటిదాల్పుఁగా జీవుండు కడుపునఁ జేరునో యన్నా ! యాగర్భమందున నుండు వెతలిన్నిన్నిగావన్నా ! మలమూత్రపూరిత భాండమని యోజింపఁ దగునన్నా ! గాఢాంధకారము మెండుకొని త్రోవెఱుఁగరాదన్నా ! భయపడి దేహియిందుండ లేనని మొఱలిడుసుమన్నా ! దాసోహమని బ్రహ్మాండనాథునిఁ దలఁచు నిజమన్నా,

కడచన్నఘుగ్రమము లొండురెండని యొంచునోయన్నా ! యిన్నాళ్ళకీ(క
నిందుండి బైటకిcబోదుననునన్నా ! నిండునెలలైనంతతోడనె పుండువోలిన
మూత్రద్వారము గుండc బురుగు విధానcబడు భూమండలంబునc
బిండమగుచును ॥ ఎన్న ॥

చాలు నీగర్భం బనెడు చెఱసాల దాcటితి భయము లేదన, వీలుగా
దెటువంటివారికి, బాలుcడై మంచముననుండిన కాలమందున వెతలు
గలవన్నా ! క్షుద్దాహములచే సోలియునుc జెప్పంగలేcడన్నా !
మశకాదులును పై వ్రాలినప్పుడు దోల లేదన్నా ! కండూతి గల్గినవేళ
గోకికొనంగలేడన్నా ! వివిధ గ్రహంబుల పాలగుచు శోకించు
నిజమన్నా ! తన కోర్కులితరుల వ్రోలc దెల్పcగcజాల డోయన్నా!
మలమూత్రములలోcదేలియాడుచు నుండవలెనన్నా ! పెరవారి
దయకనుకూలముగ వర్తింపవలెనన్నా ! ఈ లీల నటియించి,
ప్రాయంపు చాలినంతట స్వతంత్రుండై, పాలువాలక
యాటపాటలలోలుcడై చరియింపుచుండును ॥ నెన్న ॥

మంచి జవ్వనమబ్బినపుడు మదించి కామక్రోధములచే, మించి
శాస్త్రశ్రవణమును వర్జించి పెద్దలమాటc బెడచెవి నుంచి కాంతలc
గాంచునోయన్నా ! యిcక నేమి చెప్పుదు నంచవిల్తుని బారిబడునన్నా
! సొమ్మెంతయైన గడించి లంజెలకిచ్చునోయన్నా ! సత్కథలు సెప్పిన
నించుకయు నాలించcబోడన్నా ! సిగ్గేదియును రాత్రించరుండై మెలc
గునోయన్నా ! పుణ్యంబు పాపంబంచుc జెప్పిన నమ్మcబోడన్నా !
పరలోక మెవ్వరు కాంచివచ్చిరొ చెప్పుమను నన్నా ! భగవంతు
నిటుసూపింపుమని వాదించునోయాన్నా ! మనవంటివారె రచించిరీ
గ్రంథములననునన్నా ! మించిపోయెను ప్రాయమనియొక, మించు
బోcడినిc బెండ్లియాడి రమించి కూతులc గొడుకులనుc బుట్టించి
తను దాcదెలియనేరడు ॥ ఎన్న ॥

పెద్దకొడుకుకుఁ జదువు లేదని, పెద్దకూతురి మగడు లేడని, ముద్దుపట్టికి మనువు రాదని, యొద్దలేడా నడిమికొడుకని, రద్దిఁదెచ్చెను చిన్నకొడుకుని, తద్దినమునకు డబ్బులేదని, యెద్దు ముందఱ మేఁతలేదని, కొద్దిపడె ద్రవ్యంబు నాకని, సుద్దులే పల్కును నరుండన్నా ! ధనమునకు నా తో నుద్ది యెవఁడని పల్కునొకఁడన్నా ! ఈ ఏటితోనే, దిద్దివేసెద నప్పులనునన్నా ! పెండ్లాము సెప్పిన హద్దులో నిలుచుండునోయన్నా ! కోడండ్రు దెప్పిన సద్దుసేయక దాగునోయన్నా ! డాబాలు మేడలు మిద్దెలను గట్టించు నిజమన్నా ! యాచకులఁగాంచిన గద్దరింపుచుఁబైనఁబడునన్నా ! ఎద్ది నిత్యమొ ? యేదిసత్యమొ ? యెద్ది క్షణభంగురమొ ? తెలియక, మొద్దురీతిన్ నిలిచి వృధగాఁ బ్రొద్దుపుచ్చుచుఁజెడుదురయ్యో ॥ యెన్న ॥

అబ్బురపుఁ గాఁపురముఁగని పెల్లుబ్బుచుండఁగ ముసలితనమొక, బెబ్బులిన్ఁబలె బైనఁబడ దబ్బిబ్బుజెందెద రెంతవారును, జబ్బులెన్నో గల్గునిజమన్నా ! తన మానసంబున నిబ్బరంబను మాట లేదన్నా ! యెవరేది చెప్పిన, గొబ్బునను వినిపించరాదన్నా, కనుచూపు నిల్వదు యుబ్బసము కనిపించునోయన్నా ! సద్బోధలత్తటి నబ్బనేరవు చిత్తమునకన్నా ! తానెంత బడలిన డబ్బుపై నాసను విడువడన్నా ! గబ్బుగల సంసృతి విడువ డబ్బబ్బ వేంకటదాసునేలిన, లిబ్బిలేమమగని భజించిన నబ్బు నిహపరసౌఖ్యములుగా ॥కెన్న ॥ 46

## బేయాగ్ రాగము - ఆదితాళము

**రావు మీ వెంట, మానవులారా ! లౌకికభోగంబులు ॥ రావు ॥**

పావనమగు నరదేహముఁ జెందియు బ్రహ్మజ్ఞానమెఱుంగలేక నానావిధపాపములాచరించి చెడుత్రోవల మూఢత్వమునఁ జరించిన ॥రావు ॥

మంచి వస్త్రములు పఱపులు దిండులు మందసములు బోషాణములు
నగలు కంచరసామానులు ధనంబు గల, సంచులు జముకాణములు
త్రివాసీ, ల్కాంచనరత్నము లెన్ని కూర్చినను ॥ రావు ॥

ఎనుములు గుఱ్ఱము లేనుఁగు లావులు నెనుబోతులు గొఱ్ఱెలొంటెలెద్దులు,
ననువగు మేకలు కంచర గాడిదెలును వరాహవులు
చరణాయుధంబు,లునుఁబరలోకం బేగెడు దినమున ॥ రావు ॥

సెనగలు జొన్నలు రాగులు పొగాకు, మినుములు కుసుమలు పెసలు
మొలకొలుకు,లనుములు పచారుదినుసులాముదాల్ జనుములు మిరపలు
చెఱకుతోటఁలును, ధనియాలిచ్చోట నెయుండుఁ గాని ॥ రావు ॥

పిల్లలకోసము పెండ్లాము కొఱకు, మొల్లముఁగూరిచి బల్లిదుఁడని
జనులెల్లవేఁడగాఁ బెల్లుబ్బున గట్టించిన ప్రహరీల్, మిల్లులు
మేడలుకొట్టుగిట్లు బలు మిద్దెలు గద్దెలు చప్పరములు చావళ్ళు బండ్లు
మోటార్లందలములు ॥ రావు ॥

శరీరమే జీవుండనియెంచి, పరలోకము లేదని వాదించి, నిరుపేదల
నెల్లపుడేడ్పించి, బరవసమున సాధుల వంచించి, శరీరావసానమునఁ
గా లకింకరులు వచ్చి పదరా! యని మెడపైఁ, గరములుంచి నెట్టుచుండ
భయమునఁ, బరిపరివిధముల దుఃఖించునాడు ॥ రావు ॥

జ్ఞానానుష్ఠానంబులు గలవాఁడై నటించు సద్గురు జేరి తదభి
మానాంతర్భూతుండై సుగుణము, లూనిసంతతము వేంకట దాసాధీనుఁ
డైన రాముని పాదాబ్జ ధ్యామొనర్చిన మేలగుంగాని ॥ రావు ॥ 47

## కళ్యాణిరాగము - చతురశ్రజాతి

**నిలువదీతనువు, ప్రారబ్ధము దీఱిన క్షణకాలమైన ॥ నిలు ॥**

పలువగలగుసబ్బులతో రుద్ది, చలువగింటెముల తోఁదడియద్ది,
చలికాలము పచ్చడాల్గప్పివేసఁగిలో వింజామరలన్ విసరిన ॥ నిలు ॥

గొడుగులు చెప్పులు చొక్కాలుబ్బాడుసు, లడరెడు సిలుకులు పట్టుశాలువలు, కడుమెత్తని బాలీసులు పఱపులు పొడవగు బాగాల్విడివిడి దోవతులొడc గూరిచి నిలుకడతోc బోషణc గావింపుచున్న ॥ నిలు ॥

పంచదార కలకండయు మైసూర్పాకము జిలేబి లడ్డు కాఫీ టీ, పంచభక్ష్యములు పరమాన్నము పాల్ మంచి పెరుగు నేయి మాంసములు తినిపించి పెంచి బలిపించినప్పటికి ॥ నిలు ॥ సారాయము కల్లు భంగియును ద్రాక్షారసంబు చక్కెర కేళీల్పొలుపారుపప్పు దప్పళములు కమ్మని, కూరలప్పడంబులు నూరుగాయ, లూరుబిండ్లు మామిడిపండ్లెన్నో, తీరులనిడి పోషణ మొనరించిన ॥ నిలువ ॥

పూనూనెయు మంచి గంద మత్తరు పునుcగు పచ్చగంబూ రయుc గస్తురి, మానితమగు పూలదండ లద్భుతమైన రీతి ధరియించి మరాళయానలతో భోగింపుచుండినను ॥ నిలువ ॥ వాసిగ వేంకటదాసునేలి కరుణా సముద్రుc డై భాసిల్లు కనకవాసుని పాదము లాసించిననే మోసము లేక మహాసుఖ మొదవుసుమా సతమను హరిదాసులబోధల నీసడించి సంసారములోc బడి గ్రాసమిచ్చి పోషించినప్పటికి ॥ నిలువ ॥ 48

## సావేరి రాగము - ఆదితాళము

**మనుజులేనా ? ॥ పుట్టినవారందఱు ॥ మను ॥**

తనువే జీవంబని భార్యానందనులే రక్షకులని ద్రవ్యముకంటెను బురుషార్థములేదని పాపముc లనవతరతము చేసిన వారందఱు ॥ మను ॥

జననిగర్భమందు నుండునప్పుడు, జననమొంది పాలు ద్రాపునప్పుడు, తనువు మఱచి నిద్రవోవునప్పుడు, ఘనమగు నాహారముcగొను నప్పుడు, తినినవెల్ల జీర్ణంబగు నప్పుడు తనపాలిట నెవcడు నిల్చి కాపాడెనో విచారింపక దేవుcడు లేcడని వాదించెడు శునక ప్రాయులు ॥ మను ॥

గాలియెట్లు వీచుచుండెనూ యీ, నేలయెట్లు పంటలిచ్చునో జల, దాళులెట్లు వానగురియునో శశి, హేళులెట్లు వెల్గుచుండిరో ఫల, మూలజలము లాక నమంభోనిధు, లేలీల జనించెను దీనికి నాకమూల పురుషుఁడుండి తీరవలెనని, యాలోచింపని బాలిశులందఱు ॥ మను ॥

పున్నెముచే స్వర్గము పాపముచే, నెన్నరాని నరకము రెండుగలిసి, యున్న మర్త్యలోకము రెండుఁబాసి, చన్నముక్తిగల్గునంచు శాస్త్రము, లన్ని చెప్పుచుండ లెక్కచేయక, నన్ను మించుమిన్న లీజగతిలోనున్నా రా ? యను దురాత్ములందఱు ॥ మను ॥ భూతజాలమెట్లు పుట్టుచున్నదా ! యే తీరును వృద్ధినొందుచున్నదొ ? నాతులు పురుషులన నెట్టులైరో ? ప్రీతి పరస్పరమెటు లేర్పడియెనొ ? ' జాతి నీతులేరీతి జనించెనో? రాతిరి పవలనఁగ నెట్టు లొప్పెనొ ? నేత వీని కన్నిటికై సంతత, మాతతదయ వేంకటాఖ్యునేలిన, సీతా విభుఁడెంతటి వాఁడాయని, చేతస్సున నారయని నికృష్టులు ॥ మను ॥ 49

## ఖరహర ప్రియరాగము - ఆదితాళము

వాఁడేజగదీశుఁడు బ్రహ్మాండములేలిన ॥ వాఁడే ॥

లేఁడని కొందఱు పరమాత్ముండున్నాఁడా ? యని కొందఱు కనుఁగొనుడు, న్నాఁడని కొందఱు పలకఁగ మఱుమాటాడక తన్ను భజించు ధీరులకుఁ, దోడై నీడై వేడుకఁగూర్చెడు ॥ వాఁడే ॥

కురంగమునఁ గస్తూరిపిల్లియందు రమ్యమగు జవ్వాది బురదయందు రాజీవము సింహమునందున బరాక్రమము పులియందున శౌర్యము, తురంగంబునందున జవంబు సింధురంబునందు మదంబు గోవులందు రుచిరమగు దుగ్ధంబునుంచిసు స్థిరనైపుణ్యము గడించి మెలఁగెడు ॥ వాఁడే ॥

కీరములకు భాషించు శక్తి మధురారవంబు కోకిలంబులకు మయూరములకుఁ జిత్రవర్ణంబు ఝుం,కారధ్వని భృంగములకు నీర,క్షీర విభాగజ్ఞాన మంచలకుఁ, బూరసంబుఁ దెచ్చి తెట్టెగా సమకూరుచు పని నీగలకు నడుసులోఁజేరి యంటకుండ సంచరించెడు, నేరుపుఁ గుమ్మరపుర్వులకిచ్చిన ॥ వాఁడే ॥

వాకల కతిప్రవాహంబును నీ రాకరంబులకు గాంభీర్యము విను వాఁకకుఁ ద్రిలోక సంచారము దర్వీకరంబులకు గరళము కాఠన్యాకారము కొండలకు జగత్ప్రాణాకారము వాయుదేవునకును ష్ణాకారంబగ్ని హోత్రునకు శైత్యాకారము నీరములకు నవకాశాకారము పుష్కరంబునకు వహనాకారము భూదేవి కొసంగిన ॥ వాఁడే ॥

పిడుగులు మించులు దుర్భిక్షంబులు, కడువానలు గాలివానలుప్పెన, చెడుమారీస్ఫోటకములు యుద్ధము, కలుడుగని చలి జ్వరము లతిశైత్యము, వడగాల్పులు నుమ్మదములు పొడమిన,యెడ శరీరులనుఁ గాపాడుచు నిత్యుఁడై వేంకటాఖ్యునాదరించెడు ॥ వాఁడే ॥ 50

## నటభైరవి - ఆదితాళము

**వాఁడురక్షకుండు-జీవులకెల్లను నారాయణుఁడను ॥ వాఁడు ॥**

వేడుకతో నీవాఁడననుచుఁ గొని,యాడిన దేహికిఁ దోఁడై చల్లనినీడై ప్రోచెడు ॥ వాఁడు ॥

ధనముల కధి దేవతయగు లక్ష్మికి, ఘనధాన్యప్రదయగు భూదేవికిఁ బెనిమిటియై భారతికి మామయై, మినుకు లోమి తొలి వేల్పున కొసఁగిన ॥ వాఁడు ॥

శరీరములు జీవులకిడు బ్రహ్మకుఁ, దరుణీ పురుషులఁగూర్చు మదనునకు, దురితము లూడ్చువియన్నదికి నిరంతరము జనకుఁడై పురుషోత్తముఁడై సరసిజాక్షుఁడై, వరములొసంగెడు ॥ వాఁడు ॥

శ్రీమంతంబగు దుగ్ధవార్ధిలోఁ, గామధేనువునుఁగల్పకమునుఁ జింతామణి
నర్థులకై సృజించి వివి, ధామయనాశంబునకు నౌషధ, స్తోమముతో
ధన్వంతరి నమరిచి, వైమానికుల కమృతమొసంగిన ॥ వాఁడు॥
విషధరాధిపతిపైఁబవ్వళించి, విషధరారి వాహనుఁడై ప్రావృడ్విషధర
వర్ణాకృతితో వెలయుచు, విశోపమములై వేంకటదాసుని, విషాదింపఁ
జేయు దుర్గుణముల నిమిషకాలంబునఁదొలంగించి రవి,
తుషారకరలోచనుఁడై వెలుంగు ॥వాఁడు॥

51

## మలహరిరాగము - ఆదితాళము

**బేలతనము గాదా ? మనుజులకు ॥ బేల ॥**

కాలచక్రమునుఁ బోలిన వడిగల, దీలోకంబున లేదెద్దియు బ్రతిమాలిన
నిల్వదటుండగ నెంతో, కాలము జీవించెదమని యత్నము లీలోకము
నందునఁగావించుట ॥ బేల ॥

కొడుకులఁబౌత్రులఁదొడుకులఁతోఁటల వడిగల యెద్దులఁ
బంటభూములనుఁ, బడఁతులమేడల బహువిత్తంబులఁ, గడుముదమునఁ
గాంచి పొంగుచుండఁగ, నొడలిలోన జీవంబులేచియెక్కడికేగునో ?
తెలియరాదహోహో ॥ బేల ॥

అదుగో బాల్యం బిదె కౌమారం, బిదె యౌవనమను హదనువోయి,
వార్ధక్యము దాపైనదియని కుందఁగఁగదియును మరణం బిది యోజింపక
మదమత్తులౌట ॥ బేల ॥

సంతకుఁజేరినవారందఱొక, చక్కిఁజేరి యెడఁబాసినకైవడిఁ, గాంతా
పురుషులు బాంధవజనములు, సంతానములొక యింటఁజేరి ప్రేమింతు
రొకరినొక్కరు సంబంధం, బంతమొందినంతనెవ్వరికి వారరుగుటఁ
దెలియక చరింతురు భళీ ॥ బేల ॥

దినములు రథచక్రగతిఁ దిరుగును తనువు నీటిబుగ్గవలెఁగృశించును, మనమా చంచలమై చెడిపోవును, పనుల కంతముండదు కోరికలా, పెనుపుఁగాంచు నొక్కటి నెఱవేఱదు ॥ బేల ॥

ఈ పూఁటవాఁడు రేపుండదు మఱి, రేపుండినవాఁడాపైఁగనరా, డీపనిఁ గని దుర్వ్యాపారంబుల, నాపివైచి వేంకటాఖ్యనేలిన, శ్రీపతిపదము లదేపనిగా మదిలోపలఁదలంచి, పాపములఁద్రుంచి, యాపదలడంచి, కాపాడు ముక్తికై, పాటు వడరు ॥ బేల ॥ 52

## రాగవర్ధని - ఆదితాళము

ఎన్నాళ్ళీభోగములు ? నరులారా ! భువిపై ॥ నెన్నా ॥

తిన్నవస్తువులె తినితినిని రతముఁ, గన్నవానినే కాంచి కాంచి కై కొన్నవానిఁ గైకొని పలుమాఱు, విన్నమాటలే విని విని మఱి విసు గన్నమాట సున్నఁ జేసి తమతో, మన్నవారు చిన్న వారెచటికో, చన్నఁజూచి పున్నెమని పాపమని, యెన్న లేని వన్నె కాంద్రకాహా ॥ యెన్నా ॥

చిననాడో కౌమారమందొ? యౌవనమునందొ? వార్ధక్యమునందో? వనమునందొ? నీటియందొ? ఘనపత్తనమునందొ? పల్లె యందొ ? తనదను కొనెడు తనువువీడి జీవుండు, వేచనుచుండుట నైజంబైయున్నది ॥ యెన్నా ॥

ముల్లోకముల జయించిన శూరులు, నెల్ల శాస్త్రములు నేర్చిన ధీరులు, బల్లిదులై ధరనేలిన రాజులు, మల్లయుద్ధ మొనరించిన దిట్టలు, పొల్లుపోనిమహిమఁగన్న యోగులు, మొల్లమొసఁగి కీర్తిఁగాంచు దాతలు, సెల్లినారు వేంకటాఖ్యునేలు ప్రఫుల్లపద్మలోచనునిఁ దలంపక, కల్లలాడి జీవింపుచు శాస్త్రము లొల్లని పామరజన నిచయంబుల ॥ కెన్నాళ్ళీ ॥ 53

# చక్రవాకము - ఆదితాళము

**వాఁడు దుర్జనుండు ॥శ్రీహరి మహిమగనని॥ వాఁడు ॥**

బాడబాన్వయంబున జన్మించిన, వేదుక వేదములెల్లఁ బఠించినఁ, బోడిమిత్తో శాస్త్రంబులు సదివినఁ గీడొనఁ గూరుచు వ్యాజ్యంబుల మొనగాడీ తండన్ను వెల్లడిఁ గాంచిన, లేడు దేవుఁడని పుణ్యము లేదని, కూడని మాటలన్నాడి యనేకులఁ, బాడుసేసి నరకంబున కేగెడు ॥ వాఁడు ॥

జీవులు దినదిన మెచటనుండి యిత్తావున కరుదెంచి పుట్టుచుండిరా ? చావగానె యెచ్చటికేగుదురో ? చావంగోరి యపథ్యమొనర్చినఁ, జావరెందుకో కొంతమంది నానావిధంబులగు మందులు దినినను, పోవవెందుకో రోగములీగతిఁ, గావించుటకొక పరమేశ్వరుండు, దేవదేవుఁ డున్నాడని తెలియని ॥ వాఁడు ॥

పెక్కుమంది భార్యలు గలిగినవాఁ, డొక్కసుతునిఁగననేరడు సూనులు , పిక్కటిల్లుదురు బక్కపడంతికి, నొక్కి నొక్కిపాఠము సదివినరా, దొక్కని నాల్కకు విన్నమాత్రమున, నెక్కొనును విద్య లొక్కని మనమున, మిక్కిలి పనులొనరించిన రొక్కము, చిక్కదొక్కనికి మాటలతోనే, దక్కునొక్కనికి బహుళాదాయం బిక్కతమే ? మని యాలోచింపని ॥ వాఁడు ॥

చెడవలెనని పని చేయ డొకఁడు సుఖ,పడవలెనని కావించిన పనియం, దుడుగని భయములు పొడముచుండునవి, విడిచినఁదొలఁగవు కుడిచిన దరుగదు, పడిన నిద్ర సొప్పడదు వర్షములు, పడ వొకతటి నెక్కుడుగాఁ గురియును, సుడియదుగాడ్పొక తడవ వడలచే, నడరుచుండు నిటు లొడఁగూరుచు నా, ధుఁడు వేంకటాఖ్యు నేలెడు హరి యని, తడయక మదిలో నాలోచింపని ॥ వాఁడు ॥

## కేదారగౌళ - ఆదితాళము

ఉన్నాఁడని నమ్మండి ॥నరులారా ! దేవుండున్నాఁడని నమ్మండి ॥
ఉన్నపదార్థంబునకే లేదని, యున్నదనుచు వాదము జరుగునుగా, కెన్నడైన లేని వస్తువును పేరెన్ని యెవ్వఁడైనను వచించునే ॥ ఉన్నా ॥
నిన్ను నీవెఱుంగవు గర్భములో, నున్ననాడు తలిదండ్రులెఱుంగరు ॥ నిన్ను బైటికీడ్చిన వాఁడెవ్వఁడు ? చిన్ననాడెపాలెట్లు త్రావితివి ? తిన్న పదార్థము లెటుజీర్ణించును ? కన్నుమూని నిద్రపోవుటేమిటి, ఎన్నోభూతము లీభువినుండఁగ నెన్నికగలవాఁడ వెట్టులైతివి ? రన్నా ! యని నాస్తికుని సూరివరు, లడిగి బుద్ధి సెప్పుదురుగాకమీ ॥ రున్నా ॥
పంచభూతములఁజేసినాఁడు నిర్మించినాడు సూర్యచంద్రులను సృష్టించినాఁడు నక్షత్రములను బుట్టించినాఁడు దేవరాక్షసుల నొదవించినాఁడు మానవ కోటులఁగల్పించినాఁడుం, పశుకీటకాదుల నృజించినాఁడుం దేహులకాహారము నంచిత భక్తినుతించు మహాత్ములఁ, బెంచిప్రోవ వేంకటాఖ్యవరదుం ॥ డున్నా ॥ 55

## నాటరాగము - మిశ్రజాతి

భక్తిరాజ్యములోనఁజేరండి॥ జనులార ! శ్రీహరి ॥ భక్తి ॥ యుక్తి బలమాసింప దద్భుత, సూక్తులకు లోఁబడదు దుర్గుణ, రక్తులకుఁ గన్పడదు లౌకిక, శక్తికానందింప దచ్యుత ॥ భక్తి ॥
జనపతుల రాజ్యములవలె బహు, ధనములను శస్త్రాస్త్రముఖ సాధనములనుఁ బరిపంథివారని, ధనములను బరివారవనితాజనములను గోవులను బ్రమదావనములను గోరదు రమాపతి ॥ భక్తి ॥
కరములాసింపదు శతాంగోత్కరములను వారణ తురంగ నికరములను భటవర్గములఁబర పురములను బహుచిత్రతర మందిరములనుఁగోర దసురాంతక ॥ భక్తి ॥

శౌనకప్రహ్లాద శుకపవమానసుత శాండిల్యానారద, మౌని వేదవ్యాససరమౌ, జానిభీష్మార్జున పరాశరు, లూని పరిపాలించి ధరలో, జ్ఞానులకునిచ్చి నమురాంతక ॥ భక్తి ॥ 56

## ఫేనద్యుతిరాగము - మిశ్రజాతి

**ధనము సంపాదించండి ॥ శ్రీరామనామ ॥ ధనము ॥**

ధనములను హయములను వనితాజనములను గజములనుఁ బ్రమదా, వనములను రోహిణుల భూరిభవనములను వాంఛించువారల, కనిశమిచ్చెడు మాధవాహ్వాయ ॥ ధనము ॥

ధరణి నరులార్జించు ధనముల కరయువృత్తులనేకమున్నవి, పరికరములెన్నెన్ని కావలెఁ, బరిజనము కావలయు దేశాంతరములకుఁ బోవలయునట్టులు, దొరకొనవుకష్టములు దీనికి, దొరకు టతి సులభంబు హరిపద ॥ ధనము ॥

దొంగలకుఁ జిక్కదిది వహ్నికి, లొంగదెన్నడు భూపతులచే, భంగమొందదు శత్రుతతినిఁగ, లంగఁజేయును సర్వజగతీ, మంగళంబగు విష్ణుసేవా ॥ ధనము ॥

సుంకముల కెడమీయదింద్రియ, కింకరులకు లభింపదఖిలా ! తంకముల సడలించునొగి మీనాంక శరములడంచునానా,పంకముల వదలించుఁగాలుని, లెంకలను రానీక నిరతము, వేంకటాఖ్యునిఁబ్రోచు హరిపద ॥ ధనము ॥ 57

## ముఖారిరాగము - ఆదితాళము

**జ్ఞానము సంపాదింపవలెన్ ॥ మనుజులార ! సు ॥ జ్ఞాన ॥**

జ్ఞానము లౌకిక వైదికంబులనఁ,గానొప్పునుగద రెండు విధములై। వానిలో లౌకిక మనుభవంబుచే, మానిసులకుఁ బ్రాప్తించు వైదికము, మానితుఁడగు గురునిచేఁ బట్టువడు ॥ జ్ఞాన ॥

స్వస్వరూపమును నిర్మలమైన పరస్వరూపమునుఁ బృథగ్విధ విరోధి స్వరూపమునుఁ దదుపరి సదుపాయ స్వరూపమును శాశ్వత పురుషార్థ స్వరూపమునుఁ దత్త్వత్రయ నిత్య స్వరూపమును షడ్వింశతి తత్త్వ స్వరూపమును వక్కాణించెదు ॥ జ్ఞాన ॥

జ్ఞానంబనఁగా నన్ను నెఱుంగుట, జ్ఞానియనఁగ నన్నుఁ గొల్చు ధీరుఁడు, పూని చతుర్విధభక్తులలో సు,జ్ఞానినిఁ బ్రేమించెద స్వప్రాణ సమానముగానని గీతా శాస్త్రము, లోనఁ దెల్పె భగవంతుఁడు తద్విధ ॥ జ్ఞాన ॥

దురితపుణ్యములు గలవు కారయిత, కలవడు నరకదివములని జీవుఁడు, శరీరేతరుండని బద్ధుండని, సరసిజాసనాదిలోకంబు లస్థిరంబులని వేంకటదాసునేలు, హరి యొకండ మోక్షదాయకుండని, సిరులు పశుపరంపరలు పుష్పవన, కరులు ధాన్యములు, హరులసురులు నిర్జరులు రక్షకులు కారని తెలిపెదు ॥ జ్ఞాన ॥ 58

## ఆరభిరాగము - అటతాళము

### వైరాగ్యమార్జించవలెరా ! ॥ శుద్ధ ॥ వైరా ॥

నారీమణులనీసడించి, దుస్సంసారస్థమైన వాసనల ఖండించి, ఘోరాశావల్లుల ద్రుంచి, యెపుడు వారింపఁ గల దఘ వ్రజము యోజించి ॥ వైరా ॥

సనకసనందనాదికులు, దీనికనిశంబు నాధారమైన బాంధవులు హనుమచ్ఛుకాది పావనులు, చాలా, దినములనుండి ప్రోచిన పుణ్యఖనులు ॥ వైరా ॥

లోని వైరుల నడ్డగించు, దుర్జనానీకముల స్నేహ మడఁచి పాలించు, దీనభావము వీడు మంచుఁ, దెల్పి, జ్ఞానభక్తుల నజస్రంబుఁ గల్పించు ॥ వైరాగ్య ॥

రసనాచాపల్యముఁ బాపు, గుహ్యప్రసవ చాపలమునుఁ బడఁగొట్టనోపు, వ్యసనసంఘుంబుల నాపు, బుణ్య, విసరంబు రక్షింప, విమలమౌ ప్రాపు ॥ వైరా ॥

గరిమ సద్గురు నాశ్రయించి, మోక్షపరులైన వారి సంబంధంబుఁ గాంచి, సురలోకాదుల భోగవెంచి, గడ్డివరకలుగా నిరంతరమాలోచించి ॥ వైరా ॥

స్ఫుటమైన ప్రేమచే మించి, వేంకటదాసు నేలు శ్రీవరు నుపాసించి, నిటలమందునఁ జేతులుంచి, యెట్టి, కుటిలత్వమును లేక కోరి భజించి ॥ వైరా ॥ 59

## బిలహరి రాగము - ఆదితాళము

### ఆనందబేది ? మనుజుల ॥ కానం ॥

ఆనందార్థము నానావిధంబు, లైనపనులు సేయుదురు గానిని॥ త్యానం॥ బానిసలై చెడు సానులఁ గొల్తురు, పూనుకొని సురాపాన మొనర్తురు, మేనికిఁ జందన కస్తూర్యగరులు, సూనమాలికలు ధరియించెద రీ,లోన విరేచనములు పుట్టినచో, లోని కంపుబైటఁబడు నక్కటా ! ॥ ఆనం ॥

ధనధాన్యంబులు లేవని చక్కని, తనయులు లేరని మనుమలు లేరని, తినుటకు లేదని తిననదరుగదని, తనివిఁదీర్చుమంచి పాడి లేదని, గొనబై తగు మందిరములు లేవని, పనవి పనవి దినములు గడవువారి ॥ కానం॥

తేలు గుట్టెనని పాము గఱచెనని, కాలు నొచ్చెనని తలలో బాధని యాలు దిట్టెనని కొడుకు తన్నెనని, గాలివానలని చాలావడలని, వ్రేలు నలిగెనని కడుపులోనఁబెను శూలపుట్టెనని బల్లపెరిగెనని, తాళరాని చలి దుర్భిక్షములని, జాలి జెంది తూలుచుండు నరులకు ॥ నానం ॥

దొరతనమువారి పన్నీయలేక, బెరసిన యర్థుల కీయలేక తస్కర బాధల కోర్వలేక,యప్పులు, పెరుగుచుండఁ దీర్పలేక సోదరపరివారంబులఁ బ్రోవలేక కాతరులగువారల కిల వేంకటాఖ్యవరదుని భజింపలేని పాతకుల ॥ కానందం ॥

60

# తోడిరాగము - ఆదితాళము

ఓరీ మనుజా ! యిటువావిరిc గష్టములొందనేల? నీ ॥ వోరీ మనుజా ॥
భూరిసౌఖ్యములc గూరుచు మోక్షవిచార మొక్క నిమిషమైనc జేయక॥యోరీ॥

చీరెలు రవికె లొసంగునపుడు బంగారు నగలు సేయించునపుడు తన, వారలకడిగినవిచ్చేటప్పుడు, కోరినచోట్లకుcబంచేటప్పుడు కూరిమి మేనాలెక్కించునపుడు, దారికిcదోడైనడచేటప్పుడు, మీరేదిక్కని కొల్చుచు సారె జోహారులొనర్చిన పెండ్లాము జరాభారముచే నీవు కుందునప్పుడు, పల్కరించిచెంతకు రాదాయెcగ ॥ దోరీ ॥

మించిన కూరిమిcబెంచేటపు డలరించి విద్యcజెప్పించు సమయమున, మించుబోడులను గూరిచి లలిమెప్పించి పెండ్లిcగావించెడునాడును, మంచియిండ్లు నిర్మించునప్పుడును, సంచిత ధన మర్పించునప్పుడునుc బొంచి చాల పూజించిన కొడుకులు, మంచములోనc గృశించునాడు నినుc గొంచెమైనc బ్రేమించరహాహా ॥ ఓరీ ॥

మూcతులు ముక్కులు కడుగునప్పుడును, నేతులతోc దినిపించువేళలను, మాతల్లీ ! యని నిమురునప్పుడును, చేతులమురుగులు దొడుగునప్పుడును, పీతాంబరము లొసంగునప్పుడును, ప్రీతితోడసారెలు వెట్టునపుడు, నీతోc బనిగలకూcతుంఁడ్రు లేమిచేత నీవు వారింటికిcబోయిన, భూతమేల వచ్చెనంచుcఝల్కనcజూతురింతకడి వాతకువేయరు ॥ ఓరీ ॥

పరిణయంబులకుcబిలుచుసావిలోc,బరమాన్నము వడ్డించుసావిలో, నరిసెలు గారె లొసంగు సావిలో, విరివిగ నడిగినవిచ్చు సావిలో, వరాలు గింటెము లొసcగు సావిలో, మరి యాదస్థుcడు మావాcడని యనుసరించి సేవించు చుట్టాలు ధన, మరుదైన నీమొగముcజూడరుగద, నిరంతరము వేంకటాఖ్యునేలిన, మురారాతిపాదంబులు భజింపు ॥ మోరీ ॥ 61

# జంఝూటిరాగము - ఆదితాళము

రిత్తచేతులంబోవుదురయ్య ! పరేతాధిపు పురికి ॥ రిత్త ॥

చిత్తజబాణాయత్త బుద్ధిచే, మత్త కాశినుల తొత్తులగుచు దుర్వృత్తులఁ జరియించి సత్తు చిత్తు జగదీశ్వరుడును పలుకెత్తు కొనక మదమత్తులగు వారు ॥ రిత్త ॥

ధనము గూర్చి కోటికి పడగెత్తిన, ధాన్యంబునుఁ గొట్లనిండఁబోసిన, గనకాభరణంబులెన్నిఁ గూర్చిన, గౌరవాధికారమెంత జెందిన, ఘనమగు శాల్వలు కోటులు వేసిన, ఁగొను వారల కప్పులు వేలిచ్చిన, వినయముతో యాచించిన యాచక, జనుల కొక్కకాసీయక స్వకీయ, తనువే శాశ్వతమని భార్యానందనుల నమ్మి చరియించు దురాత్ములు ॥ రిత్త ॥

వ్యాపారంబుల కొఱకు ననేక, ద్వీపంబుల సంచార మొనర్చిన, రేపుమాపు వానలకోర్చి, రేఁకెత్తి వ్యవసాయము చేసినఁ, బాపమనకయధికార మదముచేఁ,బరులనేచి లంచంబులు దీసిన, నీపని గట్టెక్కించెదనని బలు నేర్పుతో నన్యుల ద్రవ్యములాగిన, నేపెతనాబీల్ టేకు దూలములు చాపగు కడ్డీల్ మోపి మేడలెంతో పసఁగట్టినఁ గాపథవర్తులు ॥ రిత్త ॥

గండపెండరము కాలధరించిన, దండిగ బంగరుగుండీల్వెట్టిన, గండుమీఱి వ్యాజ్యంబులు గెలిచిన, మెండుగ వరాలు పాతఱవేసిన ఁదిండిదినక డబ్బు మూటఁగట్టిన, మొండియగుచు భిక్షగాండ్రఁగొట్టిన, బండెద్దుల నావుల సమకూర్చిన, దండధరుని కింకరులు కత్తులును, బండలు గొనివచ్చి ప్రాణముల నుద్దండరీతిఁ పదవేమిరా, ముండాకొడకా ! యని త్రోయునపుడు ॥ రిత్త ॥

తనయునిచేతికిఁ దాళంబీయక, తను వొసఁగిన భార్యనైన నమ్మక, జననీజనకుల కన్నము వెట్టక, చనువున సోదరులకుఁ బాలీయక, తన పొట్టనింపు కొనుటకు నొప్పక ధనముఁగూర్చి దాఁచి పెట్టి వేంకటదాస వరదుడగు రాముని పాదములను భజియింపక తీరదని వృథా, దినములు గడపెడు దుష్టమానవులు ॥ రిత్త ॥

## నాదనామక్రియ - ఆదితాళము

లేదు లేదు ॥శ్రీహరిని భజింపని నరులకు మోక్షము ॥ లేదు ॥

వేదశాస్త్రములు పురాణేతిహా,సాదులు గ్రహించుశక్తిలేకయవి కాదని
నీరసవాగ్జాలముచే, వాదము సల్పెడు బీద గురువులకు ॥ లేదు ॥

ఓటిపడవపై నెక్కువాఁడు నట్టేట మునుగునట్లు దొంగ గురువుల, మాటలు
నిజమని నమ్మిచరించెడు, మోటు శిష్యులకు నెన్ని జన్మముల ॥ లేదు ॥

నీవును బ్రహ్మము నేను బ్రహ్మమటు,గావున భేదము లేదనికాంతల,తో
వచించి చేయరానిపనులనుఁ,గావించెడు పలుగాకుల కెందును॥ లేదు ॥

వరక్షేత్ర మెన్నిసాళ్లు దున్నిన, నెరవానలేక ఫలించనట్లా, హరిభక్తలేక
యచలంబనుచును, బరిపూర్ణంబని బారలు సాచిన ॥ లేదు ॥

ఖేచరి భూచరి షణ్ముఖశాంభవి, రేచపూరకములంచుఁ గన్నులు, వాచునట్లు
ముద్రలు సాధించు ని,శాచరజనముల కెన్ని విధంబుల ॥ లేదు ॥

వాసుదేవుఁడై నారాయణుఁడై భాసమానుఁడైపరబ్రహ్మయై, వాసిఁగాంచి
జగములేలు వేంకటదాసవరదుఁడగు రామునిఁ గొల్వక ॥ లేదు ॥ 63

## మలహరిరాగము - ఆదితాళము

**రామానుజయోగీంద్రునిఁ గొలిచిన, రాదు జన్మమిఁకను శ్రీ ॥రామా॥**

శ్రీమనోహరుని శాసనంబుఁగొని। భూమిమీఁద జన్మించి మానవ, స్తోమములకు
సంసారబంధనం, బామూలాగ్రముగాఁ దొలఁగించిన ॥ రామా ॥

ఖగ మృగంబులకు నిషాదులకు మాదిగవారికి మాలలకు శూద్రులకుఁ,
బగవారికిఁబాపులకు గొల్లలకుఁదెగువతోడ మోక్షం బొనఁగూర్చిన ॥ రామా ॥

కరిగిరిలో గోపురంబెక్కి సత్వరముగ రండని మానవులఁజీరి తిరుమంత్రాది
మహారహస్యములు, కరుణా భరితుండై యెతిఁగించిన ॥ రామా ॥

శారదాంబచే భాష్యకారులను, పేరుఁగాంచి వేదములకుఁ దగిన,ట్లారసి
సత్యార్థంబులు వచించి, ధీరులకుపదేశాచార్యుండగు ॥ రామా ॥

మోదముతో ఢిల్లీపై నిరువది, యైదు కోట్ల సైన్యముతోడ నేగి పాదుషాను సులభంబుగ జయించి శ్రీదయితుని విగ్రహంబుఁ దెచ్చిన ॥ రామా ॥
దాసుఁడైన వేంకటాఖ్యునకు ను, ల్లాసమీయ శఠగోపయోగితో, వాసిగఁ జనుదెంచి పూడివాఁడ నివాసుఁడైన హరి సన్నిధి నిలిచిన ॥ రామా ॥ 64

## హనుమత్తోడి రాగము - ఆదితాళము

**కాదు కాదు॥రామానుజమతము దురాచారయుతము॥ కాదు ॥**
వేదవేద్యమై వేదాంతంబై, యాదిమునుల కుత్సవమై కుదృష్టివాదుల కతి దుస్సహమై సాత్వికమోదమైన రామానుజ మతమిది ॥ కాదు ॥
కల్లు భంగు సారాయి ద్రావుమని, నల్లఁద్రావుమని నంజుఁడు దినుమని, పల్లవాధరల మైథునమునకై, బ్రతిమాలుం డని బోధసేయునది ॥ కాదు ॥
కూచిమాచి కొఱవి యను పేర్లుగల, నీచస్త్రీలు వచించిన తీరుగ, నాచరించువారికి వేద విరుద్ధాచారంబులు గల్గెఁగాని యది ॥ కాదు ॥
నోరెఱుఁగనివారి రహస్యంబుగఁ, జేరఁదీసి త్రివిధప్రసాద మని, సొరె రోఁతవస్తువులు వెట్టుమని, క్రూర గురువులకు బోధసేయునది॥కాదు ॥
ధర వేంకటాఖ్యదాసుని మదినిజ, చరణంబులుంచి దురితము లడంచి, పరమపావనంబై చెలఁగుఁగాని ॥ కాదు ॥ కాదు ॥ 65

## శ్రీరంగరాజస్వామివారి మేలుకొలుపు

శ్రీరంగరాజ భూభార విధ్వంసన ! ॥ శ్రితజనావనశీల ! మేలుకో ॥ శ్రీరంగరాజా ! మేలుకో ॥
శ్రీదేవి భూదేవి శ్రీనీళాదేవితోఁ జేరియుండిన దేవ మేలుకో ! ॥ శ్రీరం ॥
బ్రహ్మాండ పాలనకై విష్వక్సేనుఁడు, ప్రార్థింపుచున్నాడు మేలుకో ॥

శఠగోపమునిద్రావిడామ్నాయమున నిన్ను సన్నుతింపుచునుండె మేలుకో ! ॥
లలినాథముని యోగబలముచే నీపాదనలినముల్ ధ్యానించె మేలుకో ! ॥
శ్రీరంగరాజ మేలుకో॥
పుండరీకాక్షు లఖండజ్ఞానముచే నిన్నూజింపుచున్నాఁడు మేలుకో ! ॥
శ్రీరామమిశ్రుఁడు కోరి త్వదంఘ్రు లర్చించు సమయమాయె మేలుకో ! ॥
యామున ముని స్తోత్ర రత్నముచే నిన్ను బ్రేమించువేళాయె॥ మేలుకో॥
పంచనంబులు భవత్పాదారవిందముల్ప్రణుతింపుచున్నారు ॥మేలుకో॥
రామానుజులు నీ ప్రభావంబు జనులకు, రహిఁ దెల్పుచున్నారు మేలుకో, శ్రీరంగరాజ ! ॥ మేలుకో ॥
ఎంబారు నీదు పాదాంబుజ మహిమ నయంబుగ వర్ణించె మేలుకో ! ॥
శ్రీపరాశర భట్టరార్యుని స్తోత్రములు చిత్తగించగవలె మేలుకో !
నంజియ్యరు భగవద్విషయవ్యాఖ్యానం బొనర్చుచునుండె మేలుకో !
నంబిళ్ళ ద్రావిడశ్రుతిచేఁ దావక గుణగణంబులు వర్ణించె మేలుకో!
శ్రీకృష్ణపాద దేశికులు నీ పదముల,ర్చింపవచ్చెను వేగ మేలుకో ॥
పిళ్ళలోకార్యులు తదనుజాతుఁడు, నిన్ను బ్రేమించువేళాయె మేలుకో ! ॥
శ్రీశైలేశాహ్వయ దేశికమౌళి, నిన్సేవింప వచ్చెను మేలుకో ! ॥
మణవాలమునులు నీ మహిమ సజ్జనుల కేమఱక తెల్పెను వినఁగ మేలుకో ! ॥
పొయ్గపూదప్పె యాళ్వారలు నినుఁగూర్చి పొగడిరాలకింప మేలుకో ! ॥
పెరియాళ్వారలు చేయు పుష్పకైంకర్యమింపుగ నంగీకరింప మేలుకో ! ॥
శ్రీ రంగరాజ మేలుకో ॥
భక్తిసారులు దుర్మతాభిమానము మాని, ప్రణుతించువేళాయె మేలుకో
కులశేఖర సూరికృత ముకుందమాల,లలినాకర్ణింపంగ మేలుకో ! ॥
వరతిరుప్పాణియాళ్వారు నీ పాదముల్ వర్ణించువేళాయె మేలుకో ! ॥

బలుపూలదండలిచ్చెను దాల్ప మేలుకో
తొండర డిప్పొడియాళ్వారు
పరకాలముని నీదు కైంకర్యార్థంబెంతో బంగారు గొనివచ్చె మేలుకో ! ॥
శ్రీరంగరాజ ! మేలుకో ॥
నమ్మాళ్వారలు తింత్రిణీవృక్షమున నిన్ను, నమ్మినుతించెను మేలుకో ! ॥
మధురకవులు చాల మాధుర్యమున నీ నామములు సన్నుతిఁజేసె
మేలుకో ! ॥
శ్రీగోదావ్రతము సాఫల్యమయ్యెను బెండ్లిఁజేసికొనవలె వేగ మేలుకో ! ॥
శ్రీభాష్యకారసమాజమువారు నిన్సేవింపవచ్చిరి మేలుకో ! ॥
వేదాల సీతారామార్యులు నీ మహిమ వెదజల్లువేళాయె ! మేలుకో
!మొవ్వవేంకటదాసు మొఱవిని కోరికల్, ముదముతో నొసఁగూర్ప మేలుకో
66
॥ శ్రీరంగరాజ ! మేలుకో ! ॥

## శ్రీరామానుజులవారి మేలుకొలుపు

శ్రీభాష్యకార ! యోగీంద్ర ! వైష్ణవ కులశేఖర ! మముఁబ్రోవ మేలుకో ॥
శ్రీయతిరాజ మేలుకో ! ॥
హరితోఁబంతములాడి, యఖిలజీవులఁబ్రోవ, నవతరించిన దేవ ! ॥
మేలుకో ! ॥ శ్రీయతిరాజా ! మేలుకో ! ॥
వాగ్జృంభణంబుచే భారతి మెప్పించి వాసిగాంచిన దేవ ! మేలుకో !
శ్రీయతిరాజా ! మేలుకో ! ॥
హరికాత్మలాభ మాత్మలకు భగవల్లాభమమరనిచ్చినదేవ ! ॥ మేలుకో
పాషండచార్వాక బౌద్ధాది మతములఁబాడునేసినదేవమేలుకో ॥
నరకస్వర్గముల మార్గములు పూడ్చియు మోక్షసరణిఁజూపిన యోగీ ! ॥
మేలుకో !

నరకకూపములు పాడరఁజేసి జముదాడి నరసిమాన్పినయార్య ! మేలుకో
స్వర్గభోగములు తుచ్ఛములని జనులకు సరవిఁదెల్పినసూరి ! మేలుకో
పశుపక్షిముఖ తిర్యగ్జంతువులకు మోక్షపదవి నిచ్చిన మేటి ! మేలుకో
నరలోకమెల్ల వైష్ణవ మయంబగునట్లు నెరపిన కోవిద ! మేలుకో ! ॥
వేద ప్రమాణముల్ వెలయించి వాగ్దేవిఖేద మడఁచిన దేవ ! మేలుకో ! ॥
శఠగోపముఖయోగి జనుల ప్రభావముల్చాటించు వేళాయె మేలుకో !
శ్రీగోదాదేవి ముచ్చేసిన ప్రార్థనఁ జెల్లించిన సూరి ! మేలుకో !
పన్నిద్దరాళ్వార్ల పంచనంబులకీర్తి, ప్రకటించు వేళాయె ॥ మేలుకో !
వరవరముని నీదుచరణసరసీజములు వర్ణింపు చున్నాఁడు ॥ మేలుకో !
కూరేశముఖ సర్వగురులు మిమ్ములఁగూర్చి కొనియాడుచున్నారు ॥ మేలుకో
చోళభూపతి కంఠమునఁ బురుగులు వడగఁగాలుఁజేరె వినంగ ॥ మేలుకో
పరమతంబులమీద మాచిత్తములు చొఱబడకుండ రక్షింప ॥ మేలుకో !
దుర్మతవాదులు మాచెంతరాకుండఁ దొలగింపఁ దలపోసి ॥ మేలుకో !
సాత్వికజనులు కుదృష్టివాదుల గెల్చు సదుపాయములు దెల్ప ॥ మేలుకో
విష్ణుప్రభావంబు, వైష్ణవ ధర్మంబు వివరింపవలెవేగ ॥ మేలుకో ! ॥
వేదాంత విషయముల్ నీదాస జనులకు వివరింపవలె వేగ ॥ మేలుకో !
వేలకొలందిగ సామాజికుల నభివృద్ధిచేయగఁవలె ॥ మేలుకో ! ॥
షడరివర్గ బాధలడచి సర్వేంద్రియ జయము మాకొనఁ గూర్ప ॥ మేలుకో
హరిభక్తి నిక్షేపమయ్యె ! మా హృదయములందుఁ బదిలము సేయ ॥
మేలుకో !

కంజాతనయనుని కళ్యాణ గుణములక్కజముగ బోధింప ॥ మేలుకో !
ఇంద్రియవ్యాపార మింతింతయనరాక, హెచ్చెను దొలఁగింప ॥ మేలుకో
పరమతంబులఁ జేరు సాత్విక జనులనుఁ బరిశుద్ధులనుఁ జేయ ॥ మేలుకో

లక్ష్మీనారాయణుల లక్షణంబులు జనుల, కక్షయంబుగఁదెల్ప ॥ మేలుకో
నీ సిద్ధాంతమున దుర్నీతులు గల్పించు, నీచుల దండింప ॥ మేలుకో !
శేషత్వ కైంకర్య పారతంత్ర్యములనుఁ, జెలఁగివెల్లడిఁజేయ ॥ మేలుకో !
ధరమొవ్వవేంకటదాసుడు కేల్మోడ్చి, ధ్యానింపుచున్నాఁడు॥ మేలుకో !॥
శ్రీయతిరాజా ! మేలుకో ! ॥ 67

## జీవుని మేలుకొలుపు

శ్రీరామానుజయోగి శ్రీపాదములబుద్ధిఁజేర్పంగఁదలపోసి ॥ మేలుకో ॥
సంసారజీవా ! మేలుకో ॥
శఠగోప మునిపాదసారసంబులు నమ్మి, నన్నుతింపఁగవలె మేలుకో !॥
యామున మునిపాద తామరసంబులు ప్రేమించి ధ్యానింప ॥ మేలుకో
తనువాత్మయను మోహాంధమునందుఁబడి నానా, తనువు లొందితివింక॥
మేలుకో ! ॥ సంసారి ॥
ధనధాన్య ముఖసంపదలు రక్షకములని, తలపోయుటలు మాని మేలుకో
సకలదేవతలు రక్షకులని పూజించు, సరణి నీసడించి మేలుకో !
తిరుమంత్రద్వయమంత్ర చరమ శ్లోకస్థమౌ, పరమార్థమెఱుగంగ మేలుకో
భగవద్భాగవతాపచారములందుఁ బా,ల్పడని జ్ఞానముఁజెంద మేలుకో
భగవద్విరోధుల దర్శనస్పర్శన, పాప్తిఁజయ్యన దూఁటి మేలుకో ॥ సంసారి
హరిభక్తి శూన్యుల నాదరింపక భక్తవరులను సేవింప మేలుకో !॥ సంసారి
ధారక పోషక భోగ్యములెప్పుడు, నారాయణుండని ఎంచి మేలుకో !
తాపత్రయాగ్నిలో ఁదగులుటమాని సీతాప్రాణేశునిఁగొల్వమేలుకో !
ముఱికి దేహమునందు మోహంబు విడనాడి, మురవైరి సేవింప మేలుకో
జన్మవారాశిలో సారెకుముంచిన, మన్మథ,వ్యధమాని మేలుకో !

శరణాగతత్రాణ బిరుదాంకుండైన, శ్రీజాని సన్నిధింజేర మేలుకో !
వనజాతాక్షుండు దక్కమోక్షప్రదాత లేండని సిద్ధాంత మొనర్ప మేలుకో !
వ్యాసుండు ముమ్మాఱుహరియే దైవంబని, బాసంజేసె నెఱింగి మేలుకో !
శుకయోగి హరిగాథాసుధచే ౘబరీక్షిత్తునకుఁ దెల్పెనది తెలియ మేలుకో
వాల్మీకి కృతమైన రామాయణార్థము, వర్ణించి శుభమొంద మేలుకో
గీతాచార్యుండని ఖ్యాతివహించిన, కృష్ణతత్త్వ మెఱుంగ !
భగవద్గీతాశాస్త్ర పఠనంబుచే వచ్చు, ఫలము ప్రాపింపఁగ మేలుకో !
పొరి వేంకటాఖ్యుండు గురునిచే నెఱింగిన బోధ నాకర్ణింప మేలుకో ! ॥
సంసారి జీవా ! మేలుకో ! ॥ 68

## మంగళహారతి

మంగళము మంగళము మాధవునకు, నింగితము లీడేర్చు పాండురంగనాథునకు ॥ జయముజయము పాలకడలిశయనునకును, భయములెల్లఁ బాపు గోపబాలునకును ॥ మంగ ॥

కళ్యాణము కల్యాణంబనహల్యాపోషునకుఁ గల్యాణాత్మకుండైన శ్రీ కౌసల్యా పుత్రునకు ॥ మంగ ॥

వందనములు వందనములు వాసుదేవునకుఁ జందనకర్పూర పరిమళచర్చితాంగునకు ॥ మంగ ॥

భద్రము భద్రము రామభద్రునకును, క్షుద్రదశలువాపు దశరథసూనునకును ॥ వరదునకుఁ బూడివాడ వాసుదేవునకు, దరారిధరునకు వేంకటదాసపోషునకు ॥ మంగళము ॥ 69

(వరదునకు పూడివాడ పురనివాసునకు ధరణిలో
శ్రీ మొవ్వ వేంకటదసునాకును)

# ఖరహరప్రియరాగము - జుల్వతాళము

మంగళం మంగళము ॥ శ్రీరఘురామా ! ॥ మంగ ॥

సంగీత సాహిత్య సర్వవేదవేదాంగ సన్నుతపాదరంగత్కృపా పాంగ రక్షిత భక్తపుంగవ మాయాకురంగనాశన సీతారామ శ్రీరామా ॥మంగళం ॥

వరదండకాటవీ, స్థిరయందు నిల్చి ముష్కరులై మౌనులఁగాసిపరచునట్టి, ఖరదూషణాది భీకర రాక్షసులఁద్రుంచి పరమ సాధుల కభయప్రదుఁడైన రామా ॥ మంగ ॥

పదివేలమంది బల్లిదులుదెచ్చి గోష్ఠీసదనమందుంచిన శివ చాపముఁ గదలించి పైకెత్తి చిదురపల్సేసియుఁజెదరకనిల్చిన జానకీరామా !

పంపాతీరమునందు సొంపుగా నిలిచి పదంపడి హనుమతోఁదరలిపోయి తెంపుతో వాలినిఁ జంపి సూర్యజు ననుకంపతోఁ గాచిన కల్యాణరామా

ఘోరాశుగములచే, వారాశిగర్వము, వారించి వానరావళుల చేత। వారిధిఁ గట్టించి కోరిలంకాపురిఁజేరి విధ్వంసముఁజేసిన రామా ॥ మంగళం ॥

రావణాది రాక్షసావళిఁ బడఁగూల్చి, దేవతాస్తుతులచే ఠీవిఁగాంచి, పావనియగు సీతతో వరానుజునితో సేవఁగైకొని స్వపురిజేరిన రామా

జానకీ లక్ష్మణ శత్రుఘ్నాది సోదరానీకమును విరించాది సురలు, మౌనులు సేవింపఁగా నయోధ్యాపురి, లోనఁ బట్టాభిషిక్తుఁడవైన రామా !

వేంకటాదాసుని సంకటములు వాపి, పంకశాదము లెల్ల నింకఁజేసి, సాంకవ కస్తూరీ చందనాదులతో నిరంకుశ కృపతోడ నలరు శ్రీరామా ! ॥ మంగళం ॥

# సావేరి రాగము - జుల్వతాళము

జయమంగళము మంగళం ॥ గోపాలకృష్ణా ! ॥ జయ ॥ రుక్మిణీనాథా

అయముల నొనఁగూర్చి, భయములఁ బోకార్చి, నయ బుద్ధులొనఁగూర్చి, నన్నుఁ బ్రోచిన కృష్ణా ॥ జయ ॥

పుట్టినప్పుడె నిన్ను గిట్టించుటకు సమకట్టి వచ్చిన దనుజ నట్టె కాంచి, పట్టి ప్రాణములు పోగొట్టి మోక్షమొసంగినట్టి నందుని ముద్దుపట్టీ ! శ్రీకృష్ణా ! ॥ జయ॥

రాలవానచేత సోలిన గోపీగోపాలురు మొఱఁబెట్ట నాలకించి, శైలమెత్తి వారిలీలతో రక్షించి, వేలుపుదొరఁ బరిభవించిన కృష్ణా ! ॥ జయ ॥

చిన్ననాడె గొల్లమన్నీంద్ర యిండ్లలో, వెన్న జున్ను పాలు పెరుగుఁ ద్రావి, సన్నిధికరుదెంచి సన్నుతిఁజేసిన, వన్నెలాఁడులనుఁగైకొన్న శ్రీకృష్ణా ! ॥ జయ ॥ జయ ॥

మునుమారబలులతోఁ, జని బాణాసురుబాహులను ద్రుంచి యబ్బాణ తనయఁగూర్చి, మనమడౌననిరుద్ధమానసంబునఁ గల, ఘనవాంఛలను దీరిచిన రాధాకృష్ణా ! ॥ జయ ॥

వారాశిపై వేడ్క ద్వారక నిర్మించి, పౌరుల దానిలోపలఁ జేరిచి, వైరిబాధలు మాన్పి దారపుత్రాదులతో రమ్యఫణితిఁ గ్రీడించిన కృష్ణా ! ॥ జయ ॥

భారతరణములోఁ జేరి నిల్చిన మహాశూరవర్యుల నెల్లఁబేరు మాపి, ఘోరతరంబైన భారంబుఁ దొలఁగించి, ధారుణిఁబ్రోచిన దైత్యారికృష్ణా

లీలతో నరుకునిఁ గూలనేసి చెఱసాలలోఁగల పదియార్వేల మంది, గోలల మోహింప లాలించి కొనితెచ్చి, పూలవిల్తుని కేళిఁదేలిన కృష్ణా

శకటాసురునిఁద్రుంచి, చాణూరుఁబడఁగూల్చి, బకవత్సాసురుల వేపట్టి చంపి, శుకనారదాది మౌనికలాపములచేత, నకలంక సన్నుతులందిన కృష్ణా ! ॥ జయ॥

దోసియైన కంసదాసికి సౌందర్యోల్లాసంబు లొఁగి రక్షించినట్లు, భాసుర కృపఁ జేరదీసిఁవే, వేంకటదాసు నేలిన శ్రీనివాస శ్రీకృష్ణా ॥ జయ ॥71

# గద్యము

ఇది శ్రీ సీతావల్లభ ప్రసాద సమాసాదిత కవితాప్రవీణ వేదాల
సీతారామాచార్యకృపాలబ్ధమంత్ర రత్నాను సంధాన పవి
త్రాంతరంగ నిఖిలదుర్మత శిలోచ్చయ దంభోళీభూత
సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహబోధిత విశిష్టా
ద్వైతరహస్యార్థ ధురంధర శఠగోపయతిరాడ్వ
రవరయోగిప్రభృతి పూర్వాచార్య చరణ
సరోజ భ్రమరాయమాన మొవ్వ వంశ
తిలక కృష్ణాంబాకృష్ణమార్య తనూజ
శ్రీ వైష్ణవ విధేయ వేంకటదాస
నామధేయ ప్రణీతంబైన
భాగవత సురభూజము
నందు ద్వితీయభాగము
సంపూర్ణము.





1. పద్యాల గోపీచంద్రస్వామి
2. పద్యాల శ్రీమతి పంకేజ
3. పద్యాల పవననందనరాయలు
4. పద్యాల రాజీవ
5. పద్యాల పద్మావతీ మనోహర ప్రసాదు.

శ్రీమతే రామానుజాయనమః

శ్రీ సీతాలక్ష్మణ భరతశత్రుఘ్నహనుమత్సమేత
శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః
శ్రీ రాజ్యలక్ష్మి హనుమద్దివ్యసూరిసమేత
శ్రీ వేణుగోపాలపరబ్రహ్మణేనమః

# భాగవతసుర భూజము

## మూడవ భాగము

## కీర్తనలు

### శంకరాభరణము - జుల్వతాళము

పిల్లవాడంటివే మమ్మ ! చంటి పిల్లవాడంటివే మమ్మ ! తల్లి యశోదమ్మ కల్లరి కృష్ణుని ॥ పిల్ల ॥

పుల్లమ్మ కోడలు తెల్లవాఱగ లేచి, యిల్లూడ్చి యింటిలో జల్ల చేయుచుండ, నల్లవాడరు దెంచి, పల్లవాధర తోడ సల్లాప మాడుచు నుల్లాసంబున జన్నుగిల్లి పోయెనట ॥ పిల్ల ॥

గుట్టుగానొకయింటమెట్టి పెరుగు ద్రావి వట్టి కుండలు పరులనట్టులో నుంచంగ, దిట్టివారు వీరు గొట్టుకొనిరి, యట్టిరట్టు గాంచి నీదుపట్టినవ్వెనట ॥ పిల్ల ॥

ఇంతి యొక్కతె తనకు సంతులేదని లాతికాంతతో జెప్పంగ నింతలో నీ కొడుకు బంతులాడుచు వచ్చి చింతయేటికి నాతో కంతుకేళికి రమ్ము సంతానమౌన గూర్తునెంత కార్యంబని. పంతముతో జెంగువట్టి లాగెనట ॥ పిల్ల ॥

కడవలో బెరుగెల్లగడుమునిండద్రావి యెుడిని వట్టగబోవ పడతికన్నులనిండపుడికిలించి యూని కడగి చన్నులువట్టి తడవిముద్దులువెట్టి గడియలోమాయమైకానరా డయ్యెయ్యో ! ॥ పిల్ల ॥
కన్నెలెల్లగూడి మొన్న స్నానము సేయుచున్న కోనేటికి చిన్ని కృష్ణుడు వచ్చి వన్నెలాడుల చీరలన్నీ యువహరించి పొన్నపై నెక్కిచేనన్నచేబిల్చుచునెన్నో జోహార్లగైకొన్నాడట యిట్టి చిన్నెలుమగవారువిన్న సహింతురే ? ॥ పిల్ల ॥
పాలుసాలక యేడ్చుబాలకులకు నావు పాలు దెమ్మని మొన్న బాలింతలనగానీ బాలుండటకు వచ్చి యూలదూడలవిప్పి బాలుగుడిపిపోయె బాలింతలు గొప్పగోలచేసిరితండు సాలివేంకటదాసునేలు శ్రీవేణుగోపాలుడైయుండంగ ॥ పిల్ల ॥
వనిత ! కృష్ణుడువచ్చునను భయంబున తలుపులను మూసి జాగ్రత్త గొనిమేముండగ నీదు తనయుండేరీతిగాజనునో లోపల జేరుకొని నవ్వ నొకచోట మొనసిపరిహాసముల్బకు వేరొకచోట. జనిమేము చూడంగ కనరాడు దధిలేని కడవలుండును గాని ॥ పిల్ల ॥ 72

## సావేరి రాగము - జుల్వతాళము

ఎందుకురా ? బాలకృష్ణా ! తగవు లెందుకురా ? బాలకృష్ణా ! నందుడు గోపాలబృందములకు రాజై, యందటిచే బన్నులందు చుండగవాని, నందనుండవై ఈ చందాన జందన గంధులచే నిందలొంది బాధపడెద ॥ వెందుకురా ॥
నారమ్మ పెట్టెలో నగలు దీసి తివట, పేరమ్మ వస్త్రముల్ పెనగిచించితివట, సూరమ్మ కొప్పులో సూదిగ్రుచ్చితివట వీరమ్మయింట బల్లేరుగాయలు బోసి మీరమ్మ కాసుల పేరు ద్రెంచి ద్రోసి వారాల చంద్రమ్మగారి యావులవిప్పిపైరు పచ్చులు మేపి బాధించినావట ॥ యెందు ॥

సుందరాంగులు చెఱువునందు స్నానముసేయ, నందటి చేలంబులంది బైటికిదెచ్చి చిందులు ద్రొక్కుచుమందహాసముసేసి, మందయానలకెల్ల మానభంగమొనర్చి, కొందలపరచితివందురు కొందరు ॥ ఎందు ॥

పూరీలు బొబ్బట్లు గారెలరిసెలు,పంచ, దారక్షీరాన్నమాగార మందు ననేన్నో తీరుల నుండంగవారింట వీరింట చేరియాహారంబు గోరనేటికి ? మేరమీటి తిరిగెదవయ్యా ॥ యెందు ॥

జున్నుపాలు పెరుగు వెన్న మీగడలడ్డు చెన్నైన ద్రాక్ష పండ్లెన్నో మామిడిపండ్లు కొన్ని యరటిఫలములున్నవిమన యింటనన్నివిసర్జిం చి, చిన్నమ్మగారింట వెన్న దొంగిలితిన్నావన్న దానికి మనసు చిన్నబోయెనయ్యా ! ॥ ఎందు ॥

కోటిగారి బాన తూటు వొడిచితివట పాటలాధరి కొప్పుబట్టిలాగితివట, తాటమ్మ మామిడితోటలోబండ్లన్నిగోటమీటి తెచ్చి మూటగట్టితివట. కోటమ్మ గృహములో కుడుములెల్లను దెచ్చి బాటసారుల బిల్చి పంచి పెట్టితివట యాటలా ? యివి.వేంకటాఖ్యవరదా ! నీకు॥నెందుకురా బాలకృష్ణ॥ 73

## ముఖారి రాగము - అట తాళము

అమ్మరోమదినమ్మ బోకమ్మా ! ॥ యీ కొమ్మలాడెదువమ్ము మాటలు ॥ అమ్మ॥

కొమ్మమొకముల చందముననీయెమ్ములాడు లసూయచే పాపమ్మనక మోసమ్మనక విరసమ్ముగా, నన్నృతమ్ములాడెడు వమ్ముపల్కులనమ్మరో !

పొట్టిగంగొకనాడు ననుగని పెట్టిరమ్మనిపిలిచి నాచెయిపట్టుకొని నాగర్భమందున బుట్టవయితివినాయనా నీ యట్టి సుతుడెవ్వరికిలేడనిపట్టి కౌగిటజేర్చి ముద్దులువెట్టి పెరుగందింపుమని యొక యుట్టిపై నెక్కించి దించెను ॥ అమ్మరో ॥

బాలింతయొక్కర్తునను బ్రతిమాలి రమ్మని పిలిచి యేడుచు, బాలకుని నా చంకనిడి యిక్కాలమిచ్చట నిలిచి పాడుములాలిపాటల జోలపాటలు బాలకా ! యని చెప్పగా చాల్ చాలనుచు గద్దించి కోపమున్చే లలననొకదెబ్బగొట్టి తటాలునంబరుగెత్తినాడ మిటారికిది ధర్మమా ? చెప్పుము ॥ నమ్మరో ॥

మించుబోడి యొకర్తు పిడకల,నించి గంపను నెత్తుటకు రమ్మంచు నాహ్వానించి కౌగిటనుంచి పట్టుము బాలకా దీనంచనుచు బ్రేరించగ్గా, గోకంచనుచు రవికంచనుచు యోజించి యెత్తితినింతలో రాయంచయాన బిరాననను దూషించి పల్కెను మంచిదాయిది ॥ అమ్మరో ॥

నల్లవాడా ! నిన్ను గనినపుడెల్ల నా హృదయాంబుజము జాబిల్లియల్లని భల్లములచే దల్లడిల్లుచున ఎన్నదని యొక పల్లవాధర నన్ను బలిచి తన యిల్లు జేరిచి జుట్టు దువ్వెను, మల్లెపూవులు జాజిసుమములు, మొల్లలును సంపెంగలత్తరు కొల్లగా నిడి వేంకటాఖ్యుస కుల్లాస మొదవించె గాదె ॥ అమ్మరో ॥ నమ్మబోకమ్మా ॥ 74

## సావేరి రాగము - ఆది తాళము

**మాంసముదిననేలా ? మనుష్యులు ॥ మాంస ॥**

హింసాపరికరములైన ఖడ్గము లంసభాగమున జేరిచి జంతు, ధ్వంసము జేసితదీయ శవంబులు, శంసింపుచు బక్కంచౌనర్చిభళి ॥ మాంస ॥ నెత్తురు కండలు, చీము శల్యములు, పిత్తము చీమిడి, మలమూత్రంబుల, తిత్తులు, నరముల ప్రేవులు పుర్వుల మొత్తము చర్మము రోమములుంగల ॥ మాంస ॥

పుట్టుకొక్కులని పులుగులు సీళ్ళని పొట్టేళ్ళ యందు, బుట్టిన మెదడని పిట్టల క్రొవ్వని, దట్టమగు కోడిపెట్టల గ్రుడ్లని లొట్టలు వేయుచు నత్తలపీతలపొట్టలుసీలిచిచట్టిలోవేలిచి ॥ మాంస ॥ వలలూతలు

తిట్టులుగాలంబులు బలు మావులు సాధనములుగా గొనిజలముల జరించు సాధు మీనముల బలిమిమీఱ బట్టితెచ్చి కోసియు ॥ మాంస ॥
మాలమాదిగలు బోయలు చెంచులు జాలరి వారెఱుకలు బైరాగులు కూళలైన బుడబుక్కలీడి గల బాలిశులగు నేనాదులు హింసా లోలురగుటచె హైన్యము జెందుట లాలకించియైనను సజ్జనులీ బేలతనము మాని వేంకటాఖ్యుని బాలించెడు రాముని కృపగోరక ॥ మాంస ॥ 75

## కళ్యాణిరాగము - ఆదితాళము

**పలలముదినవలెనా ? మనుష్యులు ॥ పలల ॥**

జలమునడాగి చరించు చేపలను, బొలమున బచ్చికమేయు గొఱ్ఱియల, ను ఱికి పాఱుజింకలను, దుప్పులను, జలమున బట్టి వధించి వండుకొని ॥ పల ॥

క్షీరాజ్యంబుల దధితక్రము ద్రాక్షారసంబు చెఱుకుపాలు తేనియలూరు గాయలూరు బిండ్లు కమ్మని, చారు, పప్పు దప్పళంబులును జంబీర చూతజంబూ కదళీ ఫల, సారములుండగ నీసడించి పెల్లారాటముతో సారాయిద్రావి సారెకు జంతు శరీరములు గోసి ॥ పలల ॥

గారెలుండగా బొబ్బట్లరిసెలు, పూరీలుండగ, జిలేబి పూర్ణపు బూరెలుండ లడ్డుకములుండ పులిహోర కదంబము చెక్కరపొంగలి దధ్యన్నము లావకాయ పచ్చళ్ళు పాలు పారుచుండగా దూటి పెంటదిను నూర పందులను గోరి చంపి యా వారులు గైకొని వహ్వారే యనుచును ॥ పలల ॥

మనోహములగు దుంపలుండగా, ఘనతవహించిన కాయలుండగా, గొనబగు నాకులకూరలుండగా, సెనగలు కందులు పెసలుండంగా, మినుములుండగా గోధుమలుండగ దనివిలేక జిహ్వా చాపల్యంబున దుర్గంధ శరీరములు గోసి ॥ పలల ॥

లద్దెపురుగులను బోలిన రొయ్యల ; గొద్దిపాము వంటి బొమ్మిడాల, బెద్దపాముబోలు మలుగు మీనుల హద్దు మీఱిరేగి ముండ్ల పక్కెల సద్దులేక వట్టి తెచ్చి శిలపై రుద్ది రుద్ది పొట్టు దీసి వండియు నిద్దినంబుమంచిదాయెనని బలు సుద్దులు సెప్పుచు జెడు కంపుకోర్చి ॥ వలల ॥ మనుజులసృజించినట్లే జంతువులను సృష్టించెన్న వేంకటాఖ్యునేలిన నారాయణుడా సర్వేశ్వరుమనసున కాయాసము కలుగునట్టుగా ॥ పలల ॥ 76

## శంకరాభరణము - మిశ్రజాతి

**తరసంబుమానలేరా ? ॥ సజ్జనులారా ॥ తర ॥**

గురుదయాపరులై సు స్థిరులౌ కొందఱు మునీశ్వరులు జీవహింసదురిత కారణమని, యరసి వానప్రస్థులై వాతాంబువులు పర్ణములు దుంపలు సరవి దిని ప్రాణంబులోమి విశాలకీర్తి వహించు టలువిని ॥ తర ॥ పలలాహారముచేత ఖలురైన దైత్యులు, బలవంతులైయుండి బడయనిసుధ, పుణ్యనిలయులౌ దేవతలు గైకొని వెలయలేదా ? జరామరణంబులు, క్షుత్పిపాసలు, దొలంగియుబలు విధామయములను బాసియు ॥ తర ॥ సింగముల్పులులు సివంగులు తోడేళ్లు పొంగి మాంసము దినుట లొంగి వధ్యములయ్యె శృంగిణులు, మాతంగ, వృషభతురంగపాళి మహాంగములును జెలంగె సన్మానార్హములుగ, గురంగములు సాధుత్వమొంది ॥ తరసం ॥

పొలదిండులై సాళువలు డేగలును గృధ్రములురా పుల్గులు నింద్య మూర్తులై తనరారె. జిలుకలును హంసములు పావురములును శారికలునొగి బూజ్య తనలరె వేంకటదాసు నేలిన జలజాక్షు కృపసాధుతంగని ॥ తర ॥ 77

## సింహేంద్ర మధ్యమ - చతురశ్రజాతి

అలవాటు చేయబోకండి ॥ మాంసంబు పిల్లల ॥ కల ॥
పలలంబు నీచమని పాపమని రోతయని, తెలిసుకొనక పెద్దవారు తినిపించి నారు మిమ్ము ॥ అల ॥

మరియాదాసన్నమౌను, ధరలా హెచ్చై యుండు కరుణాచే రంగనీయ దరరే ! హైన్యంబు దెచ్చు బురద నీటిలోని కనుచు బుంగలు చేతికినిచ్చు బరులు గాంచిరేను లొచ్చుపాటజూచి సజ్జనులు ॥ అల ॥

చూడబాతుల పెంటపాడు చేపలముండ్లు కోడిపుంజులబొచ్చు సూడిమేకలరొచ్చు కీడు దెచ్చునట్టి కంపుమేడలైన జడుసొంపు ॥ అల ॥
మారీస్ఫోటకములు చేరియుండిన చోట నీరోత మాంసమాహారముగా గొన్న చోరేగి ఘనభూత వారములు చంపునని, సారె సారెకు దిన్నవారే వలదంద్రు దీని ॥ నల ॥

యేజంతువులదిన్న నాజంతువుల చర్య, లాజనాధము నందు రాజిల్లునది గాకయా జంతువప్రాపి నే జన్మమందైన యోజించి భక్షించు నైజమని శాస్త్రమనె ॥ అల ॥

అక్షీణకృప వేంకటాఖ్యునేలిన సారసాక్షుని భజించు ముముక్షువులు గోరరిది రక్ష ః పిశాచములకు సాక్షాదన్నము దీని ॥ నల ॥ 78

## సురటరాగము - మిశ్రజాతి

ఏలతెలియదు మీకున్యాయంబు ? ॥ మానవులారా ! ॥ యేల ॥
కాలిలో ముల్లు గ్రుచ్చుకొనగా cగంటి లోపల నలుసుపడగా, నాలుకకు జేదంటుకొనగా గోల జేసెదరోర్వజాలక, వాలుగలు మొదలైన చేపల, బాలొసగు గొఱ్ఱియల మేకల, వేళ దెలిపెడు కోడిపుంజుల, వాలుగైకొని కోయుచుండెడు కాలమునవానికి బాధయని ॥ యేల ॥

ఘోరరోగము లబ్బినప్పుడు క్రూరులగు వారెందరో కాటేరి కిత్తుము గొట్టియల వోలేరు కిత్తుము పందులను వేసార కిత్తుము పోతరాజుక్కు జాలు నట్టుల గుక్కుటములని పేరుకొని జాతరలు జరిగెడు ధారుణి క్కి జని బలి యొసంగుదు ॥ రేల ॥

కండగల జంతువుల గైకొని నిండు ప్రాణము దీయబూనుట గండమని బహుపాతకంబని పండితులు సెప్పగవిన క యుద్దండు లైనా వేటనిప్పుడె చండవలె నొకడు నీవట్లుండరా ! యని యొకడు ముందట లెండులెండని, యొకడు వెనుకకు బొండుబొండని యొకడు మిక్కిలి దుండగీంద్రై జగడమాడుదు రొండొరులతో వేంకటాఖ్యుని కండయై రక్షించు శ్రీరామాంఘ్రి యుగ్మము గాంచనేరరు ॥ యేల తెలియదు మీకున్యాయంబు ? ॥

79

## నాదనామక్రియ - ఆదితాళము

**ఏదీ సొంతము లోకంబున మానవసంఘంబుల ॥ కేదీ ॥**

నాది సొంతమిది కాదదితరులదని వాదింపుచుసమ్మోదింతురు ॥ ఏదీ ॥

పిల్లులు తమవని త్రుళ్లను కుక్క పెల్లుగలోపలజేరును పిచ్చుక లెల్లచూరులందుండును మతిభూవల్లభుండు తనదని యెంచునగ్ని వల్ల భయము నొందుచుండు వాయువు పెల్లురేగి పడద్రోయును వానకు దుల్లిపడును కుడ్యము లిట్టిదినా, యిల్లనియొక నరుడుల్లసిలు ॥ నేదీ ॥

చీమలు కరచును నెత్తురు నల్లులు దోమలు పీల్చును, జలగలు ద్రావును పాములు కాటందును నల్లి కళ్లపాములు శునకంబులు వేధించును. భయంకర మృగములు బాధించును. సామజంబు తొండమతో జీల్చును. నావే నిదియని సామాన్యజనము లామోదింతురు భూమి యందు ॥ నేదీ ॥

చోరులు తమదని యెంతురు బాంధవవారంబులు మాకిమ్మందురు. పరివారంములు తమదందురు. జ్ఞాతులు ధారుణీశ్వరులు తమదని యెంతురు కోరి యాచకులు తమదని యెంతురు కూరిచియుంచిన భూరిధనం బెవ్వారి కౌనొ యెటు జేరునొ గద ? ॥ యేదీ ॥
పాపపుణ్యములు రెండే నరునకు జేపడు సుఖ దుఃఖము లిచ్చుటకుగా పురుషులకిది జ్ఞాపకము లేక దాపై వేంకటదాసుని బ్రోచిన శ్రీపతి పదములు సేవింపరి ॥ కేదీ ॥

80

## కల్యాణి రాగము - ఆదితాళము

దిక్కేమున్నది ? ॥ యీ జీవాత్మకు ॥ దిక్కే ? ॥

ఒక్కడెవచ్చును భువిపైకి యౌవనము దక్కినప్పుడొక చక్కెర బోడికి జిక్కి పిల్లలను బెక్కుమందిగని మెక్కదిండిలే కొక్కెడ వృత్తుల నెక్కొని యిడుముల కిక్క యగుచు బలురొక్కము గూర్చి నిక్కుచుండ యముడుక్కున లాగగనొక్కడే లేచి తటుక్కున బోవును స్రుక్కిపొక్కి ॥ దిక్కే? ॥
నంతకుజేరిన వారలంతయొక చక్కిజేరి యెండబానినకై వడికాంతాపురుషులు బాంధవజనములు, సంతానము లొకయింటజేరి ప్రేమింతురొకరినొక్కరు సంబంధంబంత మొందినంత నెవ్వరికి వారరుగు చుందురెఱుగ రాదహో ॥ దిక్కే? ॥
దురితములకుదగినట్లు యముడు బహు నరకంబులద్రోయింపగ దత్కింకరులు వట్టి సలసల గ్రాగునూనె కాగులలో ముంపగ సహింపలేక హరరే ! యని దుఃఖించునప్పుడీ శరీరులనునాదరించుటకు ॥ దిక్కే ? ॥
చీమై పేనై దోమై యీగై పామై మృగమైపపశువై తరువై సామజమై సారమేయమై యెన్నో మేనులు ధరియింపుచు దుఃఖస్తోమంబుల పాలై జీవుడు తను దానేమియు నెఱుగకుండగా ॥ దిక్కే ?॥
దోసములడంచి వాసిగ వేంకటదాసునేలి కరుణాసముద్రుడై భాసిల్లు కనకవాసుడుగా కొకవీసమైన దిక్కేమున్నది ? 81

## తోడిరాగము - ఆదితాళము

చింతసేయండి ! మానవులారా ! ప్రాపంచిక పద్ధతి ॥ చింత ॥

ఎంత పాపమునకంత బాధ గలదెంత లేసి బలవంతులైన భూకాంతులైన సొమ్మెంత గడించిన వెంటరాదు దేహాంతమందునగృతాంతుజేరి దుర్దాంతబాధ చేవంత లొందెదరు ॥ చింత ॥.

తొమ్మిది కోట్ల తులాభారములకు నిమ్మె బంగరు నిల్వజేసి బీరమ్మున నవఖండమ్ము లేలి తన తమ్ములతో సైన్యమ్ములతో బలుసొమ్ములతో ముద్దుగుమ్మలతో సౌఖ్యమ్ము గన్న దుర్యోధనుండు సమరంబునందు గూలి త్రాగుటకు నీ రమ్ము లేక దుఃఖించెగా దె గపటమ్మున బాండవులకు గీడుసేసి ॥ చింత ॥

వనితలు పదివేల్తనయులు లక్షయు మనుములు మున్నూఱువేలు సైన్యము ధనముల గణ్యము గనియుంటిని నాకెనగా డొరుడని మనమున గర్వించిన రావణుడు సన్మునుల దూఱి జవ్వనులనేచి సురులనేడ్పించి రామునిచే జచ్చెడు తఱి స్వకీయ శవమును దహించు కొడుకు లేకపోయెను ॥ చింత ॥

కంటకునిమింటమంట తన జంటయైన నెఱబంటు లేడనుచు దొంటి జోదు గమి మంటగల్పి తెగగంటులతో బూవింటి దంట పనులంటి చేయు వేగంటి వేల్పు కొడుకొంటి బాణమున నీల్గునాడు వెన్నంటి కాచు ధీరులు లేరకటా ॥ చింత ॥

అకలంకుండగు విరాట నాయకుని భూరిసైన్య కదంబములకు నెకిమీడై నూఱుమంది కామినులకు తేడై నూఱుమంది సోదరులకు నన్నై గర్వించియున్న కీచకుడు యాజ్ఞసేని కోపంబుచే శకలములై మృతి జెందు కాలమందొకరైనను జాలిజెందరీ పన్నుకమెటింగి వేంకటాఖ్య వరదాయకుడగు విష్ణుని భజించువారికి సకలసైన్యములు వృద్ధిగాంచునని ॥ చింతన చేయండి ॥

## ముఖారిరాగము - ఆదితాళము

**తిండికొఱకెగాదా ? ॥ లౌకిక కార్యంబులు ॥ తిండి ॥**

బండెద్దులనావుల సమకూర్చుట, మండలాధిపత్యంబులు గోరుట, కుండలు చేయుట, బట్టలునేయుట, మెండుగ బొలములు దున్నుట. పైరులు పండించుటలుద్యోగమొనర్చుట ॥ తిండి ॥

వీపున మూపున బరువులు మోచుట, కాపరియైయడవులలో నుండుట ద్వీపాంతరములకేగుట వివిధవ్యాపారంబులుగావించుటయును, రేపుమాపువానకెండకోడక సాపరాధియై చౌర్యమొనర్చుట ॥ తిండి ॥

ఎన్నెన్నో వృత్తులు గావించుట లెన్నరాని బాధలు సహించుట కన్నవారి దండించుట, తమ్ముల నన్నల బాంధవులను వేధించుట మన్నీం ద్ర యుద్ధముగావించుట, యున్నది లేదని లేనిదున్నదని మిన్నక దబ్బఱ మాటలు పలుకుట, పున్నెమనినగోపించుట పాపంబన్ననెవరు గాంచి వచ్చి ? రనుటయు, మన్ననతో వేంకటాఖ్యునేలిన వెన్నునిభజింపదీర దనుటయు ॥ తిండి ॥

83

## సావేరిరాగము - అటతాళము

**వింతయై కనుపట్టునిమ్మేను ॥ తలపోసి చూడగ ॥ వింత ॥**

భ్రాంతులకు మూలమై తొమ్మిదికంతలకు నావాలమై యాద్యంతములు గల దైయజస్రమువంతలకు జింతలకు నెలవై ॥ వింత ॥

తల లలాటము భ్రూయుగము, కన్నులును జెక్కులు చెవులు నాసాబిలము నాలుక నోరు వక్షస్థలము దౌడలు భుజ శిరస్సులు వలుదచాచులు కక్ష యుగ్మము మొలనడుముతుందంబు చేతులు, బలుపిఱుందులు తొడలు మేఢ్రము నలఘుజాను యుగంబు పిక్కలు నలరుమడములు మీగాళ్లు పదతలము గళమంగుళులు గలిగియు ॥ వింత ॥

మలము, మూత్రము, చీము, చీమిడి, గులిమి, నెత్తురు, శ్లేష్మమును
పుసి, కు లుకలాలా పిప్పి కానఖములు తెమడ చెమ్మట యు రోమంబులు
శిరోజములును నరంబులు, తలరుధాతుత్రయము ప్రేవులు నలఘు
చర్మము ప్రాణపంచక, మొలయజీవుడు గలిగి మిక్కిలి ॥ వింత ॥
చలికినులుకును వానకోర్వదు, కలగు వాతాతపములకు నోర్వదా కలి
సహింపదు దాహమున నుత్తలపడునునిర్ణిద్ర కొప్పదు ॥ వింత ॥ భోగముల
చేనుల్ల సిల్లును రోగముల చేదల్లడిల్లును, రాగభరితంబైమె లంగు విరాగ
భోగ త్యాగములు కొనసాగ నీదు వికారములకిది, లోగిలోయన
కానిపించును ॥ వింతయై ॥

కామమోహక్రోధలోభోద్దామ మద మాత్సర్య దం భేర్ష్యా మహాహంకాం
రాజస తామ సాదుల కాలయంబై ప్రేమ వేంకటాదాసునేలిన శ్రీ
మనోహరు సృష్టి లోపల, నామరూపము లొందు భూతస్తోమములలో
గౌరవముగని॥ వింత ॥ 84

## బేయూగ్ రాగము - జుల్వతాళము

పామరులకెఱుంగ శక్యమా ? ॥ రామా ! నీ ప్రభావంబు ॥ పామ ॥
సామాది శ్రుతులకు నుద్దామస్మృతుల కితిహాస నామముగాంచిన
గ్రంథస్తోమములకు నే మొగాని ॥ పామ ॥

నినుగైకొని సవనావనమొనర్పించిన కౌశికుండు తన శాపము నీవు
వాపవనితయైన మునిపురంధ్రి విను సిగవేలుపు విల్విఱిచిన వేళల
జనకరాజు జనకజను పరిగ్రహించుసావి గన్న వైదేహులు తన
బలమాకర్షించిన వెనుక పరశురాముడు చింతన జేసిరి పరాత్పరుండని
మ్రొక్కిరి వినుతి జేసి ॥ పామ ॥

పంచాగ్నుల మధ్యంబునదపం బొనర్చు ధీరులు. మంచి నీరు మాత్రమే
భుజించు నిరాహారులు పంచలను ధరింపకయె చెరించు నిరభిమానులు

మించి వేదములెప్పుడు వల్లించు మరుద్భుక్కులు, వంచనలేనట్టి మౌని సంచయములు దండక నినుగాంచినంత శరణంబనిభాషించిరి పరమాత్ముం డనియెంచిరి యాతిధ్యం బొనరించిరి వైరి బాధలడగించుకొని సుఖించిరి హా ! ॥ పామరు ॥

నీకు ప్రాణములర్పించి వైకుంఠముగనిన పక్షి । నాకమునీచే గాంచిన విరాధు డక్కబంధుండు, వీకఫలములొసగి నిత్యవిభూతి గైకొన్న శబరి, నీ కాయాసము దీరిచి నిర్మల పంపా తటాక, మా కళిం చెగాని వేంకటాఖ్యవరద ! కొంతయైన ॥ బామరులకెఱుంగశక్యమా ॥ 85

## జంఝూటి రాగము - ఆదితాళము

**పామరులౌకవేళఁదెలియుదురు నీ ప్రభావంబు రామా ! ॥ పామ॥**

తామసరాజసములడుగంటి సుక్షేమంకరమగు సాత్త్వికమొదవఁగ ॥ పామ

పెక్కు వేలవర్షములు గడచిన రక్కసి చాన తటుక్కున వనినీ చక్కదనము గాంచి మరుని బారికి జిక్కి బొక్కి స్రుక్కి లోకమెల్లను ధిక్కరించి మేను విడిచి కంసుని, యిక్క జేరి యుండి కృష్ణుడగునిను దక్కించుకొని యెనందరు సూరులు ॥ పామ ॥

చెట్టు చెట్టునందు నీ రూపంబుట్టి పడగ గనుగొని మారీచుడు తుట్టతుదకు బువ్వమాని నిద్దుర గట్టి వైచి భయమున రావణుగని, మిట్టిపడుచు రాఘవుని తోడబగబెట్టుకొంటివేని చత్తువనినీ దిట్టతనము గట్టిగా నుడివెగద ॥ పామ ॥

అకంపనుడు మాల్యవంతుండు కుంభకర్ణుండు మందోదరి రావణునకు, బోధించిరి నీ మహిమము వేఁటొకప్పుడా రావణుండు నీ, సాయకాళి చేనొచ్చి రామచంద్రుం డకలంకుడు నారాయణుడని పేరుకొనెగాదె వేంకటాఖ్యవరదా ! ॥ పామ ॥ 86

## నాటరాగము - ఆదితాళము

తిర్యగ్జంతువులయ్యు గొన్ని నిను దెలిసి కొని కొలిచె రామా ! ॥ తిర్య ॥
ఆర్యులమని గర్వించి వృధాదినచర్య గడపు నరుల కంటె మేలై ॥ తిర్య ॥
సేతువు బంధించెడు తరి వానరసేన గలిసి పని జేయుచు, సికతా
భూతలమున బొరలుచిక్రోడమును ప్రీతితోడ రక్షించి నావుగద !॥ తిర్య ॥
ధారుణీసురుని చేదెబ్బలు దిని సారమేయ మొక్కండయోధ్యలో జేరి సారె
సన్ను తిసేయుంగనపార కరుణతోడ బ్రోచినావట. ॥ తిర్య ॥
కులాయ విఘ్నముదొలంగింపుమని, యులూకంబు వేడగా గ్రద్ద నొక
యిలాధిపుని జేసి గూబకోరికె ఫలింపించి నావని విందునహా !॥ తిర్య ॥
ఎలుగుగొడ్లు క్రొండ్రముచ్చులును, కోతులగముల్ భవచ్ఛాసనంబు చేమలు
మోచి తెచ్చి సేతువ మరిచి జలనిధి తరించి పలాశనుల నిమ్ముల వధించు
టాశ్చర్యము కాదే ? జలజనాభ ! వేంకటాఖ్యవరదా ! ॥ తిర్య ॥87

## సింహేంద్ర మధ్యము - ఝుల్వతాళము

బలు విస్మయమగుగదా ! రామా ! ॥ గుణధామా ! రిపుభీమా ॥ బలు ॥
యిలలోన జనించినీవు నలిపిన పనులాలకింప, ఖలురకైన
విబుధజనావళులకైన సురలకైన ॥ బలు ॥
రాతికి బ్రాణము గూరిచి నాతిజేసి వెలయించుట, చేతనిమిరి గృధ్రంబును
భూతలనాథుని జేయుట, కోతి తెగల నుడులచే సంపాతిఱెక్కలొదవించుట
దూత చేత లంకాభిఖ్యాతతపురి గాల్పించుట ॥ బలు ॥
కబంధమున గల జీవికి బుధాకారం బొసగుట, శబరీఫలములు దిని
మోక్షసామ్రాజ్యమొన గూర్చుట ॥ బలు ॥ నిరంతరము నీ సన్నిధి
జరించిరని యయోధ్య గల, చరాచరప్రాణులకు బ్రశస్త
ముక్తిదానమిడుట ॥ బలు ॥
చిన్ననాట నుండి కొలుచుచున్న వేంకటదాసుడు చేయు విన్నపమాలకించి
చేసన్నజేరి కావకుండుట॥ బలు ॥ 88

## తోడిరాగము - ఆదితాళము

శరణంటిరామా ! ॥ నీ చరణాబ్జములకు గరములు మోడిచి ॥ శర ॥
పరదైవంబులదరిజేరకయీా, ప్రపంచ భోగములకు నాసింపక, పురాయించి వేధించెడు పాతక, పరంపరా ధాటి కోర్వజాలక ॥ శర ॥
వాసనాత్రయము, దురాసదమగు నరిషడ్వర్గము, నన్నీనడించి గాసి పెట్టుచున్నవి తీసివేసి నిర్మలు జేయుదు వని ॥ శర ॥
భరతాళ్వారికి శతఘ్నునకు వరజుండగు లక్ష్మణునకు గాడ్పు కొమరున కొసం గినసు జ్ఞానమును, స్థిరాశయయుభక్తియునిచ్చెదవని॥ శర ॥
దుందుభి దేహము జిమ్మినట్లు నాయందు జేరియున్న భూరికిల్బిష బృందమునెగ మీటిప్రోవగలవని సందియములు మాని వందనములిడి కిరాతుచే బూజలు గొనునప్పుడు, కిరాతికపవర్గం బిడువేళల, నరాతి సోదరునిబ్రోచు తతిబక్షిరాజునకు మోక్షమిచ్చునప్పుడు పరిగ్రహించిన దయారసము చే నిరంతరము రక్షించెదవని సంస్మరింపుచుంటిని జానకీమనోహరా ! వేంకటాఖ్యవరదాయకా ! ॥ శరణం ॥ 89

## మధ్యమావతిరాగము - అటతాళము

ఎక్కడైన వెలుంగుచున్నాఁడు ॥ పరమేశ్వరుండఘ భుక్కులగు వారలకు గనరాడు ॥ యెక్కడుండు పరాత్పరుండని ధిక్కరించిన మాత్రమున నయ్యుక్క కంబమునందు గనబడి రక్కసుని దునుమాడిబాలుని చిక్కులను దొలగించి యధ్వర భుక్కదంబము బ్రోచికీరితికిక్కయగు జగదీశ్వరుడుఁ తా ॥ నెక్క ॥
నలుమొగంబుల వేల్పునెవ్వడు నాథుడై నిర్మించెనో ? ప్రళయమందు మృకండు పుత్రుని ప్రాణమెవ్వఁడొసంగెనో ? కలతజెందిన ద్రోవదికి

వలువలనెవ్వండొనc గూర్చెనో ? జలధిలో సత్యవ్రతావని జానినెవ్వcడు బ్రోచెనో ? కలిమి కొమ్మకుc బంటవల c తికి కాంతుడై విలసిల్లు నెవc డజ్జలజనేత్రుడు భూతకోటులెలమితో రక్షించువాcడై ॥ యెక్క ॥
భూమిపైరాకుండవార్ధుల నేమహాత్ముcడదల్చునో ? లలివామనేత్రలభూరి పాతివ్రత్యమెవ్వండోమునో, దామసుల దండించి సాధుత్రాణమెవ్వడొc నర్చునో ? సామమువనెవ్వండు ధర్మస్థాపనము గావించునో ? సోమ సూర్యుల నడపునెవ్వcడు ? మహీస్థలి నిలుపు నెవ్వcడు ధూమయోని నొనర్చెనెవ్వcడు భూమిజంబుల జేసె ? నెవ్వాcడా మహాత్ముడు వేంకటాఖ్యుని కామితార్ధము లిచ్చు వరదుం॥ డెక్క ॥ 90

## కాంభోజిరాగము - జుల్పతాళము

రాముని మహిమంబు గనండి ॥ పామరులారా ! వ్యామోహము చేc జెడకండి ॥ భామామణి యగు పార్వతి వామదేవుcడ రవిందభవా మరేశ్వరాదులు భక్త్యతిశయమునc గొలుచుచున్న ॥ రాముని ॥
చిననాడే ముని వెంబడిజని తాటకదునుమాడెను పనివడి జన్నంబుగా చెను విఘ్నకరులైనదను జానీకముల జంపెను, పాషాణమైనవని తాశాపంబు వాపెను భర్గుని చాపము గొని యొక త్రుటిలోనc ద్రుంచెను జనకజ తోజని ఘనపరశుధరుని జయించెను కనువారికి విను వారలకు గూడ విస్మయమొనcగూర్చెను ॥ రాము ॥
విరోధమున నిరోధించు విరాధుని వధించి మౌనివరేణ్యులకు నభయమిచ్చి ఖరాసురుని సంహరించెను దూషణత్రి శిరాదుల ననిన్ వధించెను పదునాల్గువేల సురారాతిచయముద్రుంచెను. ఋషిప్రవరుల వరాశీస్సులను గ్రహించెను. శరభంగాగస్త్యసు తీక్ష్ణ ప్రముఖాఖిల యోగీశ్వర వినుతుల కర్హుడైన పరాత్పరుడు నిరామయుcడు॥ రాము ॥

ఖగపతికపవర్గ సుఖము కబంధునకు నాకము సొంపుగమోక్షము శబరికిచ్చెను పంపాసర సికరిగి విచారమునకు జొచ్చెను హనుమ తోడజని పగటి దొర కొడుకు మెచ్చెను వాలిని వధించి నగచరరాజ్యంబునిచ్చెను నగచరవాహిని తో బహునగములు దెప్పించి వార్ధినిగరువమున బంధించియు బగతునితమ్ముని బ్రోచిన ॥ రాము ॥
తరసాశనులను వానరవరులచేత వధింపించి సురవరశత్రుని నతికాయు సోదరుచే గూలిపించి సరగున ఘటకర్ణుని జంపెను రావణుని జంపి సురులకు సంతోషమొసగెను జానకి సహోదరులగూడి రాజ్యమేలెను ఈ చరిత వాల్మీకి చెప్పెను రామాయణమున బరగి ముల్లోకముల నుండెను పాఠకులకు నిహపరముల సౌఖ్యంబులిచ్చెను కరువలినిసుగెఱుగు దీని తెరుపు మరుపు వేంకటాఖ్య వరదుండై జగముల సుస్థిరముగ రక్షింపుచున్న ॥ రాముని ॥ 91

## కాంభోజిరాగము - అటతాళము

పాదముల్గొని యాడెద ॥ శ్రీరామా ! నీ ॥ వేదశాస్త్రములందు వేదాంగముల యందు వేదాంతముల యందు వినుతి గాంచిన దివ్య ॥ పాద ॥
హలకోదండాంకుశ జలజాత ధ్వజ శంఖ, కులిశర ధాంగ నిర్మల చామీ కరచ్ఛత్రాద్యలఘు రేఖలు గలిగి పల్లవములకు రక్తాంబుజములకునుజ్జ్వల విద్రుమంబులకు నీడై తలత్తల యని ప్రకాశించెడు ॥ పాద ॥
వాసనాత్ర మెడబాసి సకల యోగాభ్యాసము చేసిద్ధులై సదావిలసిల్లు వ్యాస నారద శుక పరాశర శ్రీసనందశౌనకాది సుధీ సమూహాశయములందున భాసమానములై వసించెడు ॥ పాద ॥
ఉరగేంద్రుడగు కాళియోత్తమాంగమునందు సురు చిరమణులచే జుట్టితికము జేసి సుర నిశాచర రుద్రువసుఖేచరతుషిత గంధర్వ కిన్నర

గరుడ కోటీరస్థమణి సంఘము నొరసి వెలుగొందు తావక ॥ పాదము ॥
సకలానిష్టంబుల సమయించి వాంఛిత ప్రకరఫలంబుల బ్రాప్తింపగా జేసి సుకరముగనిల వేంకటాఖ్యనలికమునందు శిరస్సునందున నకలంక హృదయంబునందు నిజాక్షులందు వసించు తావక పాదముల్ ॥ శ్రీరామా ! ॥ 92

## సింహేంద్ర మధ్యము - ఝల్పతాళము

**తల్లీ ! జానకమ్మా ! ॥ మము దయజూడు మమ్మా ! ॥ తల్లీ ! ॥**
ఎల్లజగము లేలురామునిల్లాలవు సుమ్మా బల్లిదుఁడగు జనకరాజు పిల్లవు నీవమ్మా ! నాయుల్లములో నుండుము నీ పిల్లవాడనమ్మా ! చల్లని కృపనాపై వెదజల్లవెబంగరు బొమ్మా ! ॥ తల్లీ ! ॥
అయోనిజాతవుగా నీ వవతరించినావు, నయవిదుఁడగు జనకుని సదనమునఁబెరిగినావు భయపడిననిశాటీజన ప్రాణమొసగినావు ద్దయతోడను మమ్మేలగదగియున్నా వలివేణీ! దశరధసుతురాణీ ! సుందరాంగి ! పికవాణీ ! రక్షితభక్తశ్రేణీ ! వందిత పద్మజురాణీ ! నిర్జిత నేత్రవరైణీ ! మొవ్వ వేంకటాఖ్య పోషిణీ ! ॥ తల్లీ ! ॥ 93

## దేవగాంధారి - ఝల్పతాళము

**వాడు కృతార్థుండు ॥ శ్రీవరునిపదాబ్జములు గొలుచు ॥ వాడు॥**
వీడు దుర్హృదుడని వాడు బాంధవుడని చూడకెవ్వరికైన గీడు చేయకలచ్ఛితేడు దిక్కని కొనియాడు చుండునట్టి ॥ వాడు ॥
దురిత మొనర్పద్యూతంబులాడక పరుల బీడింపక పాపుల జేరక పరుసముల్పలుకక తరుణుల గోరక హరికృష్ణ! గోవింద ! వరద ! యని భజించు ॥ వాడు ॥

ఇతిహాసములు శ్రుతి స్మృతులు పురాణ సంతతులు సత్యంబనిమతిలో
నమ్మి తత్త్వత్రితయము దెల్పిన మతగురునిపై భాగవతులపై
సుప్రేమాన్వితుడై కేశవుగొల్చు ॥ వాడు ॥
జీవులైన నానా దేవతలను గొల్చియేవేవో స్వల్పఫలావళి నార్జించి
దేవురించక దేవదేవుడై మహానుభావుడై పరవాసు దేవుడై వెలుగు
సీతావిభునర్చించు ॥ వాడు ॥
శూరులు బలుజమీందారు లుత్తమశాస్త్రధీరులు సుందరాకారులద్భుత
కామచారులు తొల్లింటి వారలెచ్చటి కేగినారో కాని కానరారొక్కరైన
సంసారంబిట్టి నిస్సారంబనుచు రోసికోరి వేంకటదాసాధారుడై ప్రోచు
కంసారి భజించిన వాడు కృతార్థుండు ॥ 94

## సురటరాగము - ఆదితాళము

**భక్తిరాజ్యమార్జించండి ॥ నరులారా ! శ్రీహరి ॥**

భక్తిభక్తియనెడు గౌరవ శబ్దము హరిభక్తికి జెల్లుంగాని తదితరాసక్తికి
బొసగదు, కావున గేశవ భక్తిరాజ్యమును సంపాదిం చిన ముక్తి రాజ్యమున
కధిపతులౌదురు ॥ భక్తి ॥
తనయాదులపై నున్న మోహమని వనితలపై గలిగిన కామంబని
వనీపకులపై నున్న కరుణయని ఘనవయస్యు లందున్న జెలిమి యని
జనపతులందున్నప్పుడు నీతియని జనకాదులపై నున్న నోరుపని,
వినుతి గాంచు గుణము శౌరిపదముల నెనయు నపుడు భక్తి
నామమొందిన ॥ భక్తి ॥
పదివే లేడులు తపంబొనర్చి ధనదుడార్జించిన సంపదనొందెను గద
కుచేలముని, భావివిరించనపదమొందెను సామీరి సుందరా స్పదయై
వెలసె్రదివక్ర నవోన్నత పదవి నొందె నౌత్తానపాది సత్పదవుల కన్నిటికిని
మూలంబగు ॥ భక్తి ॥

హరిభక్తి రాజ్యరతులగు వారికి, బరి పంధులు లేరు దండెత్తి యెవ్వరునుడీ కొనరు సురలప్సరసల, బురి కొల్పరు మన్మథుండు వనితా, పరంపరాధీనమ చేయలేడు, దరిజేరదు యమకింకరాళియము దరసి నరకము లోసంగడు వివిధాంతరాయములు చేరవు జన్మంబులు, పొరయ వఘుంబులు బెరయవెప్పటికి ॥ భక్తి ॥

యాగకర్తలకు, భోగసహితులకు, వాగీశ్వరులకు, ద్యాగశీలురక్క, రాగరహితులకు, నాగమవిదులకు, నోగుగల్గునది రాగోరదు మన భోగి శయను పదయోగము గల్గిన భాగవతులపై నీ గతి నారసి భక్తిరాజ్య మార్జించండి 95

## కమాచిరాగము - ఆదితాళము

ఏ విధమున నను రక్షించెదవో? ॥

యిన వంశాంబుధి పూర్ణచంద్ర నీ ? ॥ వేవి ॥

కోవిదులు పతిత పావనుడని నానా విధముల నిను సేవింపుచుందు ॥ రేవి ॥

జనకుని వలె గర్మయోగముననే సమర్థుండగాను ఘనుడగు జడ భరతుని వలె జ్ఞానము గలవాడను గాను పనిబూని భక్తిచే మెప్పింపగ బ్రహ్లోదుడగాను, మును ప్రపత్తి చేగొలిచిన శుకాదిముని సంఘముగాను, పనికిరాని వాడని త్రోయకనే డనురాగముతో గటాక్షించి నీ ॥ వేవి ? ॥

సరమా పతిగతిద్వద్విరోధి నిరసనము దెలుపలేను, జరీనజటాయు వట్లు ప్రాణములు సమర్పింపలేను, కరివరు గతి వేయి వర్ణముల నుతిగావింపగలేను, నరాది పాండుకుమారుల వగ బాంధవము నెరపలేను, నిరంతరము వేంకటదాసు నేలు వరదుడవని నెఱ నమ్మినందులకు నే విధమున నను రక్షించెదవో ? ॥ 96

## శ్రీ రాగము - ఆదితాళము

వినుతించెదన్ ॥ విష్ణుదేవ నిన్నే ॥ విను ॥

సనక నారదాదిమునులకెల్ల కాలమును జీవనంబై తనరారు నీపావనావతారములవతారవేళ, గనబరచిన నానావిధాకృతులు వినిచిన సరసాలాపంబులొనర్చిన దివ్యాద్భుత చేష్టలునే ॥ విను ॥

హలచ్ఛత్ర శంఖ కులిశ కోదండ జలజాత చక్ర లలిత మత్స్యాంకుశ దలఘురేఖలు హయ ద్విపచామరతులిత రేఖలు, గదాధ్వజనిభ రేఖలు, ధాన్యస్వాపతేయ రేఖలు, గలిగిన నీ పదకరతలములు ॥ విను ॥

పసమీఋ శోణబిసరుహోపమములై యసిదాల్చిబలరాక్షసుల సంహరించి, యసమానాభయ దానదాన కార్యసాధనములై లక్ష్మీస్తనముల వసతిగాంచి సమయోచితముగ నవరసములు దాలుచు నీ పాణులు ॥ విను ॥

జలరుహంబు నీని నలువనందులోన గలుగజేసి యొప్పు లలితనాభి గల్గి జలజభవాండంబులు సృష్టివేళ వెలుపల నిడి రక్షించి విలయవేళల లోపల నిడి సర్వభూతముల నెలమి బ్రోచునీపిచండంబు ॥ విను ॥

పరిపంథి బాణోత్కరాభేద్యమై పీవరంబై విశాలకరంబై స్థిరంబై, సిరికిర వై కౌస్తుభోపేతమై హిరణ్యమణిహారాలంకృతమై నిరంతరము వేంకటదాసహృదయ సరసీజధ్యేయోరస్సును ॥ విను ॥ 97

## సావేరిరాగము - ఝల్పతాళము

మన్నేల తిన్నావురా ? । కృష్ణా ! నీవు మన్నేల తిన్నావురా ? గారెలు, బూరెలు, కజ్జకాయలు, పంచదారలు,పూరీలవ్వారీగ నుండంగ॥మన్నే ॥

ముంతమామిడి పళ్ళుబొంత అరటిపళ్ళు యింత పనసపళ్ళు ఎన్నెన్నో ఉండంగ ॥ మన్నే ॥

వెలగరేగు పండ్లు విమల దాడిమ బీజములు కండచెక్కెర పూదే నెలుండంగ ॥ మన్నేల ॥

వెన్న, పాలు, పెరుగు, జున్ను, మీగడలు ఎన్నెన్ని మనఇంటనున్నాది
ఎరుగక ॥ మన్నేల ॥
చెలగి వేంకటదాసు శ్రీకృష్ణ ! నినుగూర్చి బలువేడ్క వివరించు
పద్యాలాపములుండ ॥ మన్నేల ॥ 98

## ముఖారి రాగము - అటతాళము

నే వెట్టి నా తల్లిరో ? మన్ను తినగ ॥ నే వెట్టి ? ॥
మన్ను తిన్న జాడయున్నచో నా నోరు
కన్నులారగ జూచి మన్నింపవలదింక ॥ నే వెట్టి ? ॥
అన్న రాముని కన్న మిన్నగనను జూతు
వన్న కీలెరిగి యిట్లన్నారేమో ? గాని ॥ నే వెట్టి ? ॥
ఈ విధమున నాపై నేరములు కల్పించి
ఎవ్వారు చెప్పిరో ? విరోధము తోడ ॥ నే వెట్టి? ॥
ఇందులకు సందియంబు చెందినాను నాపదార
విందములు భజియించు వేంకటాఖ్యు నడుగుము ॥ నే వెట్టి? ॥99

## కాంభోజిరాగము - అటతాళము

పరమాత్మ ! నీ మృదు పాదముల కే మ్రొక్కెద యశోదనందనా !
యశోదనందనా ! । ఆశ్రితచందనా !
ఆశ్రితచందనా ! । వారిధిబంధనా ! ॥ పరమా ॥
శరణంచు బల్కినగాని సద్గుణజాల ! మొరనాలింపవేమిరా ? ॥
నాలింపవేమిరా ? ॥

పాలింపరావేరా ? మేలనుచు నీకురామేలన శ్రీధరా ! ॥ పర ! ॥

ధరలోన నీ సరిదైవమరుదని దలచెద దితి పుత్రఖండనా ! దితిపుత్ర ఖండనా ! నిఖిలారి భంజనా ! ।

నిఖిలారి భంజనా ! నిస్తుల భండనా ॥ పరమాత్మ ॥

వరపూడి వాడనివాసు వేంకటదాసుని దయజూడరావ

య్యా ! ॥ దయచూడరావయ్యా ! । దండన లేలయ్యా ?

మురవైరి ! రావయ్యా ! । నా మొర వినవయ్యా ! ॥ పరమాత్మ ! ॥100

## దేవగాంధారము - ఆదితాళము

**ఎందునున్నావో ? మురారి । నీవెందునున్నావో ? మురారి**

కుందరదన । ముచికుందవరద । నందనందన । మునిబృందవందిత పాదారవింద । యనుచు మది యందున నెన్నెన్నొ చందంబులను వేడికొందలపడి, శరణొందిన, నీ దివ్య సుందరాంగము స్వప్నమందైన జూపింపకెందునున్నావో । మురారీ । నీవెందునున్నావో ?

పాహియనినయంత పరుగున చనుదెంచి । మడుగున కరిరాజు మోదమందగ జేసి, యినపుత్రునకు నెల్ల యిడుముల తొలగించి, ఆంజనేయాదుల కానందమొగి గూర్చి, గోవిందయనినంత కోమలి కృష్ణకు కురురాజు సభయందు కష్టములు తొలగించి, పాండుకుమారులకు ప్రాభవము కల్పించి, మాల్యములొసగిన మాలాకారుని బ్రోచి, బాల్యమిత్రుడైన బ్రాహ్మణుని కరుణించి ఇంద్రాదులను మించు వైభవమొందించి, యుగయుగంబునందు వెలయుదునని పల్కి కలియుగంబునందు కొలిచెభక్తులందు కనికరంబును మాని కన్పించకుంటివి ॥ ఎందు ॥

కవ్వడి చెలికాడ । పువ్విలు కాని తండ్రి । నొవ్వులడచ్చు
ప్రోడమవ్వంపువగకాడ । దవ్వులనుండక । రవ్వసేయక, రివ్వు రివ్వున
చనుదెంచి మొవ్వ వెంకటదాసు నొవ్వులనడగించి యివ్వసుంధరయందు
ననుబ్రోవకెందునున్నావో ? మురారీ । నీవెందునున్నావో మురారి ॥ 101

## సావేరి రాగము – అటతాళము

ఎన్నటికి వీక్షింతునో । లక్ష్మీశతావక వైభవమునే నెన్నటికి॥పున్నెముల
గనులగు కరంబులు, తిన్ననై సన్ననగు మధ్యము క్రొన్నెలకు నీడగు
నొసల్కరి సన్నిభంబగు గమనమును గల నిన్ను గన్నుల కఱవు
దీరగ ॥ నెన్నటికి ॥

భముల నేలు మహానఖంబులు సుమములకు బదులిచ్చు తావులు
కమలదళముల నేలు నంగుళి సముదయము, సుమశరుని గాంచిన విమల
వైఖరి, నిత్యతారుణ్యము కరాంఘ్రి తలంబులంద నమరు కులిశధ్వజశరాసన
ప్రముఖరేఖలు గల నిన్ను నే ॥ నెన్నటికి ॥

చారుతర శృంఖల సమేత కటీరమును గాంగేయ చేలాధారమైన సువృత్త
శ్రోణులపార గాంభీర్యంబు కాంతి కృపారసము లావణ్యము
రుసుకుమారతయు సర్వాంగ సౌందర్య రూఢిచే విలసిల్లు ॥ నెన్నటికి ॥

సిరికి సిరియై పరిమళములకు । బరిమళంబై శుచికి శుచియై,
సరస్వతి కొగి సరస్వతియై పరమ శుభముల కురు శుభంబై తరణికిని
దరణియై పూతోత్కరములకు బూతమై జీవనసరణులకు,
బురుజీవనంబై సరివి వేంకటదాసుడడిగిన వరములిచ్చు భవత్సు
రూపంబెన్నటికి ॥ వీక్షింతునో ॥ 102

## శ్రీరాగము - అటతాళము

వలపేల కలుగకుండు । జలజాక్ష నీ రూపంబు దలచిన ॥ వల ॥

క్రలికి మిన్నుల జెప్పనేల సకల పదార్థ నిచయములందున దలపు లేదినా యోగిసత్తము లెలమితో గనగోరు నీ పై ॥ వలపే ॥

యిల్లు వాకిలి బాసి పిల్లలనెదరోసి తలిదండ్రులనేది వల్లభులను విడిచి పల్లవ స్త్రీనికరములు జాబిల్లి యల్లుని భల్లములచే దల్లడిల్లుచునిన్ను జేరి మహోల్లసంబున సౌఖమొందిన ॥ వల ॥.

చాలుగా బది యారు వేలభామినులు నీ పాలిటి కరుదెంచి మేలి సోయగమెంచి నీలమేఘశరీర । మమ్ముల నేలుకొమ్మని భార్యలై పరలాలసలు విడనాడి నిన్నే రేలుపము భజింపలేదా ? ॥ వల ॥

నారీపురుషులకుండు తారతమ్యమెఱుంగనేరని, వైరాగ్యనిధియైన శుకయోగి, నారదుడు, శౌనకుడు, వ్యాసుఁడు, హారీతముఖ మహామౌనులు సారెకును వినుతింపరే నీ జారచోరత్వాది చేష్టలు ॥ వల ॥

భూరిరోగికి బక్వాహారము చేదైన తీరునదైతేయ వారములకు నెగ్గై ।కోరి ధ్యానమొనర్చు వారి కపార సంపద్దాయ కంబై సూరి నుతమై వేంకటాఖ్యాధారమగు నీ రూపుగాంచిన॥ వల ॥ 103

> శ్రీ వేంకటదాస స్వామిగారు రచించిన హరికథలు మొత్తము పదునారు గలవు. హరికథా వరండమని లేక హరికథాషోడశారమని ఆసముదాయమునకు పేరు. అందుండి మచ్చునకు ముచ్చటగా మూడు కీర్తనలు.

## శ్రీ విష్ణుస్తుతి - ప్రార్థన

### కల్యాణి రాగము - ఆదితాళము

కమలాపతీ ! ॥ కమలాపతీ ! ॥

విమలాం తరంగ! విహ్మిర తురంగ ! కమనీయశీల ! కరుణాలవాల ! ॥ కమ ॥.

విరించి మును నిను గుఱించి తపంబొనరించి కృప సేకరించి సృష్టి సవరించి యుండ నితరుల్ భవత్పద సరోజములు సంస్మరింపకెటు కాంతురీ హాలను ॥ కమ ॥.

పలాశనులు, సమనిలింపులును మోవలేని మందర శిలోచ్చయము బెండులాగునను పైకి లేపి నిర్జర కులంబులకు నమృత లాభమొసగిన బలుండవని చేతులొగ్గితిని ॥ కమ ! ॥

తటాలునను వేంకటాఖ్యుడగు నాకిటన్ మిగులబానటై మాధురీస్ఫుటంబులగు వాక్చటల్ రసనపై నటింపించి ప్రోచు టొప్పునని యాదటం దలతు ॥ కమలాపతీ ! ॥ 104

## శ్రీ మహాలక్ష్మీస్తుతి - ప్రార్థన

### నాదనామక్రియ రాగము - రూపకతాళము

సరసీ జాలయా ! ॥ సరసీజాలయా ! ॥ క్షీరసాగరతనయా ! ॥ సరసీజాలయా ! ॥

నిరంతరము నీదు పదాంబురుహంబులు స్మరియించెడు, నరునకునే కష్టంబులు పొరయవు త్రిభువన జననీ ! ॥ సర ॥

చేతనులకు సౌందర్యము (స్థిర) చిరయశంబు తేజము, విద్యాతి శయము నైపుణ్యము, నీతియు, జ్ఞానము, సత్యము, పాతివ్రత్యము గల్గిన భార్యలు,

సుతులంబరములు, మాతా ! నీకారుణ్యము చేతనె సమకూడు గదా ! ॥
సరసిజా ! ॥

నీ సుతుడగుమరుడు సుమేష్వాసంబున జయించు గాదె సర్వజగములు హేమ వాసుడు నీ ప్రాణేశ్వరుడై సర్వేశ్వరుడనంగ భాసిల్లెను వరవేంకటదాస పోషిణీ ! మదంబ ! ॥ దయగను సుగుణ కదంబా ! ॥ సరసిజా ॥105

## యుధిష్ఠిరాశ్వమేధము నుండి

## కేదారగౌళరాగము - త్రిశ్రజాతి

వచ్చెను జనార్దనుండు ॥ హస్తిపురమునకు వే ॥ వచ్చెను ॥

మచ్చిక పృథా సూనులిచ్చను దలంచుపనినచ్చుగ నొనర్తునని హెచ్చి నముదంబుతో ॥ వచ్చెను ॥.

బృందారక సపర్యలొందు పాదములతో, నిందిరాదేవిచే నందమగు నురముతో, గందర్పకోటి నిభ నుందరాంగంబుతో, గుందరదనములతో, మందగమనంబుతో, సుందరోదరముతోఁ జిందు కనికరముతో ॥ వచ్చెను ॥

హరినీలమణుల నెగ్గాడు వాలములతో, గరము రాణించు, ముక్తాహారపాళితో దరళాంగదాదిరత్న విభూషణములతో, వరకౌస్తుభముతో, శ్రీ వత్సలాంఛనముతో, సిరులతో, దావిపూసరులతో, సోగముంగురులతో బాలభాస్కరతుల్య దీప్తితో ॥ వచ్చెను ॥

భములతో నమృతఫేనములతోగా శదుగ్ధములతో, చంద్రకిరణములతో, సింహ వజ్రములతో గంగాజలములతో విమలుడై ॥ వచ్చెను ॥

దండమని వేంకటాఖ్యుండు మొఱవెట్ట విని దండకరుదెంచి నేనుండ
నీకేల ? కలగుండని వచించి దయ నిండిన మనస్సుతో నండక్రై
బ్రోచు వేదండవరదుండు కృష్ణుండు ధర్మజుని గన వచ్చెను
జనార్దనుండు ॥

106

## గద్యము

ఇది శ్రీ సీతావల్లభ ప్రసాద సమాసాదిత కవితాప్రవీణ వేదాల
సీతారామాచార్యకృపాలబ్ధమంత్ర రత్నాను సంధాన పవి
త్రాంతరంగ నిఖిలదుర్మత శిలోచ్చయ దంభోళీభూత
సముద్రాల లక్ష్మణాచార్యానుగ్రహబోధిత విశిష్టా
ద్వైతరహస్యార్థ ధురంధర శఠగోపయతిరాడ్వ
రవరయోగిప్రభృతి పూర్వాచార్య చరణ
సరోజ భ్రమరాయమాన మొవ్వ వంశ
తిలక కృష్ణాంబాకృష్ణమార్య తనూజ
శ్రీ వైష్ణవ విధేయ వేంకటదాస
నామధేయ ప్రణీతంబైన
భాగవత సురభూజము
నందు తృతీయ భాగము
సంపూర్ణము.



# పండరినాథుని కీర్తనలు

విఠలనాథా ! ఏమిసేతును ? ఎటులదోచదునామది కఠినపాతకపటలమెల్ల కాల్చివేయవె నెమ్మది ॥ విఠల ॥ పండరీపురమందున నీవుండి నావని యాశతో దండిగానరు దెంచి వెనుకకు వెళ్ళవలసె నిరాశతో ॥ విఠల ॥ ఇంతనిర్దయశాలివని నేనెఱిగివుంటేరానురా ! పంతనంబులు మంతనంబులు మానరాదా ? ఇకబుద్ధితో॥ సరసిజేక్షణపుండరీక వరద తామరసోదరా ! ధరణిలోపల మొవ్వవేంకటదాసునేలుదయాకరా ॥ విఠల ॥ 107

మంగళము శ్రీ పాండురంగా ! । మాధవా ! యదునందనా ! అంగజారాతివిలుఖండనా ! । సంగవిరహితచందనా ! విఠలనాయక ! కుటిల దానవపటలసంహర ! శ్రీధరా ! శరుడనని విడనాడెదేమో? చెల్లదది దామోదరా జ్ఞానదేవుని మానసాలయ ! దీనజనసంరక్షణా జ్ఞానహీనుడ జ్ఞానమొసగర ! శ్రీనివాస ! శుభేక్షణా ! వాసిగా శ్రీ పూడివాడని నివాసివై యున్నావురా ! దాసదాసుని మొవ్వవేంకటదాసునేలు దయాకరా ! ॥ మంగ ॥ 108

## ఏలపాటలు

గోపికాహృద యాబ్జభృంగా ! తాపసానీ కాంతరంగ, ప్రదీప ! నిన్నే వేడుచున్నాడ ! నో పాండురంగా ! సాపరాధిని కోపమెంచకు, మార్తిజెంది నిన్ను మనస్ఫూర్తిగా ధ్యానింపఁబ్రోచుటకీర్తికరమైయుండునేగాదా ! ॥ ఓ పాండురంగా ॥ కార్తికేయాదిస్తవరార ! భక్తియను జీతంబునీవు భక్తులతో జెందుచున్నావు, భక్తుడనునను గావకున్నావు, ॥ ఓ పాండురంగా ॥ నీ శక్తి కినిమోసంబువచ్చును. వారిజాక్షా ! మిమ్ముదలఁచి ఘోరముగనేడ్వఁ జెవులకునారసములై సోకగాలేదా ? ॥ ఓ పాండురంగా ॥ మారుమాటలు వల్కగారాద నీ దివ్యనామముల్లలోనే దైననొక్కటి జన్మపాథోధి

నిదాటజేయుననియో పాండురంగ వేదములు వెుఱబెట్టుచున్నవి.
పెక్కుయోనుల యందుబుట్టి పెండ్లాముబిడ్డలని భ్రమిసియిక్కడికి
విసుగుబుట్టెను. ఓ పాండురంగ యొక్కనిముసమునిన్నువిడువను. నన్ను
నీవు చేపట్టువరదాకా నీ పాద పద్మములు విడువకుండేనూ ! 109

పుండరీకాక్షా ! ముకుందా ! పుండరీకదాసవరద కుండలీశ్వర భోగితల్పకా
॥ ఓ పాండురంగా ॥ నిండు మోదముతోడ వేఁడితి నిర్వికార ! నిష్కలంకా
నిర్విచార ! నిష్ప్రపంచ ! నిర్వాణ ప్రద ! నిఖిలలోకేశ ఓ పాండురంగా
।సర్వాధారా । సత్యసంచార ! కండలెముకలునెత్రుమాంసము కల్గిగిన
దేహంబు నమ్మికొండలుగ బాపములు జేసితి, ॥ నో పాండురంగా ॥
దండధరుని బారిద్రోయకు ! నరక స్వర్గములొంది గర్భ నరకముల
బడినప్పటికి నిదివరకు సిగ్గులేదు నామదికి ! ॥ నో పాండురంగా ॥
మురికిదేహము తొలగజేయరా ! సత్యచరితా ! మీపదంబులు సన్ను
తింపగజాలక యెనేనెత్తు జన్మములెంచశక్యమా ? । ఓ పాండురంగ !
నిత్యపదవికి ద్రోవ జూపరా । కరణకళేబరములొసగి కరుణతో నన్నేలుచున్న
హరి నీ ఋణము దీర్పఁదరమటరా ! పాపములోఁ బుట్టి పెరిగి
పాపములనేయనుభవించి పాపమేనే జేయుచున్నాడ । నో పాండురంగా
నీవదంబులజేర్చుమికనైనా శోకమోహవ్యాకులంబై చీకాకౌ
సంసారమనియెడి చీకట్లోబడి పోయినానయ్యా ఓ పాండురంగా !
లోకనాయక ! జ్ఞానద్యుతినిమ్ము. పనికిరాని లోకమందు బనిగల్పించి
మోహవార్ధిలోమునుగ జేసితివయ్యలోకులను. ఓ పాండురంగా కనవశం
బే ? నీ మహామహిమ. భీమతటినీ తీరవాసా రామ ! వేంకటదాసోల్లాసా
నామనంబున నిరతము నిల్వుమో పాండురంగా ! కామజనకా !
తామసింపకు ॥ 110

# పండరి రగడ

శ్రీ పండరిపురినాథుని మంజులశ్రీపాదములర్చించి ముదంబున విరోధికృతు సంవత్సరమందున వరంబయిన కార్తికమాసంబునఁ జంద్రభాగ నిర్మలతీరంబున, జరిగిన శ్రీ కృష్ణుని వైభవమును, బొగడుటకును బ్రహ్మకైన శక్యంబుగాదు మఱి దివ్యములగు బహుదేవస్థలములు, బహుళములగు హరి భజనమఠంబులు, విలువలేని బలుచలువ చప్పరాల్, లలితములగు భక్తులమందిరములు, రాధాకృష్ణుల రామాలయములు, సాధు సమూహాహ్లాదపటంబులు, కడు సుందరముగఁ గట్టినమేడలు, చెన్నుమీఱెడు నన్న సత్రములు, నంద మొప్పుజెలువొందెడు వీధులు, పరిమళకుసుమ విపణి మార్గంబులు, రామరామయను, రామశుకంబులు, నీమముమదిలో నిల్పినసాధులు, బలువిద్యల నార్జించిన ధీరులు వేదాధ్యయనాన్విత భూసురులు, వాణిజ్యంబునవఱలు వైశ్యులు పరశురామని భబలులగురాజులు, దనుజవిదారునిఁ దలచెడి శూద్రులు, పూలతోటలద్దాలమేడలు, శ్రీకరములు దులసీదళవనములు, జపతపంబులను జరుపుమహాత్ములుగలుగుచంద్రభాగా తీరంబునవచ్చెడి జనములఁ జెప్పశక్యమే ? సప్తవారిధులు పొంగినట్లుగా, బలుభూములఁగల భక్తజనంబులు, పతాకలను వెసజేతఁ బట్టుకొని పాండురంగనామమును స్మరించుచు, నదులుస ముద్రునిఁ జేరినట్లుగా, గార్తిక శుద్ధైకాదశి దినమున గడురయమున వేంచేసివచ్చిరి. చంద్రభాగలో స్నానముఁ జేసి జయము జయంబని రంగనిబొగడిరి. వచ్చెడి సాధులు, నిల్చిన సాధులు, హెచ్చుగ హారతులిచ్చెడి సాధులు, దండము బెట్టెడి దాసవర్యులు, వారికివీరు వీరికివారు సాష్టాంగంబులు సల్పెడివారు గురువులగొని యాడెడి సచ్ఛిష్యులు, శిష్యుల దీవించెడి సద్గురువులు, బ్రహ్మనిష్ఠగల బ్రహ్మచారులు, జనకుబోలు గృహచర్యాధికులు, వాల్మీకిఁబోలిన వానప్రస్థులు, రామానుజుఁ బోలిన సన్యాసులు, జడభరతుని బోలిన సుజ్ఞానులు, వ్యాసునిబోలు పురాణవేత్తలు

శుకునింబోలిన శుద్ధచరిత్రులు, బృహస్పతి ప్రతిమానసూరులు దివ్యదృష్టి గల దిగంబరులును నెటుచూచిన నొక క్రోసెడి దూరం బిసుక వేసినను రాలకుండగా సాధుజనంబులు సభలుదీర్చిరి,పాండురంగమృదు పాదాంబుజములు మానసముల నిర్మిలముగ నిల్పిచేసెడి భజనలు చెప్పశక్యమే ? తాళంబులు వాయించు హస్తములు. శ్రీపతినే వీక్షించు కన్నులు నారాయణ ధ్యానాధి కమనములు, ధణాధణాయను మృదంగవాద్యములు, వీనులకింపగ ఎవీణారవములు ఖంగుఖంగుమను కంచు తాళములు, వెలుగునక్కై పట్టెడిదివిటీలును. నీవిధమున నేకాగ్రమనంబుల సాధులొనర్చెడి భజనలు చూడcగ సుజ్ఞానము వైరాగ్యము, మోక్షంబష్టాదశ సుపురాణసారము, సప్తకోటి మహామంత్రార్థము లొక్కవిధంబున దేహంబులతో, నిలిచినట్లుగా, దోచెనక్కడ నమరావతియో ? యలకాపురమో ? శివునిపురమొ ? వైశ్వానరు నగరమో ? వాయులోకమో ? వరుణపట్టణమొ ? వేదమూలమో ? శ్రీ వైకుంఠమొ ? యన బొలుపెసcగుచు నొప్పెనక్కడ, నిట్లు భజన మొనరించుకాలమున, నైదుస్టేషనుల దొరల్, దొరలు పండరిపురిజేరిరి పండరికిప్పుడు పోవగవలదని యతికఠినముగానాజ్ఞాపించిరి. చంద్రభాగకునుదూర్పుదిక్కున, భళీభళీయన భక్తులందరును బాండురంగనింబొగడదొడంగిరి. పాండురంగ ! పండరిపురినాథా । జ్ఞానభక్తి వైరాగ్యదాయక ! నారద వీణానాదవినోదా ! పుండరీ కవాక్పుండరీ కనుతగోకులేశ ! సద్గుణగణనిలయా ! బృందారణ్యానందవిహారా ! కంసమర్దనా ఘోఘవిదూరా ! మురసంహర ! శంకరనుతచరితా ! కరుణాకర ! భాస్కరనిభతేజా ! శరణాగత రక్షణబిరుదాంకా! దేవకిసుత ! వసుదేవతనూజా ! రావణాది దుర్దయదను జసంహారా ! నరమృగరూప ! వనాట చయావన ! యశోదపట్టీ ! నందనందనా ! నృగభూపాలకశాపవిమోచన ! ధేనుకబకచాణూరమర్దనా ! సకలేశ్వర ! గోపీహృచ్చోరా ! జరాసంధ సంహారకారణా ! బాణాసురకరబలవిదారణా ! సత్యాహృదయాబ్జాతదినేశా ! రుక్మిణీమనస్సరసిజభృంగా ! కాళిందీ హృదయేశముకుందా ! దామోదర ! సుందరఘనదేహా ! పండరిపురిలో

గృహాభ్యారమున నిటుకరాతిపై వితలనామమున చేతులు నడుమునc జేర్చియుంచుకొని చేత నరక్షణ జేయగబూనిc కలియుగ మందున వేల సాధువుల జ్ఞానదేవుని, నామదేవునిc దుకారాముని, గణేశనాథుని, రోహిదాసుని, జోకామేళుని, రాకావరు, గోరా కుంభారుని, నరహరి, సక్కు జనా భాయిలను సామంతుని, నిస్సంగు, గబీరుని, బానుదాసు, నింభారాజాదుల, రక్షణ జేసిన వాడ వనుచు మేమీ క్షణమునc బ్రార్థించు చుంటిమని, యెనిమిది దినములు, నేకరీతిగా భజనలు చేయcగ భక్తవత్సలుడు కరుణించెను, సర్కారు వోయెను, సెలవాయెను, దులసీ వరదాముని ఘనమగు కోవెల దరవాజాల్ తెఱచిరి. అప్పుడు సాధులు కుప్పలు గూడియుc జంద్రునిc గనిన సముద్రము భంగిని,వాడు పైరుల కు వర్షము రీతిగ, బహుళానందం బొందిన వారై దేవాలయమున బ్రవేశించియు, నిటుకరాతిపై నిల్చిన రంగని, గాఢాలింగ నమాచరించిరి. పరాత్పరు నిరూపము గన్పించెను. భాస్కరునేలిన ప్రకాశంబుతోc జంద్రుని కెనయగు చల్లc దనముతో దర్పణములను బోలిన చెక్కులతో, నళిన నిభములగు నయనంబులతో cదిల పుష్పమువలెc జెలcగు నాసికతో, సత్యజ్ఞానానందయుతుండై వర్ణనజేయగ నాదిశేషునకు వశముగాని సుందర దేహముతో దర్శనమీయcగc దప్పక చూచిరి. బద్ధులైన సంసారులకప్పుడు బ్రహ్మానందంబుద్భవిల్లెను దాపత్రయములు దగ్ధమాయెను, నరిషడ్వర్గము పరువులెత్తెను. మూడీషణములు గోడుగుడిచెను దమోరజస్సులు దాcగిపోయెను నష్టకష్టములు నష్టమాయెను c బాపారణ్యముభస్మమాయెను, రాగమడc గివైరాగ్యమబ్బెను. భోగవాంఛవిడిపోవ, దొడగెను. ప్రపంచచింతలు బాసిపోయెను, నిద్రాహారాల్ నిల్చిపోయెను. నిట్టివైభవముcబండరిపురి విరోధికృతు సంవత్సరమందున వరంబైన కార్తీక మాసంబున జూచిన మనంబునcజోద్యకరముగాc బూడివాడయును పురి నివసించుచు

సాధుజనులశ్రీ పాదరేణువై, ధరమొవ్వవేంకటదాసాహ్వాయమున, వెలయువాఁడ శ్రీ విఠలునికృపచే రచియించితి నీరగడను సతతము పఠియించిన నిష్పాపులయ్యెదరు పాండురంగపద భక్తి గల్గును. జన్మబంధములు సడలిపోవును, రామరామ శ్రీరామనృపాలా సీతామానస కుముద మృగాంకా ।తాటకేయ ప్రాణాంతకరూపా । హరిహయ ముగ్ధసుతాంతకబాణా । వానరసహితా ।వార్ధిబంధనా । రావణఘటకర్ణాది సంహరా । సీతాన్వితా పూతచరిత్రా। యఘవినాశనా। యఖండవైభవా। మొవ్వ వేంకటాఖ్యదాసపోషకా శ్రీ వేణుగోపాల నమస్తే నమస్తే నమః

111

**( ఇది శ్రీ స్వామి యిరువదియొకటవ సంవత్సరమునందలి కవిత్వము )**



# మంగళహారతి

హారతిఁగైకొనుమా ! అంబ సావిత్రీ ! నీవు; అనుమాదిరి

ప. హారతియిచ్చెదరా అంగజజనకాయిదె

అ. ధారుణిమముఁబ్రోవఁగా దైవమునీవేయని ॥ హా ॥

చ. గాసిఁజెంది దంతిరాజు కావవేయని వేఁడఁగా

వాసవాది దేవగణములు వందనంబులు సేయగా

భాసురంబుగనేగిమకరినిఁ బట్టి వేగమె రెండుగాఁ

జేసి యేలినవాఁడవని జేరి నీకు మంగళ ॥ హా ॥

నిండుకొలువునభంగమొంది నీరజాక్షి రావెరా !

అండజేంద్రయాన ! నే నీ యాపద పడఁజాలరా !

దండమనుచుఁ బల్కనామెకుఁదక్కువింఁచుకయైనరా

కుండ నరసినయార్తబాంధవుండవనికర్పూరమిళిత ॥ హా ॥

పూడివాడ వాస ! యదుకులభూషణాఖలశోషణా

వేడుకనీపాదముల్ల వినుతిఁజేసి భక్తితో ॥ హా ॥

# జోలపాట

జో అచ్యుతానంత ! జోజో ముకుందా ! రార ! పరమానంద ! రామ ! గోవిందా ! ; అను మాదిరి

ప. జోకృష్ణ ! యదుబాల ! జోజోసుచేలా !

జోచంద్రరవినయన ! జో భోగిశయనా ! ॥ జో జో॥

చ. నిదురబోనాతండ్రి ! నిదురబోవయ్యా !

నిదురబోలోకేశ ! యిదెవచ్చెరాత్రి ! ,,

చీఁకటివిరియించెఁ జిన్ని జాబిల్లి

ఆకసంబునఁజుక్క లలరారెనవిగో ॥ ,,

పసిఁడియుయ్యేలలోఁ బవళించి నీవు

నిసుఁగువై కనుమూసి నిద్రించవయ్య ॥

చెలఁగి సోమకుఁజంపఁ జేపరూపొంది

ప్రళయవారధినీఁది బడలిపోయితివి ॥

బృందారకులకొఱకు మందరంబెత్తి

సుందరకూర్మమై సొలసిపోయితివి ॥

తొలుపందివై యసురఁద్రొక్కిగీటాడి

యిలపైకినెత్తిన జలజపత్రాక్ష ! ॥ ,,

సిసువుఁబ్రోవఁగ మర్త్యసింహరూపమున

నసురనాయకుఁజంపి యలసినతండ్రి ,,

వక్షమున సిరిగలుగువాఁడవైయుండి
భిక్షమెత్తినయట్టి పిన్న బ్రాహ్మణుఁడ ॥ ,,

మదమత్తులైయున్న మానవేశ్వరుల
వెదకి ఖండించిన విశ్వలోకేశ ! ॥ ,,

రామచంద్రుండవై రావణునిఁద్రుంప
భూమి నాయాసంబుఁ బొందినావయ్య ॥ ,,

వ్రేపల్లెలోనిపుడు గోపకాంతలను
జేపట్టిరక్షించు చిన్నికృష్ణయ్య ॥ ,,

ఇలఁబూడివాఁడలో నెలమిమీఱఁగను
వెలసియున్నట్టి శ్రీ వేణుగోపాల ! ॥ ,,

నిదురబో నాతండ్రి ! నిదురబోవయ్య !
నిదురబో సుకుమార ! నిశివచ్చెఁగాన ॥ ॥ జోజో ॥

# మేలుకొలుపు

## " గుమ్మఁడేడే గోపిదేవి వలె "

మేలుకొనరా ! బాలకృష్ణా ! మేలుకొనరా ! మదనరూపా !
మేలుకోవయ్యా కృష్ణయ్యా ! । ।
మేలుకో ॥

తెల్లవాఱెను గొల్లభామలు చల్లఁజేసిరి వెన్న ముద్దలు
కొల్లలాడఁగవేళమయ్యె మేలుకో ! కృష్ణా ! నీవు ॥ మేలుకో ॥

కడుపులోనున్నట్టి జగములఁ గన్నతల్లికి నోరుఁదెఱచిగ్రక్కునఁ
జూపింపనీవు ॥ మేలుకో ॥

బాలకులతోఁగూడి వేగమె యాలమందల మేపనడవికిఁ దోలుకొని
పోవంగవలయు || మేలుకో ||

రాలవాన గురియసాగెఁను దాళఁజాలరు గోపకుల నీకేల
గోవర్ధనమునెత్త
|| మేలుకో ||

తీరుగా యమునాస్రవంతీ తీరమున గోపాలబాలల చీరలున్నవి
దొంగిలింప || మేలుకో ||

పున్నమవెన్నెల వచ్చెను బొన్నమ్రాని మీఁద నెక్కి తిన్నఁగా
వేణువునునూద || మేలుకో ||

గోపికామహిళామతల్లులు గుంపులైవచ్చిరి వారిఁగూడి రాసక్రీడ
సలుపగ
|| మేలుకో ||

మామగారి కబురువచ్చెను మానుగా బలరాముతోడ మధురకు
నరుగంగనీవు || మేలుకో ||

ద్వారకాపురమందుఁ బదియాఱువేల రాజ కాంతలఁ జేరి
ఆనందింపనీవు || మేలుకో ||

పూడివాడవాస ! నీకుఁ బూజలు సేయంగ మౌనిపుంగవులు
విచ్చేసిరింక || మేలుకో ||

తెల్లవాఱెను మందమారుత మల్లన వీతెంచి నిదిగో ! మెల్లఁగా
మేల్కొనుముతండ్రి || మేలుకో ।

స్వామి వారి పౌత్రుఁడు శ్రీశ్రీనివాస పెరుమాళ్ళగారి పెద్ద కుమారులు ఉపన్యాస చతురానన బిరుతాంకితులు శ్రీ వృషాద్రిపతిగారి రచన

'జనులారా శ్రీరామ' అను మాదిరి

## కీర్తన 1

1. మురవైరి పదసేవ నిరతమ్మొనరింప దొఱకునే మోక్షంబు మనసా! దురితమార్గములందు జరియింప ప్రాప్తించు యమపురం, బీ నిజము తెలుసా ? ॥ మురవైరి ॥

2. గతభవంబున పుణ్యకార్యముల్గావించి కాంచితివి నరజన్మమెటులో ! అతిమూఢ తమబద్ధసానురాగుండవై వ్యర్ధపరుపకు దాని నిటులా ?

॥ మురవైరి ॥

3. సారవిహీనమౌ సంసారమందు బడి శ్రమలగుందగనేలతెలిసీ ! సారాతిసారంబు శ్రవణసౌఖ్యకరంబు రామనామజపంబు వెలసీ !

॥ మురవైరి ॥

4. పంచభూతాత్మక సంచారమున బుట్టె మృణ్మయంబీ వపువు వినవే ! పంచబాణుండు నిన్ వైవస్వతపురంబు పథముబట్టించు నిది నిజమే

॥ మురవైరి ॥

5. దారపుత్రులగావ ధర్మంబుదెగనాడి ధనముసంపాదింపనేలా ? ఘోరమగు నరకకూపంబులో బడి క్రూరబాధకోర్చుటమంచిమేలా ?

॥ మురవైరి ॥

6. పాపౌఘ జీమూతప్రకరంబు దూలింప హరిభక్తి వాతంబుదక్క ఏపు గల్గిన యట్టి దేదియును లేదు నిభ్భువనాల వీక్షింప లెక్కా ?

॥ మురవైరి ॥

7. అస్థిరంబని యెంచి యత్తరులు పూసి యానందపడనేలనేని క్కి ?
ఆస్తిపాస్తులు పోయి ఆలుబిడ్డలు పోయి అరచెదవు యముని కడ జిక్కి
॥ మురవైరి ॥

8. ఇలపూడి వాడలో నెలకొన్న గోవిందు హృదయాంతరంగాన నిల్పి !
ఫలమంది వైకుంఠపథము జేరగ బోయి పాడవేహరిభక్తి సల్పి !
॥ మురవైరి ॥

9. పరగ దెల్పెవృషాద్రిపతి యిద్ధిమదియందు పదిలమై యుండగా వేచి
పరమపూరుష ! కృష్ణ ! ఫణిరాజ తల్ప !యని పల్కు పుల్కలదేలిలేచి !
॥ మురవైరి ॥

## కీర్తన -2

( కృష్ణనామము – కృష్ణనామమను మాదిరి )

1. విష్ణునామము – విష్ణునామము – విశ్వశుభదము – విష్ణునామము
వైష్ణవాళికి ప్రాణ మీ నామం – శ్రీ విష్ణునామం

2. యతిరాజచంద్రుడు భూతలంబున వ్యాప్తిజేసిన విష్ణునామము
అతులితంబగు మోక్షరాజ్యము నొసగు నీ నామం – శ్రీ విష్ణునామం

3. వ్యాసశుక వాల్మీకభవులకు హర్షదంబగు విష్ణునామము
భాసురంబై పరగు ఓంకార మీనామం – శ్రీ విష్ణునామం

4. దేవమునియగు నారదునికిట తియ్యమొసగిన విష్ణునామము
సవ్యసాచికి రథము ద్రోలగదలచె నీ నామం – శ్రీ విష్ణునామం

5. ఆంజనేయున కండయైయని వెన్నుగాచిన విష్ణునామము
అంజలించిన యంతుకీడులనార్పు నీ నామం - శ్రీ విష్ణునామం

6. సోమశేఖర శక్రవందిత శోభదంబగు విష్ణునామము
నామమాత్రము చేత వైరుల నణచె నీ నామం - శ్రీ విష్ణునామం

7. భోగిభోగమణీ విభూషిత పూజనీయము విష్ణునామము
యోగనిద్రాపరవశంబున నొప్పు నీ నామం - శ్రీ విష్ణునామం

8. పాప పర్వతపాళి గూల్పగ వజ్రనిభమగు - విష్ణునామము
శ్రీ పురంధ్రికి స్థానమై చెలువొందె నీ నామం - శ్రీ విష్ణునామం

9. అఖిల జగములు బొజ్జ యందున నమరదాల్చిన - విష్ణునామము
సుఖకరంబగు శోభనములకు మూలమీ నామం - శ్రీ విష్ణునామం

10. కఠిన రాక్షస కోటి గుండెల గాలమైనది - విష్ణునామము
శఠసమాజము గూల్చి జగముల సాకె నీ నామం - శ్రీ విష్ణునామం

11. ప్రళయసాగరమందు ఆకున పవ్వళించిన - విష్ణునామము
జలజగర్భు నివాసమై యలరారె నీ నామం - శ్రీ విష్ణునామం

12. వేదతస్కరుడైన సోమకు వెదకి చంపిన - విష్ణునామము
మోదమున గిరి మూపుపై నిడిమోచె నీ నామం - శ్రీ విష్ణునామం

13. క్రోడరూపము దాల్చి భూమిని కోరనిల్పిన - విష్ణునామము
వేడు రక్కసి పాపనింగాపాడె నీ నామం - శ్రీ విష్ణునామం

14. పొట్టిరూపము దాల్చి దైవత కులము బ్రోచిన - విష్ణునామము
పట్టి మానసపతి సమాజము ద్రచ్చె నీనామం - శ్రీ విష్ణునామం

15. పాదరజమున రాతినాతిగ ప్రబలజేసిన – విష్ణునామము
వేదవిదులగు మౌనివరులకు వేద్యమీ నామం – శ్రీ విష్ణునామం

16. ద్వాపరంబున కృష్ణరూపము దాల్చి యొప్పిన – విష్ణునామము
స్వాపరాధములన్ని బాప సమర్థమీ నామం – శ్రీ విష్ణునామం

17. సక్తయోగి హృదంతరాంతర స్థానమైనది – విష్ణునామము
భక్త మాన ససారసాం తరభ్రమరమీ నామం – శ్రీ విష్ణునామం

18. మంజులంబగు పుష్పకుంజములందు మసలిన – విష్ణునామము
సంజవేళల రాధయొడి సల్లాపమీ నామం – శ్రీ విష్ణునామం

19. ఇవ్వసుంధర పూడివాడను నింపు గొల్పెడి – విష్ణునామము
మొవ్వవేంకటదాసు ముందుగ నిల్పె నీ నామం – శ్రీ విష్ణునామం

20. శ్రీనివాసయతీంద్రులీయిల వ్యాప్తి జేసిన – విష్ణునామము
చిత్రభంగుల నెల్ల లోకములేలు నీ నామం – శ్రీ విష్ణునామం

21. విష్ణుదాస బుధోత్తములు నోరార చాటిన – విష్ణునామము
విశ్వాంతరాళములందు నిండిన దివ్యమీనామం – శ్రీ విష్ణునామం

22. కృష్ణదాసు ముదంబు మీరగ పలుకుచున్నది – విష్ణునామము
కెరలి మొవ్వ కుటుంబమెల్లను అలమె నీనామం – శ్రీ విష్ణునామం

23. సంతతంబు వృషాద్రిపతి నిలసాకు చుండెడి – విష్ణునామము
చింత లెల్లను బాపి సంరక్షించు నీ నామం – శ్రీ విష్ణునామం

శ్రీ వేంకటగురుభ్యోనమః శ్రీరామ శ్రీశ్రీనివాసగురుభ్యోనమః
శ్రీ విష్ణుదాసగురుభ్యోనమః

శ్రీ కవిభట్టారక దాశరథిసూరి గారు
నిత్యవిభూతి నలంకరించిన సాంవత్సరీక క్రతుసమయమున
సమర్పించిన

## ప్రణతిసహస్ర సుమగుచ్ఛము

అన్నావిష్ణుదాస గురుత్తమా కవి భట్టారక దాశరధీదయాపయోధి, ధీనిధీ ప్రణతి సహస్ర మర్పించుచుంటినిదె గ్రహింపుము. తండ్రీమీరు పరమాకాశము వేంచిసి యుండ తిరుమామణి మంటపము నందు, శ్రీ భూనీళాది దివ్యమహిషులు, అనంతగరుడ విష్వక్సేనాది నిత్యులు, ముక్తులు, కారణజన్ములు పరమహంస శ్రీవేంకటదాసస్వామి, పౌరాణిక ప్రథములు శ్రీశ్రీనివాస గురూత్తములును అందరితో పరివేష్టించి యున్న రాజీవాక్షుండు మిమ్ము జూచి కవి హర్యక్షమా ఏదేని దివ్య ప్రబంధోపన్యాసము గావింపవలసినదని కౌతుహలంబంద. మధుర గంభీరోపన్యాసముతో వీనుల విందుగావించుచు వెగటు లేని భగవదానందమున నిమగ్నమై మమ్ము మరచితిరా స్వామి ? విశాల ధీర గంభీరమగు మీ మానసమునకు అట్టి ప్రమాదము సంభవించునే లేదు లేదు అతి స్వల్పమగు నా చిత్తమున కే మరపు గలిగి అట్లంటిని గాని తమకు గాదు. సహస్ర భానోదీయ సమభాసమగు విష్ణుని దివ్యలోకమున నిత్యసూరుల సహపంక్తి యందాశీనులై యున్న మీకు ఎన్నటికి మమ్ము మరువకదివ్య చిత్తమునందు తలంచుచుండవలసినదిగా తమ పాదజలజాతములకు శరణాగతి జేయుచుంటిని.

విష్ణుదాసస్వామి తిరునాడలంకరించి సంవత్సరకాలము గడచినదిగాని వారి వియోగాగ్ని బాధాతప్త మానసులమైన మాకు కొన్నియుగములు గడచినట్లున్నది వారింక ఏనాటిని కనపడరనే భయంకరసత్యము మా హృదయములను పిండి వేయుచున్నది. గృహము దేవాలయము తత్పరిసరములు వారు సంచరించిన భూములు, బ్రహ్మోత్సవములు, వివాహాది శుభకార్యములు అన్నింటను శోభ దక్కి వెలవెల బోవుట కొట్టవచ్చినటుల స్పష్టమగుచున్నది. 'బ్రహ్మంతవారైనను తీర్చలేనిదా కొరంత వున్న తిని ఒకరు ఆపాదించి పెట్టిన మాత్రమున వచ్చునది తీసిపారవైచిన పోవునది గాక సహజసిద్ధము గదా. కళంకరహితమై మనోజ్ఞమగు త్రికరణములు ఒకే ఋజుమార్గమున నియతితో జీవితావధి పయనించిన శీలచరిత్ర గలిగిన మహనీయులు శ్రీ కవిభట్టారకులు అట్టి పరిపూర్ణ వ్యక్తిత్వమింక జగత్తున జూడబోము, పితృదేవుల తపశ్శక్తి రూపాంతర మంది ఐదు దశాబ్దముల కాలమ విద్యాజ్ఞాన తేజఃశ్శీల తపశ్శక్తులతో అనేకమందిని రంజింపజేసి ఉద్ధరించి దేవాలయ సంబంధమగు బహుకార్యములు నెరవేర్చి, లోకమునకు కావలసిన శాస్త్రపరమగు విషయములెన్నియో తెలియజేసి ప్రజానీకమునకు ఉపకరించి వేంకటదాసమౌనిచంద్రుని గూర్చి వెడలిపోయిన దాతపః పుంజము. మన కొరకై వారి అంశలో ఒక భాగము జగన్నాథుండగు వేణుగోపాల దేవుని ముఖారవింద సందర్శన జేయించుటకై అఖండజ్యోతి స్వరూపమున నిలిచియున్నది. వారు మమ్ము వీడి వెడలిపోయినను వారి తలంపులు మాత్రము జన్మలో మరుగునబడవు కాలము అన్ని సమస్యలను పరిష్కరించునందురుగాని ఒక స్వారస్యరస మందాకినిని

నష్టపోయిన మాకు నిస్సారముగా నున్నదీ కాలము, యుగములు మారినను చరిత్రలో మరుగునబడని స్త్రీ, పురుషులగు మహామహులెందరో జన్మించిరీ పుణ్యభూమియందు శిబి, బలి చక్రవర్తి, రఘుమహారాజు, కర్ణుడు, రాయని భాస్కరుడు మొదలగు మహాదాతలు, లోకకర్తల గుత్రిమూర్తులను పసివాండ్రను గావించి డోలికలనూగించిన అనసూయ, కంటిమంటల చేతకిరాతుని భస్మము జేసిన నిషధరాణి, సమవర్తి వెంట నడచుచు అమ్మహాత్మునితో హోరాహోరిగా పోరాడి పతిని పునర్జీవితుని జేసిన సావిత్రి మొదలుగా గల సాధ్వీశిరోమణులను, అచేతనులై భూమింబడియున్న నలువురు తమ్ములలో ఒక్కని మాత్రము కోరుమనిన, మహావీరులు సమర్థులగు స్వకీయానుజులను గోరక బలహీనుడగు సవతితల్లి కుమారుడు బ్రతుక వాంఛించిన యుధిష్ఠిరుని వంటి ధర్మనిరతులు, తండ్రి కోరికదీర్చుటకు వివాహము నే మాని శాశ్వత బ్రహ్మచర్యము నవలంబించి సత్యదేవవ్రతుడను ఖ్యాతిబొందిన భీష్ముని బోలు ఇంద్రియ జేతలును, సకల సామ్రాజ్యము, సతీసుతులను, తృణీకరించి కడకు కాటికాపరి వృత్తినంగీకరించిన హరిశ్చంద్రుని వంటి సత్యనిష్ఠులు, సాహితీవిభవ సార్వభౌముండగు శ్రీ కృష్ణరాయ మహీపాలుని బోలు కవితారసజ్ఞులును, కవిత్రయము, పోతనామాత్యుడు, పెద్దన, భట్టుమూర్తి మొదలగు మహాకవులు, భగవద్రామానుజ, శంకరాచార్యాది మతకర్తలు, ఎన్నియో ఒడిదుడుకులు బాధలు ఎదుర్కొని పరోపకారమునకు జీవితములు ధారవోసిన సంఘసంస్కర్తలు, ప్రాణములను లెక్కింపక ఆత్మార్పణలు గావించిన దేశభక్తులు ఎందరో కళాకారులు, ఎందరో మహాత్ములు జన్మించిరీ పవిత్రధాత్రి యందు గాని కొందరినైనను ఎన్నదగిన సామర్థ్యము

నాబోంట్లకు లేదని మనవిజేయుచుంటిని. అటువంటి మహామహులు జన్మించుటే గాక విశేషించి భగవదవతారములగు రామకృష్ణులను తన అంకమున లాలించిన భాగ్యదేవత భరతమాత అటులనే భరతజనయిత్రి గర్భమున జనియించి ఒక శాస్త్రవేత్తగా కవిశ్రేష్ఠునిగా, వక్తగా, తపోనిధిగా, తేజస్విగా పారమార్థిక జ్ఞానబోధతో అనేకమందిని కడతేర్చిన ఆచార్యపురుషునిగా, భరతమాత మాతృత్వమునకు రాధమాంబ మాతృత్వమునకు వన్నెబెట్టి సఫలత జెందించిన పరిపూర్ణులు, సిద్ధపురుషులు శ్రీ కవిభట్టారక విష్ణుదాసస్వామి, అట్టి మహాపురుషుని మరచుట సామాన్యము గాదు. నిరంతరము నీ కుటీరమునకు వచ్చి తండ్రిగా, అన్నగా, దేశికునిగా యోగక్షేమములు విచారించుచు దుర్భర బాధాతప్తవైన నిన్ను కారుణ్యహిమ వృష్టితో సేద దీర్చి అండదండగా నిలిచి కంటికి రెప్పవలె సర్వవిధముల రెండు దశాబ్దముల కాలము వెంటనంటి కాపాడిన వాత్సల్యఖని నీకెట్లు మరపు వచ్చును కాని నీ వెంత ఆరాటించినను ప్రయోజనము లేదు. ఆ దయానిధి ఇంక కానరాదు. అమ్మహనీయుని ఆదేశానుసారము నడచుకొనుచు పాపపరిహారమగు వారి దివ్యరూపమును, ప్రవచనములను మననము గావించుకొనుచు ఓ మానసమా ఊరటబొందుము రసనేంద్రియమా నీవును స్మరించి ధన్యవుగమ్ము.

శ్రీ కవి భట్టారక దాశరధీగురుచంద్రుని పాదారవిందములకు

మీరు మరువరాని మిమ్ము మరువలేని

అను జాత తన్నీరు కమలాదేవి

శ్రీరామ

శ్రీ వేంకటగురుభ్యోనమః

శ్రీ శ్రీనివాసగురుభ్యోనమః

శ్రీశ్రీశ్రీశ్రీ విష్ణుదాసగురుభ్యోనమః

శ్రీ రామాయణసౌరభము 11.02.2001

శ్రీ కృష్ణదాసదేశి కాఖండలుని శతాధికరామగాథాపఠన సంపూర్ణ సమయమున సమర్పించిన శత నమస్సుమమాల.

శ్రీ మదఖండ భూమండలమండితంబైన భరతఖండము వివిధ దేశములయందు నైతికముగా, ధార్మికముగా, సాంస్కృతికపరముగా, పారమార్థికముగా ఒక విశిష్టస్థానమున గలిగియున్నది. ఎందరో ఉదారులు, సత్యవ్రతలు, ధర్మపరులు, నిత్యాగ్నిహోత్రులు శాపానుగ్రహశక్తి గల తపోధనులు, పతివ్రతలు జన్మించిరన్న చరిత్ర గలది భారతావని వీరందరు ఒక్కొక్క గుణముతోనే మహిమాన్వితులైరి గాని రూపసంపత్తి, సత్యవ్రతము, ధర్మము, శీలము, దయ మొదలగు ఆత్మగుణములన్నియు ఒక్కనియందేరాశీభూతమై వీరందరికి అంకెయై ప్రకాశింపజేసిన సకల కల్యాణగుణరత్నాకరుడు శ్రీరాముడు, సత్యము, ధర్మము, శీలము ప్రభృతి సామాన్య ధర్మములను ఎంతమాత్రము విడువరాదు. వీటి వలన లోకవ్యవహారము చక్కగా నడచును. సమాజమునకెంతయో మేలుగలుగను యీ ధర్మములు తప్పక ఆచరించవలసినదని తానాచరించి లోకమునకు ఉపదేశించిన ఆచార్యపురుషుడు రాముడు, అవతారమునకు వచ్చుచునే పాయస మహిమముతో పుట్టితినన్నాడు. తనంతట తాను

ఆవిర్భవించలేకనా, విశ్వామిత్రమహర్షి వద్ద ధనుర్విద్యామంత్రములు నేర్చుట తనకు తెలియకనా తన సర్వేశ్వరత్వము సర్వశక్తిత్వమును దాచబెట్టి, సత్యధర్మములను ఆయుధములు ధరించి సమస్త లోకములను, సౌందర్యముతో త్రిలోకములను ఆత్మగుణములతో మనస్సులను జయించిన మహాబలవంతుడు రాముడ, పట్టాభిషేకమును విరమించి దశరథుడు కబురు బెట్టగా వచ్చి చూచి రాముడు తల్లీ కైకేయి మహాధార్మికుడు వయోవృద్ధుడైన మా తండ్రినిట్లు మానసిక బాధాగ్నికి ఆహుతి జేయకపోతే ఒరే రామా భరతుడు రాజు కాగలడు నీవరణ్యమునకు బోవలసినదని నీ వొక్కమాట జెప్పియున్న నేను వెడలిపోదునే భరతుడు రాజ్యపాలన జేయుటకన్నమించిన ఆనందము నాకేమున్నదని పలుకుటయందు ఎన్ని ధర్మములు దాగియున్నవి. తాను దూరగతుడైన దశరథుడు జీవించడని తెలుసు అయినను తండ్రికి అసత్యదోషము ప్రాప్తించగూడదు, అనునది ఒక ధర్మము ఎంత అపకృతి గావించినను మాతృనిందజేయరాదు అనునది ఒక నియతి, భరతుడు రాజ్యపాలన జేయుటకన్న అధికమగు సంతోషము నాకేమున్నదని చెప్పుటయందు తమ్ముని యందున్న వాత్సల్యము, రాజ్యమును తృణీకరించిన త్యాగనిరతి రెండును తేటపడుచున్నవి, మరియు మహాబలవంతుడగు శత్రువు ఇంద్రజిత్తును వధించునపుడు లక్ష్మణస్వామి రాముని సత్యవ్రతమను బ్రహాస్త్రమునకు పదునుబెట్టి సులభముగా వధించియున్నాడు, త్రిలోకకంటకుడగు రావణుని వధించి దేవతలకు సర్వభూతములకు స్వేచ్ఛావాయువులను ప్రసాదించిన వీరకరుణరస పరాక్రమనిధి రాముడు పగవారిని సైతము వధించి తన దారిని తానుబోక దహనసంస్కారాదులు

వత్తిడి చేసి చేయించిన కర్మ నిష్ఠాగరిష్టుడు. శ్రీరాముడు పురుషులనే మోహింపజేసిన అద్వితీయ మోహనస్వరూపుడు, కుక్కకు న్యాయము చేకూర్చిన సౌలభ్యనిధి రాముడు, ఉడుత సహాయము నకుప్పొంగిన సులభసాధ్యుడు రాముడు. ఓ పక్షీజటాయువు నా కొరకై ప్రాణములు విడిచితి వాయని దుఃఖించి ఉత్తరక్రియలు నెరపి తన సత్యవ్రతమను పుణ్యకోటి విమానమున మోక్షమున కంపిన దయాస్వరూపుడు రాముడు, సకల మధురగుణములన్నియు మూర్తీభవించిన ఉత్తమోత్తమ పురుషుడు, పురుషోత్తముడు శ్రీరాముడు.

సామాన్యముగా లోకమునందు వీడిని రామరామ అనగూడదు అనేది లోకోక్తి అనగా దయకు మారు పేరు రాముడని గదా, మరియు రామరామ నేనే పాపమెరుగనని ప్రతినజేయుట సత్యస్వరూపుడు రాముడని తెలియుచున్నది, అటువంటి పవిత్రచరిత్రుడగు రాముని గాథను మరామరాయని జపించిన మహత్తు వలన బోయ వాల్మీకి మహర్షియై బ్రహ్మవరప్రసాదమునకు పాత్రుడై తన కనులముందు సీతారాముల గాథంతయు సాక్షాత్కరింపగా పదునాలుగు భువనముల చే స్తుతింపబడు యీ ఇతిహాసమును వ్రాసి ఆదికవిగాలోక పూజితుడైనాడు. ఆ మహనీయుడు వ్రాసిన తరువాత పాత్రానుగుణముగా ఎందరో మహనీయులు వ్రాసి తమ తమ జన్మలు ధన్యము గావించుకొనిరోగదా వేరు గాథ వ్రాయవలెనన్న కల్యాణగుణ పరిపూర్ణుడగు రాముని వంటి కథానాయకుడు మరియొకడు లేడుగదా అట్టి మహాకావ్యమును అనేకమారులు చదివిన వారికి ఆసాంతము విన్న వారికే మాట్లాడను, చర్చించను,అర్హత గలదు గాని మరి ఏదియు లేని మాకెక్కడిది అధికారము

కాని అద్వితీయ లోకోత్తర తపఃప్రభావ సంపన్నులును, జీవితమున నూట ఇరువదిసారులు రామాయణము పఠించిన పరమహంస శ్రీ వేంకటదేశికేంద్రులకు తను జాతలము, అనేక సారులు రామగాథను తమ వాగ్సుధావృష్టితో తడిపి వేలమంది జనుల పునీతుల గావించి న శరాతిసదృశులగు బుధోత్తమ శ్రీశ్రీనివాస గురూత్తములకును, ద్రవిడ వేదసారమును గంగాప్రవాహముబోలు వాక్కుతోను పన్యసించి శ్రోతలను మైమరపించిన పుంభావ భారతి కవి భట్టారక విష్ణుదాస దేశికమౌళికిని అను జాతలము వాగ్మధురి మతోఖండాంతరమున యశఃపతాకనెగురవేసిన గాన గంధర్వ, నాలుగు మోములన్ నిగమనాదములుప్పతిలన్ అని పెద్దన్నగారన్నట్టు నాలుగు వాక్కులతో ఉపన్యసించునట్లు శ్రవణానుభూతిని గలిగించు మా ఉపన్యాస చతురానన, సారస్వతమూర్తికి సాక్షాత్తు మేనత్తలము **ఇదే మా అర్హత.**

అన్నా శ్రీకృష్ణదానదేశికాఖండలా రామాయణ తపఃపితా మహాశతనమస్సుమమాల గ్రహింపుము తండ్రీ, మీ చేసిన శతాధికరామగాధా పఠనసంపత్తిని ఏమని కొనియాడగలము బ్రహ్మవేత్త వేంకటదాసస్వామి, మహా సాధ్వి అమృతగర్భయగు రాధమాంబలకు ప్రభవించుట వలన జన్మ జన్మతోనే పవిత్రము, తండ్రిగారుద్భవించుట వలననే మన తరతరముల వారు తరించిరి. మీ చేసిన మహోన్నత తపోధనము వలన తరతరముల బంధులు సంబంధులు పునీతులైరి. మీరు పుట్టిన గర్భమునందే మేమును జనించినందున మీ తపః పలమునందు మేమును భాగస్వాములము గదా మీ చేసిన మహోన్నత తపస్సు ఏతన్మాత్రముగాదు, లక్షలు, కోట్లు ధనము సంపాదింతురు.

స్వార్థపరతకేగాని ఇతరులకేమి ప్రయోజనముండగలదు. మీరు చేసిన పారమార్థిక సమృద్ధి లోకమునకు శుభప్రదము శోభప్రదము మోదప్రదము మరియు భుక్తి ముక్తిప్రదమును కలిగియున్నది, సూర్యోదయము మొదలు సూర్యాస్తమయము వరకు మానవుడు ఏదో ఒక కర్మ చేయుచునే యుండును గాని రామగాథేదినచర్యగా రామగాథకే అంకితమైన మీ జీవితమునకు ఎవరి జీవితము సాటి రాగలదు. అగ్రజారామనామము రుచినెరింగియున్నది మీరసన పదార్థముల రుచినెరింగినవి మారసనలు మరియు భారతనారీత్వము మూర్తీభవించిన సాధ్వీశిరోమణి మంగళ దేవతా స్వరూపిణి మీ లక్ష్యసాధనకు సర్వవిధముల తోడ్పాటునందించిన మీ అర్ధాంగి అమ్మన్నమాంబగారికి అభినందన వందనములు మహామహితాత్మా యీ మహోన్నత దీక్ష యందు శ్రద్ధా ఆసక్తి రుచి పట్టుదల ఇంద్రియజయముతో చేయవలెన్న ఎవరికి సాధ్యము అన్నా మీ జన్మజన్మల సుకృతము పుష్పించి పరిమళించి పండిమిమ్ము వరించినది ఇహపరములయందు దీనికి మించినది సమానమైనది లేదు చేయవలసిన దంతయు చేసి కృతకృత్యులైరి. ధన్యులై చరితార్థులై పూర్ణమనోరథులైతిరి. అట్టి మిమ్ముకొని యాడి మేమును చరితార్థులమైతిమి, ఇటులనే రామగాథను గానము చేయుచు మీరును ధీరోదారమధురగుణాకరులగు రామప్రసాదు గురువరేణ్యులును గూడి బహుకాలము శ్రీ రుక్మిణిసత్యభామ రాజ్యలక్ష్మిఆండాళు హనుమద్వైనతేయ ఆళ్వార్ల సహితుండును జగన్నాథుండగు వేణుగోపాలదేవునికి నిత్యధూపదీపనైవేద్యహవన బాలభోగాది కైంకర్యములు క్రమబద్ధముగా నిర్వర్తింపజేయుటయందును, మనచిరంజీవులందరికి యోగక్షేమములు విచారించుచు

ఆశీస్సులనందించుట యందును అండదండగా నిలిచి, శతాధికముగా విలసిల్లునట్లు కరుణించమని భగవద్భాగతాచార్యులకు , మా వాక్యములయందున్న దొసగులన్నియు భోగ్యముగా పరిగ్రహింప వలసినదిగా అగ్రజుల పాదారవిందములకు ఇక్కడ ఆశీనులై యున్న వారందరికి నమస్కరించి సెలవు నర్థించుచున్నాము.

సమర్పణ

**వద్యాల రామబాణమ్మ**

**తన్నీరు కమలాదేవి**

**శ్రీరామ**

## గురుస్తుతి కీర్తన - మోహన 1

మీరజాలగలడానాయానతి ఎటులదాటగలడు అను విధము

మరచిపోవగలమా మహాత్ముని పరమసత్వనిధిని
మహాత్మునిగరిమతత్వ విదుని
మధుర మధుర మకరందము లొలికెడి
మధులవాక్సుధలు గురిసిన మేఘుని - మరచి

కరుణామూర్తిని - కవిపురందరుని
నిరుపమానబుధ - శేఖరాగ్రణిని - మరచి

దశరథాత్మజుని - సన్నిభుడైన
దాశరధిసూరిని - దయాశరధిని - మరచి ॥

మొవ్వాన్వయకలశాబ్ధిని - పొడమిన
కవిభట్టారక - కళానిధిని మది - మరచి ॥

కన్నతండ్రికి మిన్నయగుచు - గారవించిన పెన్నిధిన్
అను జాతల హృత్పంకజ కమాలాప్తుని సుజ్ఞానఖనిని
మరచిపోవగలమా మహాత్ముని పరమసత్వనిధిని -
మహాత్ముని గరిమతత్వవిదుని

## శ్రీరామ

## గురుస్తుతి కీర్తన 2

తరలిపోయినది మహానిధి - మరలిరానిదీ విద్యానిధి
మరువలేనిదీ మహానిధి - దాశరధీసుజ్ఞానసుధీ
దివ్యమైనదీ మహానిధి - దైవత్వమునొందిన తపోనిధి
అవ్యయమగు స్మృతిపధము మిగిల్చిన బ్రహ్మవేత్త యీ దయానిధి
మరువలేనిదీ మహాసుధ - విష్ణుదాసగురుసూక్తిసుధ
కరుణసుధవరసుగుణసుధ - నిరుపమానవాత్సల్యసుధ
కవిభట్టారక మహాసుధ - సకలశాస్త్రసంవిదితసుధ
ద్రవిడపాశుర మహాసుధ - ప్రవచన మధురగంభీరసుధ
పరమపావనరసన సుధ - నిర్మలమానసరమ్యసుధ
సారస్వత రససారసుధ - సత్వధర్మయుత వాక్యసుధ
పాపహారియగురూపసుధ - వైష్ణవతేజోవిభవసుధ
పాపతాపసంహరణసుధ - స్మరించినంతనెసూరిసుధ
అన్నసదానీమూర్తిసుధ - నిన్నుగన్న మాయమ్మసుధ
యీ నాజన్మకు ఒకేసుధ - నినుకొని యాడిన పూర్ణసుధ

శ్రీరామ

## గోపికావిరహగీతము – కల్యాణిరాగం ఏకతాళం 3

పరమపురుషమమ్ము వీడిపోవ నీకు న్యాయమా
సారసాక్ష ఒక్కసారి సాక్షాత్కరింపవా – పరమ ॥

నీవు లేక ప్రాణములు నిలువబోవు మాకిలన్
ఎవరు దిక్కు రక్షింపగ యీ అబలలదీనలిన్ – పరమ ॥

చెట్టు పుట్టలందు దిరుగ ఏమిటింకమాగతి
కఠినశీల ఇంచుకైన కరుగదాయె నీమతీ – పరమ ॥

అతియుపతియుగతియు నీవెయనుచు నమ్మ మమ్ములన్
సతము వెతలపాలుజేయ ప్రతిన బూని నాడవే – పరమ ॥

మధురమాయభాషణముల మచ్చు జల్లినావుగా
అధరసుధను పంచి మాకు ఆశజూపినావుగా – పరమ ॥

మా మనసులు పరమేష్ఠి మంచు తోడజేసెగా
కమలేక్షణ నీ హృదయము కంచు గరగి పోసెగా – పరమ ॥

వేడుక నీనగు మోమున కరవు దీరగాంచగా
దొడ్డమనసులేనిధాతరెప్పలడ్డుజేసెగా – పరమ ॥

ఏలనో మహాత్మ నీకు ఇంత పంతమేలనో
చాలును మీ అధిపులకు నూతనమొక ప్రీతిలే – పరమ ॥

సహనముతో నిన్ను వెదకు శక్తి చాలలేదులే
ఇహపరముల నీవు దక్కవేరు మాకు వలదులే – పరమ ॥

కమనీయరూప నిన్ను మేము కామితములగోరము

ఏమి వలదు నీకంటెను నీవే మా వరము

నీ పదయుగంబె మాకు జీవనాధారము

సఫలమదే మా జన్మలసుకృతమదే పరమపదమ - పరమ ॥

గోపకాంతలెల్లగూడి వెదకుచున్న చోరుడు

మాపూడివాడ నున్నగోపాలదేవుడు - పరమ ॥

వాసిగ నీ దాసి కమల వ్రాసుకొన్న గీతము

వాసుదేవనీ పదముల కర్పించిన కుసుమము - పరమ ॥

## శ్రీరామ

## గురుస్తుతి కీర్తన 4

గురుమహారాజ గురు మహరాజ అనే కీర్తన విధము

1. మరువకుమా ఓ - మానసమా నీ
   గురుచంద్రములను - స్మృతిపధమందున । మరు ॥
2. మహిమాన్వితమగు - భగవత్తత్వము
   మహిమము దెలిపిన - మహితాత్ములను । మరు ॥
3. సకల కళాపరి - పూర్ణతగలిగిన
   అకలంకంబగు - గురుసుత్రాముల । మరు ॥
4. అతులితతేజో - విభవము గలిగిన
   సత్వనిష్ఠలగు - చరితార్ధులను । మరు ॥
5. పరమపవిత్రులు - పుణ్యచరిత్రులు
   గరిమతపోధన - వాగ్వృషభులను । మరు ॥

6. ఆత్మగుణములకు - ఆలవాలమై
శాంతిదాంతియుత - సచ్ఛీలురను । మరు ॥

7. యిక్ష్వాకులాంబుధి - పూర్ణశశాంకులు
కవిలోకమునకు - సార్వభౌములను । మరు ॥

8. వేదవేద్యుడగు - విష్ణునిసేవా
పథమునుజూపిన - బ్రహ్మమునీంద్రుడు । మరు ॥

9. పంకనిమగ్నుల - దరిజేర్చినయా
వేంకటాఖ్యగురు - చూడామణిని । మరు ॥

10. ఘనపురాణసుధ - సారమొదెలిపిన
శ్రీనివాసగురు - కుముదబాంధవుని । మరు ॥

11. ద్రవిడవేదమున - చవులూరించిన
కవిభట్టారక - దేశకమౌళిని - । మరు ॥

12. అంకితమయ్యెద - రామగాథకను
సంకల్పముగల - కృష్ణదాసార్యుని - । మరు ॥

13. పూడివాడపుర - స్థిరనివాసియై
వేడుకగూర్చెడి - గోపబాలకుని । మరు ॥

## శ్రీరామనామస్తుతి 5

1. శ్రీరామయను మంచిమాట
రారండి పలకండి మీ నోట యీ మాట । శ్రీరామ ।

2. అతిరమ్యమైనదీ మాట
శ్రుతులకందని బహుసొంపగు మాట । శ్రీరామ ।

3. లలితలావణ్య మీ మాట
వేలుపుల్ నుతిజేయు వెలలేనిమాట । శ్రీరామ ।

4. అపురూపమైనదీ మాట
అపహరింపగలేని బంగారుమూట । శ్రీరామ ।

5. సర్వము నిండిన మాట
సర్వమంత్ర జపసార మీ మాట । శ్రీరామ ।

6. కమ్మని రుచిగలమాట
నెమ్మది రంజింపజేయు పూదోట । శ్రీరామ ।

7. సాటిలేని మేటిమాట
మాటమాటకు సుధను పూరించు ఊట । శ్రీరామ ।

8. వేడుక గలిగించుమాట
వాడవాడలయందు వాడుక మాట । శ్రీరామ ।

9. శ్రీదేవికి జంటగు మాట
వందితాఖిల భక్తబృందము పంట । శ్రీరామ ।

10. కృష్ణాయను మధురమైన మాట
విష్ణుదాసగురు నిరసనపై తేట । శ్రీరామ ।

11. గోపాల మౌళియను మాట
శ్రీ పూడివాడలో వెలసిన కోట । శ్రీరామ ।

12. రామశ్రీరామయను మాట
కమలాదేవి శిరమున దాల్చు మకుట మీ మాట । శ్రీరామ ।

# శ్రీ మద్రామాయణ ప్రశంస

రచన : శ్రీమాన్ పండిత వేంకటాచలపతి గారు

శ్లో : రామాయణం రామరూపం
నిత్యం శ్రీరామదర్శనం
సీతారామయోశ్చరితం
సద్యోముక్తి ప్రదాయకం 1

శ్లోకాక్షరసమాయుక్తం
తంత్రీలయ సమన్వితం
విశేషభావ సంయుక్తం
వందే రామాయణం సదా 2

రామార్పణం రామహవిః
రామాగ్నౌ రాఘవేహుతం
రామేణ తేనగంతవ్యం
రామకర్మ సమాధినా 3

రామాయణం రామమయం
సీతారామ స్వవర్ణనం
సద్య ః ప్రాప్నోతి శ్రీరామం
రామచంద్రస్య కీర్తనాత్ 4

రామోరామోరామ ఇతి
నిత్యం శ్రీరామ కీర్తనాత్
అయోధ్యానిలయాత్ సర్వే
రామసాయుజ్య మాప్నుయాత్ 5

## శ్రీ మద్రామాయణ శతావృత్తపారాయణ మహోత్సవ సమయమున సమర్పించిన

# పద్యకుసుమాంజలి

కం:- చదివనది రామ కథయట
చదివించినవాడు గోపజనపాలుండౌ
చదివిన సఫలము భవమని
చదివితిరద్దాని నూరు సారులు మీరల్ 1

ఆ:- రామనామ భజన ప్రముదితంబుగ జేయ
పూడివాడ పుణ్యభూమి యయ్యె
నీదు పితరులధిక నిర్మలచరితులు
వారి గుణము మీకు వచ్చుటరుదె. 2

ఆ:- రామయనెడి యక్షరంబుల నోరార
నుడివినంత జనుల నొందు శుభము
అట్టి కావ్యమెల్ల ననవరతంబును
చదువు మీకు సాటి జగతిగలరె 3

ఆ:- రమ్యకావ్యమైన రామాయణము సర్వ
వర్ణములును చదువ వచ్చుననెడి
వరమునిచ్చెనిట్లు వల్మీక భవుడంచు
వాక్యసారమెల్ల వ్యక్తపరుప 4

తే:- అట్టి రాముని దివ్యగాథామృతంబు
నూరుమారులా వృత్తికి నుత్సహించు
వైఖరికివె ప్రోమావేల వందనములు
వేంకటాచలపతిగురు విశ్వవినుత 5

సీ:- స్థిరవిశిష్టాద్వైత సిద్ధాంతసారంబు
భువిని జల్లెను నీదు పూజ్య తండ్రి
ఆచార్య పురుషుల ఆదర్శ రచనచే
ఖ్యాతిగాంచెను నీదు అగ్రజుండు
వరతిరుప్పావై వివరణ వైఖరి చేత
శోభనొందెను నీదు సోదరుండు
వినుతరామాయణ విస్తార పఠనచే
విమ లురై మీరిట్లు వెలసినారు
కలియుగంబున కలిగెడి కలుషమతుల
కాచి రక్షింపదివి నుండి కనికరమున
విష్ణులోకంబు విడచిన విభులు గాక
మనుజమాత్రులె మీరు మామదినిజూడ 6

ఆ:- పూడివాడనెల్ల పుణ్యభూమి గజేసి
బద్ధచేతనుల సముద్ధరించి
మహిని భాష్యకార మహిమనుబోధింప
మాధవుండు మిమ్ము మాకు నిచ్చె. 7

తే:- భక్తిభావంబు మీమదిపదిల పడగ
సోదర యుతంబుగా జనిసొంపుమీర
విష్ణుగాధల శిష్యుల వెతలు మాన్పి
అంతమాత్రమె చాలదటంచు మీరు 8

సీ:- విష్ణుహవన యాగ విభవంబు చూపించి
బహుపురాణంబులు పఠనజేసి
నిత్యసూరివరుల నియతితో స్థాపించి
కోటి కుసుమార్చన కూర్మిజేసి
నిత్య హోమోత్సవ నేర్పరులై మీటి
దీపోత్సవంబుతో దీప్తి మెఱసి
భద్రశైలంబుపై బహు యాగమొనరించి
శ్రీరంగనాథుని చేరి కొలిచి
వేణుగోపాలు చరణాలు విడువకుండ
వెలుగు మీ రాశ్రితావళివెతలు దీర్చి
రామదివ్యగాధా ప్రచారంబుతోడ
వసుధవత్సర శతయు గవరలు గాత 9

ఆ:- ఆదిలక్ష్మి కెనయు అర్ధాంగి తోడుగా
కూడివచ్చి మీరు గుడిని జరుగు
పూజలందు ప్రొద్దుపుచ్చెడి భాగ్యంబు
కమల నయనుడెపుడు కలుగజేయు 10

విన్నవించు

పూడివాడ
11-02-2001

శిష్య పరమాణువు

పద్యాం గోపీచంద్రస్వామి

# శ్రీ వేణుగోపాల నామములు

రచన : మొవ్వదేవనాథసూరి (A.C.A)

శ్రీరామజయరామ శ్రీసీతారామా అను మాదిరి

వేణుగోపాల శ్రీవేణుగోపాలా
వెంకటదాసత్రాత – వేణుగోపాలా
పూడివాడవాస వేణుగోపాలా
వందనంబులువేలు వేణుగోపాలా 1

రాజ్యలక్ష్మియుత వేణుగోపాలా
రుక్మిణీనాథ శ్రీ వేణుగోపాలా
సత్యభామాప్రియ వేణుగోపాలా
గోదాదేవిసహిత – వేణుగోపాలా 2

హనుమాన్ పూజిత – వేణుగోపాలా
ఆళ్వారు సంయుక్త – వేణుగోపాలా
శ్రీనివాసనుత వేణుగోపాలా
కృష్ణదాసస్తుత వేణుగోపాలా 3

విష్ణుదాసవరద వేణుగోపాలా
రామప్రసాద్రక్ష వేణుగోపాలా
మత్స్యావతార శ్రీవేణుగోపాలా
సోమకాసురనాశ వేణుగోపాలా 4

కూర్మావతార శ్రీవేణుగోపాలా
కువలయోద్ధరణా వేణుగోపాలా
వరాహావతార వేణుగోపాలా
వసుధ సంరక్షణ వేణుగోపాలా 5

నరసింహరూపా వేణుగోపాలా
ప్రహ్లాదపాలన వేణుగోపాలా
వామనకార శ్రీవేణుగోపాలా
వినుత యాచకరూప వేణుగోపాలా 6

పరశుధర రామ వేణుగోపాలా
భూపాల మారణ వేణుగోపాలా
రఘుకులశేఖర వేణుగోపాలా
రాక్షసాంతకరామ వేణుగోపాలా 7

బుద్ధావతార శ్రీవేణుగోపాలా
బుధజన వందిత వేణుగోపాలా
బలభద్రరూపా వేణుగోపాలా
భక్తసంరక్షక వేణుగోపాలా 8

కల్క్యావ తారా శ్రీ వేణుగోపాలా
కలిదోషహరణా వేణుగోపాలా
దశరూపధరదేవ వేణుగోపాలా
ధరదాస పోషక వేణుగోపాలా 9

ఆ పన్నివారక – వేణుగోపాలా
ఆశ్రితపోషక – వేణుగోపాలా
వైజయంతీధర వేణుగోపాలా
వెంకటనగవాస వేణుగోపాలా 10

పీతాంబరధారి వేణుగోపాలా
కౌస్తుభవక్ష శ్రీవేణుగోపాలా
శేషతల్పశయన వేణుగోపాలా
రంగరాజరూప వేణుగోపాలా 11

భద్రగిరివాస వేణుగోపాలా
భక్తకల్ప భూజవేణుగోపాలా
శార్ఙ్గగదాధర వేణుగోపాలా
అభయ హస్తముద్ర వేణుగోపాలా 12

పాంచజన్యధర వేణుగోపాలా
కౌంతేయ రక్షక వేణుగోపాలా
కస్తూరితిలక శ్రీవేణుగోపాలా
వంశీగానలోల వేణుగోపాలా 13

శంఖ చక్రధారి వేణుగోపాలా
సరోజ సమనేత్ర వేణుగోపాలా
సాధుజనావన వేణుగోపాలా
యతిరాజ సన్నుత వేణుగోపాలా 14

సంతానప్రాప్తికి వేణుగోపాలా
ఆరోగ్య బలిమికి వేణుగోపాలా
ఐశ్వర్యసిద్ధికి వేణుగోపాలా
నిర్మలబుద్ధికి వేణుగోపాలా 15

నీ పాద భక్తికి వేణుగోపాలా
నీ వేగకారణము వేణుగోపాలా
యశోదవర్ధన వేణుగోపాలా
నందానందనబాల వేణుగోపాలా 16

కాళీయ మర్దన వేణుగోపాలా
కంసప్రాణ హర వేణుగోపాలా
ఇంద్రగర్వభంగ వేణుగోపాలా
విరించి వంచన వేణుగోపాలా 17

దేవకీనందన వేణుగోపాలా
వసుదేవ వరపుత్ర వేణుగోపాలా
దేవనాథ నుత వేణుగోపాలా
వెంకటదాస ప్రాప్త వేణుగోపాలా 18

వందనంబులు నీకు వేణుగోపాలా
వాంఛలీ డేర్పుము వేణుగోపాలా
పురజనపాలన వేణుగోపాలా
పూడివాడవాస వేణుగోపాలా 19

శ్రీమతేరామానుజాయనమః శ్రీ వేంకటగురుభ్యోనమః

భాగవతసురభూజమునందలి కీర్తనలు అకారాదిక్రమములో

| | | | | |
|---|---|---|---|---|
| 43 | 53 | 31 | నీ పరతత్త్వంబెఱుంగక | కమాచి - ఆది |
| 44 | 58 | 38 | నీ ప్రభావంబెన్నవశమా ? | మోహన - అట |
| 45 | 69 | 48 | నిలువదీ తనువు | కల్యాణి - చతురశ్ర |
| 46 | 47 | 22 | నీ సౌశీల్యం బెన్నగదరమా ? | కనకాంబరి - ఆది |
| 47 | 111 | 99 | నే వెఱ్ఱినా ? తల్లిరో। మన్నుదినగ | ముఖారి - అట |
| 48 | 111 | 100 | పరమాత్మ నీ మృదు పాదములకే | కాంభోజి - అట |
| 49 | 34 | 5 | పరాంకుశమునీంద్రా। | కనకాంబరి - జుల్వ |
| 50 | 52 | 29 | పరిచర్యలొనరించెను శ్రీరామ | కల్యాణి - అట |
| 51 | 94 | 76 | పలలము దినవలెనా? | కల్యాణి - ఆది |
| 52 | 120 | 111 | పండరి పురినాథుని మంజుల శ్రీపాదములు | |
| 53 | 90 | 72 | పిల్లవాడంటివేమమ్మా। చంటిపిల్ల | శంకరాభరణ-జుల్వ |
| 54 | 119 | 110 | పుండరీకాక్ష। ముకుంద | |
| 55 | 54 | 32 | ఫణిరాజశయన। | రిషభాంగి - చతురశ్ర |
| 56 | 41 | 14 | పాదపద్మములాశ్రయింతు। శ్రీరామ | సురట - అట |
| 57 | 106 | 92 | పాదముల్ గొనియాడెద | కాంభోజి - అట |
| 58 | 101 | 85 | పామరులకెఱుంగశక్యమా ? । | బేయూగ్ - జుల్వ |
| 59 | 102 | 86 | పామరులొకవేళ తెలియుదురు। | జంఝూటి - ఆది |
| 60 | 76 | 56 | భక్తిరాజ్యములోన జేరండి ।జనులార | నాటక - మిశ్ర |
| 61 | 108 | 95 | భక్తిరాజ్యమార్జించండి | సరట - ఆది |
| 62 | 54 | 33 | బాల్యమహిమవర్ణింతున్ - | ఫేనద్యుతి - ఆది |
| 63 | 49 | 24 | బలిమిట్టిదనశక్యమా ? గోవిందానీ | భైరవి - మిశ్ర |
| 64 | 103 | 88 | బలు విస్మయము గదా ? | సింహేంద్ర మధ్యమ - జుల్వ |
| 65 | 73 | 52 | బేలతనము గాదా మనుజులకు | మలహారి - ఆది |

89 71 50 వాడే జగధీశుండు బ్రహ్మాండము ఖరహరప్రియ – ఆది
90 75 54 వాడు దుర్జనుండు శ్రీహరి చక్రవాకము – ఆది
91 72 51 వాడు రక్షకుండు – జీవులకు నట–భైరవి–ఆది
92 48 23 వారిజాక్షశ్రీలలా। నాకోరికలొసగవదేల ?
93 110 97 వినుతించెదన్ – విష్ణుదేవ శ్రీరాగము – ఆది
94 65 45 వింతవింతగ దోచుననోయన్నా। ఆనందభైరవి–అట
95 118 107 విఠలనాథా। ఏమి సేతును ?
96 100 84 వింతయై కనుపట్టు నిమ్మేను సావేరి – అట
97 39 12 వేదాంత గురుని సేవింతున్ సురట – ఆది
98 77a 59 వైరాగ్మమార్జించవలెరా ఆరభి – అట
99 36 8 శరణు శరణు యతిరాజా మనోరంజని–జుల్వ
100 105 89 శరణంటి రామా। నీ చరణబబ్జములకు తోడి – ఆది
101 32 1 శ్రీ జ్ఞానకీవరం। భజేహం హంసధ్వని – ఆది
102 83 67 శ్రీభాష్యకారయోగీంద్ర। వైష్ణవకుల
103 81 66 శ్రీరంగరాజ। భూభారవిధ్వంసన
104 85 68 శ్రీరానుజయోగీంద్ర – పాదముల
105 37 9 శ్రీ రామానుజయోగివర్య। ముఖారి – జుల్వ
106 64 44 శ్రీరామాయన దీరిక లేదటి నవరోజు – ఆది
107 56 35 సన్నుతించెదను రామా। జూతలిడి జయసింధు – జుల్వ
108 115 105 సరసిజాలయా। క్షీరసాగరతనయా। కల్యాణి – చతురశ్ర
109 46 21 సంకల్పము వర్ణింపగదరమా ? నాట–చతురశ్ర
110 58 37 సాక్షాత్కరింపుమయ్య। కృష్ణదేవ। హంసధ్వని–ఆది
111 49 25 సామర్థ్యమెన్నంగవశమా ? మధ్యమావతి – త్రిశ్రజాతి.

## శ్రీ వేణుగోపాల సేవాశ్రమాధిపతులు వారి కుటుంబ సభ్యులు వెలువరించిన గ్రంథము

### శ్రీ భాష్యకార సమాజస్థాపకులు

1) మహర్షి శ్రీ మొవ్వవెంకటదాసస్వామి రచనలు పద్య కావ్యములు

1) గోపికావిలాసము 2) సీతారామ ప్రభావము 3) లక్ష్మీస్తవము

వచనగ్రంథములు

4) వరవరముని హృదయము 5) జ్ఞాన సూర్యోదయము

6) భాగవత సురభూజము

(అముద్రితములు పెక్కు హరికథలు సంస్కృతాంధ్రగ్రంథములుగలవు)

2) వారిపెద్దకుమారులున్యాయవిశారద శ్రీ శ్రీనివాస పెరుమాళ్ళుగారు

7) శేషనగేశస్తవము (పద్యకావ్యం) 8) పూర్వాచార్య చరిత్రము

9) దివ్య సూరిహృదయము 10) ఆచార్య పురుషులచరిత్ర

3) వారి మూడవకుమారులు కవిభట్టారక విష్ణుదాసుగారు

దాశరధిసూరి గారివి

11) తపో మహిమ (వచనములు) 12) కావ్యకళ

13) భారతగానము (పద్యకావ్యములు)14)చిత్రాంగద(నాటకము)

4) వారి చిన్న కుమార్తె శ్రీమతి తన్నీరు కమలాదేవిగారు

15) తపఃఫలము (వచనము)

5) వారి ప్రధమపౌత్రులుశ్రీశ్రీనివాస పెరుమాళ్ళుగారి పెద్దకుమారులు

ఉపన్యాస చతురానన శ్రీవృషాద్రిపతిగారివి (16-20)

ఉపనిషద్వాణి ప్రధమ,ద్వితీయ,తృతీయ,చతుర్థ,పంచమ భాగములు

పద్యకావ్యములు

21) సోమనాద్రి 22) హరిహరాత్మ విజయము

23) పద్మావతీ శ్రీనివాసీయము 24) కన్నెవాగు

25) విశ్వగాయత్రి 26) లలితాస్తవము27) భారత జ్యోతి

28) భావమందాకిని 29) విరి దండ 30) తపస్సిద్ధి
31) నీలాసుందరీ పరిణయము (వ్యాఖ్యానము)

**పౌరాణిక నాటకములు**

32) ప్రతిజ్ఞార్జునీయము 33) దానరాధేయ

**వచన గ్రంధములు**

34) జ్ఞాన తరంగములు 35) కన్యకావిజయము 36) తత్త్వ దీపిక
37) శ్రీ కృష్ణరాయ వైభవము 38) విదురనీతి సారము

**శతకములు**

39) శ్రీ వేంకటేశ్వర శతకము 40) పద్మావతీ శతకము
41) మాల్యాద్రి నరసింహ శతకము
42) కసాపురాంజనేయశతకము 43) రేపల్లె వీరాంజనేయ శతకము
44) గర్తపురి శ్రీ వేంకటేశ్వర స్తోత్రము
ఇంకనూ అముద్రితములు పెక్కుగలవు.

6) వారి రెండవ కుమారులు శ్రీమాన్ వేంకటాచలపతిగారికుమారుడు శ్రీ సరోజనాభుడు గారు ప్రకటించినవి.

45) శ్రీమద్రామానుజగద్యత్రయం
(టీకాతాత్పర్య కర్త శ్రీ వక్కపట్ల వృషాద్రిపతిగారు)

పై గ్రంధములు వలయువారు క్రింది అడ్రసుల ద్వారా పొందవచ్చును.

1) **శ్రీమాన్ మొవ్వ వేంకటాచలపతిగారు**
శ్రీ వేణుగోపాల సేవాశ్రమము పూడివాడ (పోష్టు) 522268
నగరం (మండలం) గుంటూరు (జిల్లా) ఫోను 08648 56050.

2) **శ్రీమతి మొవ్వ పద్మాలయాదేవిగారు**
W/O శ్రీ వృషాద్రిపతిగారు
ఉప్పూడి రోడ్డు,
రేపల్లె 522 625గుంటూరు (జిల్లా) ఫోన్ 08648 22199



పన్యాల కుటుంబయ్యగారు, వారి ధర్మపత్ని బసవపున్నమ్మ గారు, మోదుమూడి

